# ఆంధ్రీకృత

# శివలీలార్ణవము



రచయిత

దువ్వూరి సూర్యనారాయణశాస్త్రి

# ఆంధ్రీకృత
# శివతత్త్వార్ణవము

C Krishna ...



రచయిత

దువ్వూరి సూర్యనారాయణశాస్త్రి
M. S. N. C. M. P. స్కూలు,
కాకినాడ.

# పండితాభిప్రాయములు



## ఉప్పులూర్యుపాఖ్యేన గణపతిశాస్త్రిణా సహర్షాశీర్వాదం సంప్రేషితా ఇయం భావప్రకాశికా పత్రికా.

నిపుణకవివరేణ్యేన M. S. N. C. M. P. పాఠశాలాంధ్రాధ్యాపకేన దువ్వూరి సూర్యనారాయణశాస్త్రిణా ఆంధ్రభాషాయాం అనూదితం శివలీలార్ణవనామకం గ్రంథరత్నం అనువాదకముఖాదేవ బహుషు ప్రదేశేషు స్థాలీపులాకన్యాయేన అశ్రౌషమ్.

ఇయ మాంధ్రీకృతిః సహృదయానాం విద్వద్వరేణ్యానాం అభూతపూర్వ మానందం జనయిష్యతీతి మన్యే.

అద్యయావత్ అనేకై ర్బుద్ధిమద్భి రాంధ్రీకృత్య సంప్రేషితాన్ అనేకాన్ గ్రంథరాజా నహ మద్రాక్షమ్. యత్ర క్వాపి ఏతాదృశో నైవ దరీదృశ్యతే. ప్రాచీనగ్రంథా ఏవ ఆంధ్రీకృతాః విరళాః, యత్ర క్వచన యద్యాంధ్రీకృతాః స్యుః తేచ తత్తద్గ్రంథ కర్తృప్రయుక్త సమస్తపదాన్యేవ ఆంధ్రప్రత్యయశిరాంసి సముద్వహంతః ప్రయాసమాత్ర ప్రయోజనాః నైవ లోకోపకారాయ కల్పేరన్.

మూలగ్రంథోస్య జగత్ప్రసిద్ధ శ్రీమదప్పయ దీక్షితచరణానాం ప్రపౌత్రేణ సర్వతోముఖ వైదుష్యప్రతిభాశాలినా నీలకంఠదీక్షితేన సంస్కృతభాషాయాం విరచితః ద్వావింశతిసర్గాత్మకః నిసర్గోజ్జ్వలః నిఖిలశాస్త్రీయసిద్ధాంతసుశోభితః నారికేళపాకానుయాయీ వ్యాఖ్యావిరహితః అతఏవ సుప్రసిద్ధ విదుషామపి అన్వేతుం దుష్కరః. తస్యేయ మాంధ్రీకృతిః సమీచీనసరణ్యా రచితా వ్యుత్పిత్సూనాం విదుషాంచ

మహాంత ముపకార మాధాయ సకలశాస్త్రీయగ్రంథాన్వయ పాటవం సంపాదయిష్యతీ త్యేత న్నిర్వివాదమ్.

యది అవశ్యం ఏతాదృశో గ్రంథమణిః అధునాతనాసు భాషాప్రవీణేత్యాది విచిత్రనామాంకితకక్ష్యాచిత్రితాసు కళాశాలాసు అవశ్యాధ్యేతవ్యత్వేన నియమితః తర్హి ఏతద్గ్రంథోపయోగః సర్వేషాం సువిదితో భవతీ త్యాశాస్మహే.

కించ అయం సూర్యనారాయణశాస్త్రీ ఇతఃపూర్వం నీలకంఠ దీక్షితవిరచితం అన్యం నీలకంఠవిజయాఖ్యం గ్రంథరాజ మాంధ్ర భాషాయాం అనూద్య విదుషాం మహతీం ముద ముదవహత్.

అధునా ద్విత్రపదాఽనతిరేకేణైవ సమస్తపదాని ప్రయుజ్య సుధారసనిష్యందినీభిః లలితలలితాభిః వాగ్భిః అనతివిస్తీర్ణం శివలీలార్ణవనామకం ప్రకృతగ్రంథరాజం విరచ్య సర్వేషాం ఆనంద ముత్పాద్య ఆత్మానం కృతార్థయతః కృతినః చిరంజీవినః అస్య యశశ్చంద్రికా గ్రంథరాజేనసాకం ఆచంద్రార్క మభివర్ధతా మితి శివమ్.

19-1-1967,
శ్వేతనగర్,
దయాల్‌బాగ్, ఆగ్రా.

వేదభాష్యాలంకార, వేదభాష్య విశారద,
ఉప్పులూరి గణపతిశాస్త్రీ.

---

ఆర్షవిద్యాభూషణ,
ఆంధ్రప్రదేశ్ విశ్వహిందూపరిషదధ్యక్షులు,
**జటావల్లభుల పురుషోత్తం, ఎం. ఏ.**
రిటైర్డు కొవ్వూరుసంస్కృతకళాశాలా ప్రిన్సిపల్-
సంస్కృతశాఖాధ్యక్షుఁడు,
విజయవాడ, కాకినాడ ప్రభుత్వకళాశాలలు.

శ్రీనీలకంఠదీక్షితవిరచితకావ్యముల కింతవఱకు నాంధ్రదేశములోఁ దగినంతవ్యాప్తి లేదు. ఒకప్పు డేతత్కవికృతమైన నీలకంఠవిజయచంపూగ్రంథము ప్రభుత్వసంస్కృతప్రవేశపరీక్షకుఁ బాఠ్యగ్రంథముగామాత్ర ముండెను.

వక్రోక్తికిఁ బ్రసిద్ధి చెందినయీకవికి దక్షిణదేశములో విపులవ్యాప్తి కలదు. ఆంధ్రుల కీకవిని బరిచితుని గావించుపుణ్యము దక్కించుకొన్నవారిలో ముఖ్యుడు ప్రకృతానువాదకర్త శ్రీ దువ్వూరి సూర్యనారాయణశాస్త్రి. నీలకంఠవిజయచంపువునకువలెనే పిమ్మట యీ శివలీలార్ణవమునకుఁ గూడ నీతఁడే ప్రథమాంధ్రీకర్త.

ఈగ్రంథమునకు శివలీలార్ణవపదము సార్థకము. శివమహిమను శివభక్తిమహత్త్వమును వేనోళ్లఁ జాటు పురాణప్రసిద్ధకథ లిందుఁ గ్రోడీకరింపఁబడియున్నవి. శైవగాథలను గ్రోడీకరించుగ్రంథము లింకను నెన్నియో యున్నను నాకథలకును నిందలికథలకును గల భేదము పేర్కొనఁదగినది. ఇందలికథలు క్రోధభయానకరసప్రధానములుగాక శాంతాద్భుతరసప్రధానములై మృదులలితభావబంధురములై యలరారుచున్నవి. పరమేశ్వరుని భక్తవత్సలతను భక్తికిఁ గల సర్వసాధకశక్తిని నిరూపించునీగ్రంథము కేవలము శైవవాఙ్మయమునకే కాక సమస్తభక్తివాఙ్మయమునకును నలంకారమని చెప్పవచ్చును. ఇందలిశివశబ్దమునకు బదులుగా దేవదేవశబ్దమును వాడు

కొని వైష్ణవాదులు గూడ దీనిని బూజ్యగ్రంథముగా భావించుకొనఁ గలరనుట యత్యుక్తి కాదు.

ఏతద్గ్రంథోదాత్తతకుఁ దగినశైలిలో శ్రీసూర్యనారాయణశాస్త్రి దీని నాంధ్రీకరించియున్నాఁడు. ప్రచురముగాఁ బద్యములను గ్రావిత్కముగా వచనములను గల్గియున్న యీయాంధ్రశివలీలార్ణవము ఆంధ్రభాషాయోషకమర్పఁబడినవినూత్నభూషయనుట స్వభావోక్తి.

ఆంధ్రీకర్త యాంధ్రగీర్వాణములలో విశ్వవిద్యాలయబిరుదమునేకాక విద్వజ్జనాభినందితపాండిత్యమును గూడ సంపాదించి గద్యపద్యరచనలో నారితేరినచేయియై ప్రసిద్ధకవిమండలిలో స్థానము నందుకొని యున్నాఁడు. విమర్శశక్తి పాండితికిఁ దోడుకాఁగా రెంటికిని సహజసరసకవితాధోరణి సాయపడగా అదోషము, సగుణము, సాలంకారము నగుకవితారచన చేయుటలో నీతఁ డెన్నిక గనియుండి యింతవఱకు సాగినతనరచనలకుఁ దలమానిక మనఁదగినయీగ్రంథమును మన కందించుచున్నాఁడు. చిరకాలోపాధ్యాయపదవీనిర్వహణము వలనను, శ్రీసూర్యరాయాంధ్ర నిఘంటు నిర్మాణమునఁ గల్గిన కతిపయవర్షానుభవమువలనను నేర్పడినలాక్షణికతాప్రాభవమున కనుగుణముగా నీగ్రంథము మఱెవ్వరికిని వ్రేలెత్తిచూపుటకు వీలుకాని ధోరణిలో రూపొందినది.

తేనెసోన లొలికించు నేతత్కవివాణీవిలాసము సహృదయుల నెల్లరిని రంజింపఁజేసి నేటి యాంధ్రసారస్వతమునకే యొక తేజస్సును గూర్చ ననుటలో సందియము లేదు.

జటావల్లభుల పురుషోత్తము
కాకినాడ.

వెంపరాల సూర్యనారాయణశాస్త్రి,
రిటైర్డు తెలుగు లెక్చరర్, ఛానోజీకళాశాల,
అమలాపురం,

చిరంజీవి దువ్వూరి సూర్యనారాయణశాస్త్రి లోగడ జీమూతవాహనుఁడు, భక్తశబరి, అహల్య మున్నగుఖండకావ్యములు రచించుటను, ఆంధ్ర, మదరాసు, ఉత్కలవిశ్వవిద్యాలయములలో నవి యున్నతకక్ష్యలకు పాఠ్యము లగుటను వారికవితతోఁ బరిచయము గలవారిలో నే నొకండను. అవన్నియు స్వతంత్రగ్రంథములేగాని యనువాదములు కావు. అందు వీరికవిత స్వేచ్ఛగా నడువ నవకాశ ముండుటచే నంత ధారాళముగా నడచినదనుకొనువాఁడను.

నేఁటివీరిరచన మగుశివలీలార్ణవాంధ్రీకృతిచూచి యచ్చెరు వొందితిని. వెనుక నీలకంఠదీక్షితులరచనయే యగునీలకంఠవిజయ చంపువునుగూడ వీ రాంధ్రీకరించియుండుట జనవిదితము. సంస్కృత వాఙ్మయమున వక్రోక్తికవితకు ప్రసిద్ధి కెక్కి శాస్త్రపండితులలో దిట్ట యగునీలకంఠదీక్షితునికావ్యము లాంధ్రమునఁ బరివర్తనముసేయు టన్న నసాధ్య మని కవి యగువాఁ డెవ్వఁ డెఱుంగడు ? అట్టియనన్యసాధ్యకృతికిఁ బూని సహజముగ వెలువడినరీతి సగభాగము యథామూలము- మిగిలినది భావానువాదముగా నేకాకార మగుశయ్యతో నీకావ్యమును వీ రనువదించి రన నత్యద్భుతవిషయ మని నాకుఁదోఁచినవిషయము. ఇందలి 'కావ్యముఖము' కవిపండితులు తప్పక చదువ వగినది.

ఈకావ్యమూల మిరువదిరెండుసర్గములు కలది. వ్యాఖ్యానాధారము లేనిది. అది మైదుతరంగములుగ తెనుఁగున విభాగింపఁబడినది. "పావని మధురానిలయే— పాండ్యరాజతనయే" అన్నరీతి గారిని

పాండ్యరాజునకు తనయయై మీనాక్షిగా మధురలో నవతరించుటయు, పాండ్యరాజు లందఱును వంశములతరబడి మీనాక్షీసుందరేశభక్తులగుటయు, వారెల్ల సుందరేశానుగ్రహము నందుటయు, మొత్తము అరువదికి మించినశివలీల లిందు భక్తిపూరితముగ వర్ణితములు.

శ్రీసూర్యరాయాంధ్రనిఘంటునిర్మాణకార్యకలనఁ బాల్గొన్న పండితులలో నీసూర్యనారాయణశాస్త్రిగా రొక రనిన వీరిసంస్కారమునుగూర్చి వేఱ చెప్పనక్కఱలేదు. ఇఁక కవితావిషయమున ప్రసన్నమై నిర్దుష్టమైనభాషతో మనోహరరచనతో నలరారువెనుకటికావ్యములే నిదర్శనములు. అంతకంటెను వ్యంగ్యములతో వక్రోక్తులతో పెక్కుశాస్త్రసిద్ధాంతములతో నిబిడమై అలంకారాలంకృతమై యనువాదమున కసాధ్య మనిపించునీశివలీలార్ణవమహాకావ్యము యొక్క ఆంధ్రీకృతి కవితారంగమున వీరి కొక విశిష్టస్థాన మొసంగుచున్నది. అపూర్వమగు నియ్యనువాద మాంధ్రశారద కొకనూతనాలంకారమై సహృదయహృదయావర్జన మొనర్చుకొనితీఱు నని నా నిశ్చితాభిప్రాయము.

ఇట్లు శ్రేయోభిలాషి,

**వెంపరాల సూర్యనారాయణశాస్త్రి.**

---

# విద్వాన్ దువ్వూరి వెంకటరమణశాస్త్రి.

రిటైర్డు యూనివర్సిటీ తెలుఁగు లెక్చరర్. వాల్తేరు.

దువ్వూరి సూర్యనారాయణశాస్త్రి రచించిన యీశివలీలార్ణవ కావ్యము నీలకంఠదీక్షితుల సంస్కృతగ్రంథమున కనువాదము. దీక్షితు లద్వితీయపండితుఁడు. దాక్షిణాత్యుఁడు. క్రీ. శ. 17 వ శతాబ్దివాఁడు. ఇతనికృతులలో నీలకంఠవిజయచంపువు, శివలీలార్ణవము ననునవి ప్రధానప్రౌఢప్రబంధములు. ఇందు మొదటిదాని నీసూర్యనారాయణ శాస్త్రియే తెనుఁగున ననువదించి యీవఱకే యాంధ్రుల కందించి యుండెను. నేఁ డీశివలీలార్ణవముకూడ నితనిచే నాంధ్రీకృతమై వెలువడినది.

స్వతంత్రగ్రంథరచనమునకన్న ననువాదరచనమున రచయితకు క్లేశ మధికము. భావానువాదము గాక యన్యూనాతిప్రసక్త మగు యథామూలానువాదము మఱింత క్లేశదాయకము. మఱియు నీశివ లీలార్ణవమువంటికృతి నాంధ్రీకరించుట కడుంగడు కష్టసాధ్యము. ఏలయన దీక్షితులకవిత వక్రోక్తివిలసితము, గూఢోక్తిబహులము, లలితోక్తిప్రచురము, చమత్కృతిసంగతము. ఇవన్నియు నిందలి కావ్యముఖము, చూచినవారికి గోచరించును—ఈయన శ్రుతిస్మృతి శాస్త్రసాహితీసంప్రదాయముల నెన్నిటినో తనకైతలో జొప్పించు సామర్థ్యమును, కౌశలమును, కుతూహలమును గల పటుతరపాండితీ వైభవసంపన్నుఁడు. వీరిసంస్కృతరచనమునందలి కవిహృదయమును సాక్షాత్కరింపఁజేసికొనుట సాధారణము కాదు. దాని కెంతో సంప్ర దాయజ్ఞతయు సూక్ష్మదర్శనమును ఆవశ్యకములు. అద్దాని నాంధ్ర మున ననువదించుట క్లేశకరము. ఇట్టిక్లిష్టకావ్యము చేపట్టి దు. సూ. శాస్త్రి తన కొదవినయనుభవముచే మూలకవిహృదయమును ససాక

ల్యముగ గుర్తించి దాని నాంధ్రమున పొదిగి చూపినకౌశలము కోవిదులమెప్పు లందక తప్పదు.

ఈయాంధ్రీకృతిని ఈతనిముఖముననే పెక్కుతావుల వినియుంటిని. గౌరి పాండ్యరాజకులమున నుద్భవించుట— శివుని పెండ్లాడుట— వారే మధురానగరమున మీనాక్షీసుందరేశ్వరులై వెలయుట— వారిని సేవించిన పాండ్యవంశీయులకెల్ల వారిలవేల్పు లగుట— తమ్ము సేవించిన పాండ్యరాజులను సుందరేశ్వరుఁడు పెక్కులీలలు చూపి యనుగ్రహించుట— స్థానికులగు మఱికొందఱు భక్తుల నుద్ధరించుట— యిందలి యితివృత్తము. మధురలోని స్థల— దేవాయతన— గోపురనిర్మాణతత్త్వముగూడ నిందుఁ గలదు. పైవిషయములెల్ల శివపురాణప్రసిద్ధములు.

ఈకావ్యమందు దీక్షితులు తనప్రతిభను సర్వతోముఖముగ వెలార్చియుండెను. ఇది సకలగీర్వాణవాణీవిలాసముల కాటపట్టయి ప్రౌఢతరకావ్యముగా నెన్నఁబడుచున్నది. ఈగ్రంథ మింతదనుక నాంధ్రములోని కనువదింపఁబడి యుండలే దనుట సునిశ్చితము. ఈ దు. సూ. శాస్త్రి, వావిలో నాకన్న పెద్ద. వయసునకు చిన్న. సగోత్రుఁడు, సంతతసన్నిహితుఁడు. అయినను ఈతనికవితయెడ నేర్పడిననాయభిరుచిని ఆమోదమును బట్టి కొన్నిమాటలు వ్రాయక తప్పదు.

అనువాదకునియాంధ్రకవితాకోమలత పాఠకుల కపరిచితము గాదు. అహల్య, భక్తశబరి, నీలకంఠవిజయము మున్నగునీతనిపద్యకృతులు ఆంధ్రదేశమున ప్రచారగౌరవము లంది యున్నతకక్ష్యలకు పాఠ్యము లైనవి. ప్రకృత మీశివలీలార్ణవకావ్యానువాదము సరళముగా సాగినది. ఆత్మీయుఁ డగుటచే నీతనికవితాభంగుల మానోజ్ఞకమును ప్రశంసించుట కించుక సంకోచము తప్పదు. ఇతఁడు ప్రాచీనాం

ధకవులపద్ధతుల నుజ్జగింపలేదు. మూలమునందలి యున్నతభావములు విడువలేదు. ఇందలి శ్రౌతశాస్త్రసంప్రదాయములు పరిశీలితములై విశదముగ ననువదింపఁబడినవి. శ్లేష మున్నను వక్రోక్తిశ్లేషాదుల నుపేక్షింపలేదు. అనువాదనిర్బంధ మున్నను కవితామార్దవము తప్పనీయలేదు. ఇందు పదిసర్గములు యథామూలముగను మిగిలినది భావానువాదముగను చిత్రింపఁబడెను. యథామూలానువాదమునందు కన్న భావానువాదమం దీతనినిసర్గకవితాపాటవము పాఠకులు గుర్తింపఁగలరు. ఇందలిభాష నిర్దుష్టముగా— జాతీయబహుళముగా సాగినదని నాదృఢవిశ్వాసము.

మఱియుఁ గొన్నితావుల నమూలకముగ స్వతంత్రించి కొన్ని వర్ణనములు— కొన్నిపద్యములును రసపుష్టికై కూర్పఁబడినవి. తటాతకావర్ణనమున సీసమాలిక మూలమందలి పదములు కలుపుకొనుచు లలితాస్తుతిని స్మరింపఁజేయుచు నడచినది. పంచమతరంగమున 239 పద్యము మొదలు 245 వఱకు గలపద్యములు కవికల్పితములు హృద్యములు. అట్లే మఱికొన్నితావులందు రసపుష్టిలేని విషయములు సంగ్రహింపఁబడినవి. మూలమందలి తటాతకాజైత్రయాత్రలోఁ గొంతపర్యటనము కుదింపఁబడినది. శివునిసిద్ధమహిమాప్రదర్శనముల సారమే గ్రహింపఁబడినది. శంకరుఁడు కూలివాఁడై ప్రదర్శించిన చిలిపిచేష్టలు కొన్ని తగ్గింపఁబడినవి. ఇందు "నిధనపతీనతి" అను 245 పద్యము— "నిధనపతయే నమః" అను శ్రుతి కనువాదము. ఇందు రమ్యమైన కొన్ని ఘట్టములు :—

1. తటాతకాశంకరుల వివాహము 2. కుండోదరభోజనము 3. వైశ్యాంగనలకు వలయదానము 4. శిలాగజముచే నిక్షుభక్షణము 5. వాతపురీశు ననుగ్రహించుట 6. పౌరకృతహరస్తుతి

7. మహాప్రళయము 8. కవిసంఘమునకు ఫలకదానము మున్నగు నవి తత్తద్రసాను గుణరచనలు. ఇందలి కీరకవి చరితయే నత్కీరు చరితగా కాళహస్తీశ్వర మాహాత్మ్యమున వర్ణితము. కాని యిందలి కథావిన్యాస ముదాత్తముగ నున్నది.

ఈకావ్యమం దచ్చటచ్చటి కొన్నియనువాదసరణులు :—

"అన్విష్య ఖిన్నం నిగమా నశేషా
నమీ న మీనం ప్రథమం స్మరామః
అన్విష్యమాణం నిగమై రశేషై
రంబ స్త్వమస్తే వయ మక్షిమీనమ్."

నిఖిలనిగమమ్ములను దానె నెమకి నెమకి
యలసి సొలసినమీనముం దలపనేల ?
నిగమములచే నిరంతరాన్విష్యమాణ
మైన నీనేత్రమీనము నంబ ! దలఁతు.

"అనాహతోద్భూత మపాస్తభేద
మాద్యం. శివస్యాపయికం విధాతుః
నాదాభిధం పారగమధ్వనాం త
దనుత్తరం జ్యోతి రనుస్మరామః."

మొదట ననాహతమ్మున సముద్భవమంది నిరస్తభేదమై
మొదలిటిదై మహానటునిమూర్తికె లభ్యమునౌచు మోక్షపుం
బథమునఁ బోవువారలకుఁ బారగమై నినదస్వరూపమై
పొదలుననుత్తరం బయినపూర్ణమహస్సుఁ దలంతు నెమ్మదిన్.

"కిమస్య మంజీరపదే కృతాలయాః
పరీత్య ముక్తా స్ఫురణాం నిషేవతే

మహోత్సవం ద్రష్టు మిమం మహౌజసః
సకృత్పునః సంసరణం భవత్వితి."

సేవకవృత్తి నందెలను జేరి వసించి తరించియున్నము
క్తావలు లీస్వయంవరమహంబును గాంచెద మన్నయాశ లో
నావహిలంగ శంకర ! దయామయ ! సంసృతి నొక్కసారి మా
కీవె యటంచుఁ గోరినటులే జగదీశుపదంబు లంటెడిన్.

"శచీ తదీయాద్భుతరూపదర్శనే
సహస్ర మక్ష్ణాం స్వయ మిచ్ఛతీసతీ
సకృత్త్రపత్వాపి చకాంక్ష గౌతమే
బలా దహల్యాకృతశాప మాత్మనః"

తన కొకసారి వేగనులు దాఁపురమైనఁ దదద్భుతాకృతిం
గనఁ దరమా నటంచు శచి కాంక్ష యొనర్చియు గౌతమర్షిపై
చన విడఁగా నహల్య యిడుశాపము నన్నును సోఁకెనేని నా
జని తరియించు నంచును నిజంబుగఁ గాంక్ష యొనర్చె నత్తఱిన్.

"యది మరుద్విజితో విజితం మనో
యది మనోవిజితం విజితం జగత్
జితవతాం మరుతం చ తదర్వతాం
కిమభిధేయ మతః త్రిజగజ్జయే"

వాయువునే జయింపఁగలవారికిఁ జిత్తజయంబునుం దృణ
ప్రాయము, చిత్తముం గెలుచువారలు లోకములెల్ల గెల్తు రీ
న్యాయముఁబట్టి వాయువును స్వాంతము గెల్చినయశ్వరాజముల్
హాయిగ గెల్వవే జగము లన్నిటినిం త్రుటిలో రయోద్ధతిన్.

ఈయనువాదము తప్పక పెద్దలమెప్పు నందఁగలదని నావిశ్వాసము. ఈసరసకృతి నాంధ్రమునకుఁ దెచ్చినయనువాదకునిపరిశ్రమకు సహృదయుల నమ్మోదమే సఫలతాపాదకము. ఈతఁ డిట్టియమూల్యము లగుమఱికొన్ని కృతులు వెలయించి తనకొదవిన గీర్వాణవాణీపాటవమును, ఆంధ్రకవితాకౌశలమును సార్థకపఱుపఁగలఁ డని ఆశించుచుందును.

మసకపల్లి,<br>
14–1–68.

దువ్వూరి వెంకటరమణశాస్త్రి.

## ధ న్య వా ద ము లు

అడిగినంతనే యీశివలీలార్ణవకావ్యముపై దమ యమూల్యాభిప్రాయము లొసంగి నన్నాశీర్వదించిన పైవిద్వత్పండితవర్యులకు నానమోవాకములు. గ్రంథము నోపికతో నిర్దుష్టముగా ముద్రించిన శ్రీ శ్రీపతిప్రెస్సువారి నభినందింతును.

దు. సూ. శాస్త్రి.

## పంచమతరంగములో నీపద్యములను జేర్పవలెను.

ఆడె నఘోరుఁ డంచు శ్రుతి యాపయి నీకలరూ పెఱుంగుటన్
గాఁడఁగ ఘోర ఘోరతరుఁగా నిను నెన్నను, కానినాఁడు నా
గోడు తొలంచకుండు టతిఘోరముకాదె ? యుపేక్ష చూపినం
ద్రాడును బొంగరంబు గలదా మఱి నాకిఁక? నాదిభిక్షువా ! 244

హంతవు శూలి వుగ్రుఁడ వటంచును ఢంకను దెబ్బకొట్టి హా
హంత ! వచింప వేదము రహస్యము నే నెఱుగంగలేక యీ
వంత తొలంప నీదువరివస్యల నుంటి, బిడాలమూషికా
క్రాంతిగ నుండె నీపస హహా ! కరుణింపఁగదే దిగంబరా !

గరలము కూడు నీకు నళికంబునఁ జిచ్చఱకన్ను నీకు దు
ర్భరవిషపూత్కృతుల్ నెఱపుపాములు భూషలు నీకు నాయుధం
బరయఁ ద్రిశూల మాకృతి దిగంబర మాను పిశాచనాథతన్
దిరిగెదు ప్రేతభూముల, మదిన్ దయ కెక్కడిచోటు ? ధూర్జటీ !

పంచశరుఁ బురంబులను బాపము నాక దహించి మామకున్
వంచనగూర్చి జీవహననక్రియ వృత్తిగఁ బూని దారుకా
సంచరణంబులన్ బరమసాధ్వుల యీలువు గూల్చితీవు నీ
సంచిత మిట్టులుండ నను సాకుట నేఁడు హుళక్కి ధూర్జటీ! 247

కలవు సహస్రశీర్షములు కాళులుఁ గన్నులు వేనవేలు భూ
వలయము నిండి పూరుషుఁడ వౌచు దశాంగుళమూర్తితోడుతన్
నిలిచితి వంచు నాడె శ్రుతి నేర్పుగ, నామొఱ లాలకింపఁగా
వలయుశ్రుతిప్రసంగమును బాపురె యాశ్రుతియున్ వచించెనే ?

# కృతి ప్రశంస

సారోదారపురాకృతాత్తకవితాసామ్రాజ్యభోగోల్లస
ద్ధౌరంధర్యము నూని, యుత్తమగుణాధారంబుగా సత్కృతి
ప్రారంభంబున నేయుదాత్తునిచరిత్రంబో కృతిం గూర్ప క
ల్పారంభంబులఁ గాలయాపనము లేలా భుక్తికా ముక్తికా? 1

కేవలమర్త్యుఁ డౌచు నపకీర్తియొ కీర్తియొ తా గడించి పుం
భావనతో నొకింతప్రజఁ బాలన సేయుప్రదేశనాయకున్
భావనసేయుటా యిది? శివంకరు నాజగదేకనాయకున్
స్థావరజంగమాత్మకు నిషాదు విషాదు నుతింప శక్యమా? 2

కవితాలంక్రియఁ గాళిదాసుఁ డుపమం గాంక్షించెఁ, దా నర్థగౌ
రవమున్ భారవి చూపెఁ, దా మృదుపదప్రారంభుఁ డాదండి యి
య్యవి మూఁడున్సమకూఱె మాఘునకు; నాహా! యీమహాకావ్యమం
దవభాసించు సమస్తకావ్యగుణముల్ నవ్యోల్లసద్వైఖరిన్. 3

అది ముగ్ధేందుకళానిభం బగుచు నాహ్లాదోక్తివైచిత్రి న
భ్యుదితం బైనది కావ్యజీవితముగాఁ బొల్పొందువక్రోక్తి, త
త్పదముం ద్రొక్కెను నీలకంఠుఁడు నుదాత్తం బైనతత్కావ్యసం
పద నెన్నం దరమే? తదర్థపరిరంభం బన్న సామాన్యమే? 4

అతనిపదప్రయోగము లనన్యము లాతనికారకక్రియా
గతులు నపాణినీయుల కగమ్యము లాతనిభావనార్థప
ద్ధతులు నగాఢముల్ సుకవితాకలితమ్ములు పల్కుబళ్ళు వ
క్రతమము లాసవస్తులు సుఖంబుగ బుద్ధికి గోచరించునే? 5

వ్యంగ్యార్థములను నర్థాలంకృతుల నెల్ల
మూలానుసరణిగ మేలవించి
వర్ణనాత్తనిగూఢభావమ్ము లౌచితి
చెడకుండునట్లు యోజించి నించి
వివరింపవలసినవిధులకు వైదిక
ప్రామాణ్య మట నట పాదుకొలిపి
తెనుఁగున రచియింప దీటైనశాబ్దిక
చిత్రముల్ శ్రుతికి వాసింప నిలిపి

మూలకారునిసిద్ధాంతములకుఁ గాని
యతనికల్పనలకుఁ గాని హాని లేక
కొంత మూలానుస్మృతి మఱికొంత భావ
సరణినింబట్టి తెనిఁగింపఁ జాలినాఁడ. 6

చాలిన వృత్తమొక్కటికి జానగుగీతి యొకండు గా యథా
మూలము దెన్గుసేసితి నపూర్వముగాఁ బదిభాగముల్; మిగుల్
శీలితమూలభావపదచిత్రితమామకవాక్సుగుంఫసం
లాలితవృత్తిరీతు లెసలారఁగ నాపదిరెంటిఁ గూర్చితిన్. 7

ఇర్వదియు రెండుసర్గల నిరవుకొనిన
కావ్యమును తరంగము లైదుగా నమర్చి
తెలిసినంతలో చ్యుతసంస్కృతులఁ ద్యజించి
యీమహాకావ్య మిటు గ్రథియించినాఁడ. 8

మానితాచారధర్మగ్లాని భారత
దేశమున్ ముంచెత్తి తేల్చునాఁడు
పరమాస్తికత మించుభరతఖండంబెల్ల
నాస్తికాగ్నిజ్వాల నవయునాఁడు
కోటిపాదము లానుకొని క్షామదేవత
యవనిపై తాండవ మాడునాఁడు
దేశభాషాయోష దిగనారి మ్లేచ్ఛహూ
ణాదిభాషల నల్లలాడునాఁడు

ఇట్టికావ్యముల్ గీవ్యము లిహము పరము
నీశ్వరుఁడు గీశ్వరుఁడు ప్రాఁత వేల యనకు
మకట! లోకము సువిశాల మైనదిగద
ప్రభువులు ననంతు లేది యెప్పటికిఁ దగునో? 9

పడుచుంబ్రాయపుఁబాలపొంగు లవి చప్పం జల్లనారన్ వయ
స్సిడదే మా, ర్పలనాఁటికేని రుచి నీవే యిట్టికావ్యాలు, దుం
దుడుకుందారులు పట్టనేల చెడలేదో యట్టియల్లాప్తుల్మ, ల
ల్పుఁడ లో యెన్నక నాయెడన్ దయనునిల్పుండో విపశ్చిద్వరుల్. 10

పుబ్బయందుఁ బుట్టిపుట్టక మఖయందె
మాఁడనున్నకృతులమాట లెత్తి
క్షుద్రకల్పనముల శూన్యవాదంబుల
నిడిన హృదయ మడుసుఁ బోడుసు గాదె ? 11

నిలుకడతోడుతన్ విషయనిర్ణయదృష్టినిఁ జొచ్చి లోనికిన్
దెలిసినయాస్తికాళి కిది తెల్లము, కా కటు మత్సరత్వసం
విలసితులై పదార్థసువివేచన సల్పక ప్రాఁత ప్రాఁత యం
చులికెడిదుర్విదగ్ధులదురూహల కందని వీపదార్థముల్. 12

మనసు శిరసు వయస్సు వంగనియవేళ
క్రొత్త క్రొత్త కొమ్మఁగఁ దోఁచి కొనలుసాగు
మనసు శిరసు వయస్సు పండినతరాన
ప్రాఁత బంగార మగుచుండు భావనమున. 13

చరితము పాండ్యరాజులవిశాలకథావళి, వారలెల్లరున్
బరశివసుందరేశ్వరునిభక్తశిఖామణు లామహాకులం
బురుతరదానధర్మముల నున్నతిఁ గాంచెఁ దదన్వయంబునన్
గిరిసుత యుద్భవించి పెరిగెన్ మధురాపురి మీననేత్రయై. 14

కాళిదాసుండు రఘువంశకావ్యమందు
సూర్యవంశరాజులకథల్ చూపినటులు
పాండ్యరాజకథానికల్ పాదుకొలిపి
నెఱి శివాద్వైత మిందు వర్ణించె నితఁడు. 15

శివుఁ డున్నాఁ డని నమ్మియుండినవిపశ్చిద్వర్గమే దీనియం
దవగాహింప సమర్థమా నటులుకాదా యీకథాలాపముల్
చెవికిన్ బుద్ధికినిన్ రుచింప వతఁ డచ్ఛేద్యుం డనూహ్యుం డను
ద్భవుఁ డాద్యంతవిహీనుఁ డట్టి వగుఁ దత్త్వజ్ఞాదులున్ దత్కళల్. 16

చూడన్ లేఁడు వినంగఁ బోఁడు పరమేశుం డొక్కఁ డెందేని యు
న్నాఁడా లేఁడ యటన్నసంశయముతో నాశంబు కానేల! యు
న్నాఁ డంచుం గృషి సల్పు మున్న నతఁ డానందించు లేకున్న లేఁ
డేడన్ లేఁ డనుకొన్నఁ జచ్చెదవుసుమ్మీ యాతఁడే యున్నచోన్.

ఇట్టిదైవము పరశివుఁడే యటంచు
నాతనిజగద్ధితైకకథాకలితము
నైన యీకృతిఁ దెనిఁగింపఁ బూనినాఁడ
నతనిదయచేతఁ గృతకృత్యుఁ డైనవాఁడ. 18

ఇది తెన్గింపఁగనౌనె? శక్తుఁడను గాఁదేమో యటం చూఁగుచున్
మది సందేహముతోడనే దిగితివమ్మా తల్లి సావిత్రి! నీ
పదపద్మమ్ములఁ జేర్చి నీదయను నాపైఁ జిమ్మి, నీపట్టుతోఁ
దుది నెగ్గించితి నీమహత్కృపకు హద్దుల్ పద్దులుం గల్గునే? 19

కోరినకోర్కెలెల్ల సమకూర్చెడితల్లివి నీవె, నాదుసం
సారములోనిబాధల నసార మొనర్చిన మాత నీవె, నా
నేరుపుమీఱ నిన్ను ననునిత్యము ధ్యాన మొనర్తు నొక్కఁడే
తీఱుగ వార్ధకమ్ము కడతేఱఁగనిమ్ము సుఖాంత మౌనటుల్. 20

శివ యను రెండక్కరములె
యవకరము లణంపఁ గావ్య మంతయు నాశం
భువునిదె యనుచుండఁగ నా
భవపాపము లణఁగకున్నె పరశివుకరుణన్. 21

"వాక్కును వ్యాకరింపఁగలవాఁడు, షడంగపరీతవేదస
మ్యక్కలనానుషంగుఁడు, పురారిపదార్పితచిత్తుఁ, డుత్తమ
ప్రాక్కవిమార్గగామి, యనుభావము నన్నుగుఱించి చాటు న
ర్వాక్కుల కంచు నీకృతిని వ్రాసితి; భార మదెల్ల దానిదే." 22

## కృతజ్ఞత

అనువుగ దీన శ్రౌతవిధు లన్నిటి కిచ్చి శ్రుతిప్రమాణముల్
పొనుపడ నాదుబుద్ధికి సుబోధ మొనర్చియు శాస్త్రచర్చలన్;
చనవిడు వేదభాష్యసువిశారదు వాక్పతి నుప్పలూరి మా
గణపతిశాస్త్రివర్యుఁ బదకంజము లంటి నమస్కరించెదన్. 23

మఱియు నీగ్రంథాంధ్రీకరణంబున నా కనుపదము సాయ మొనర్చిన శ్రీ సామవేదం శ్రీరామమూర్తివిద్వచ్ఛిరోమణికిని, నాకు సర్వదా ప్రోత్సాహ మొసంగి దీనిని మూలముతో సరిచూచిపెట్టిన శ్రీ ఆకెళ్ళ శేషాద్రివిద్వచ్ఛిరోమణికిని నా ధన్యవాదములు. 24

—రచయిత.





కృతిగ్రహీత:

శ్రీ శ్రీ శ్రీ కలిదిండి రాజంరాజుగారు

# కృతిపతి ప్రశంస

"గాయంతం ఖలు త్రాయతే" యనెడివాక్యం బెన్ని యేతల్లి నా
ప్రాయంబెల్లను జెల్లుదాఁక నెద సంభావింతునో యట్టియా
మాయాతీత మహేశ్వరార్ధమయి, యస్మత్పూర్వకావ్యప్రభున్
శ్రేయఃప్రాప్తికి మూల మైనత్రిదివశ్రీ లిచ్చి మన్నించుతన్. ౧

వరకృప పాండ్యభూపతులపైఁ బచరించి విచిత్రలీలలన్
వరము లొసంగి తోడ్పడి యవారణ బాధ లడంచి భక్తిత
త్పరుల నొనర్చి సంపదలు భద్రము లిచ్చినరీతి సుందరే
శ్వరుఁడును మీననేత్రయును శాశ్వతవిష్ణుపదం బొసంగుతన్. ౨

వ. అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నీకృతి నందిన కీ॥శే॥ శ్రీ శ్రీ కలి
దిండి రాజంరాజుగారి సంగ్రహచరిత మెట్టి దనిన:—

రాజులలోఁ బరాక్రమధురంధరుఁడై కులగౌరవంబు లు
త్తేజన మొప్ప నిల్పి వినుతింపఁగ లోకులు దానధర్మవి
భ్రాజితుఁడై నిరంతరసభాజనుఁడై పదిమందిలోన నీ
రాజితుఁడై వెలింగె బలరామనృపాలుఁ డుదారసంపదన్. ౪

గోత్రనామము కౌండిన్యుఁ గుస్తరింప
దివ్యగృహనామ మా కలిదిండి యగుచు
ధీమహితుఁ డైనయాబలరామరాజు
రహి వసించెను పాలమూరి గ్రామమందు. ౫

పొలతులమానిక మనఁ దగు
నల రమణయ్యమ్మగారి నారామనృపుం
డెలమి వివాహంబై మి
క్కిలి సుఖభోగముల నంది కేరెన్ మీఱన్. ౬

భరతశత్రుఘ్నకుశలవప్రతిభ లొప్పఁ
బుత్త్రు లిర్వుర బలరామభూపుఁ డందె
నోజ బంగరురాజును రాజరాజు
ననెడిపేరుల వారు పెం పందినారు. ౭

వ. అట్లు వారిరువురును ప్రజోపకారియు, నిరాడంబరజీవియు, తమ మాతామహుండు నైన శ్రీపెనుమెత్స బంగారురాజుగారింట పాడగట్లపల్లిలో పెరిగి పెద్దవారైరి. అందు ప్రకృతము కృతిగ్రహీత యగు రాజంరాజుగారు గోటేరునివాసు లగు శ్రీ శ్రీ పెనుమెత్స తిమ్మరాజుగారి ప్రథమపుత్త్రికయు— లండన్ పట్టభద్రులును, కాకినాడ గవర్నమెంటు జనరల్ హాస్పిటలున ఆనరరీసర్జనులును, శ్రీరంగరాయ మెడికల్ కాలేజీ ప్రసిడెంటులును అగు శ్రీపెనుమెత్స వెంకటనరసింహ రాజుగారి సోదరీరత్నము నైన సూర్యకాంతమ్మను వివాహంబై కొంతకాలము కాఁపురించి విష్ణుపద మందఁగాఁ బిదప నాసూర్యకాంతమ్మగారు పెంపఁగాఁ బెరిగి సమస్త సంపదలతోఁ దులతూఁగుచున్న శ్రీపెనుమెత్స వెంకటనరసింహ రాజుగారితో— ౮

కొచ్చెర్లపాటివంశ్యుఁడు
సచ్చరితుఁడు సుబ్బరాజ సఖుఁడున్ నాకున్
నచ్చికగాఁ బ్రోత్సాహం
బిచ్చుచుఁ దత్పరిచయమును నెంతేఁ జేసెన్, ౯

వ. మఱియు నేనీకావ్యరచనకుఁ గడంగిన నార్తయును శ్రీసుబ్బరాజుగా
రెటింగింప శ్రీ పి. వి. యస్. రాజుగారు నన్ను రావించి యీ
కావ్యంబు నుద్ధరింప నెంచి— ౧౧

"నాలక్ష్యాభిమతార్థసిద్ధులకునున్ నాకీర్తికిన్ వృద్ధికిన్
మూలంబై పరదేశవిద్యలను సంపూర్ణంబుగా నేర్వ నా
కాలంబం బయి నన్ను బెంచినది మాయక్కయ్యగా రామె యి
ల్లాలై కోల్పడియున్నభర్త కిడుమయ్యా యీమహాకావ్యమున్. ౧౧

ఆమె పతినిర్విశేష, యత్యంతమృదుల
హృదయ, మ మ్మింతవారిఁ గావించె నామె,
ధరను దత్పతిపేరు సుస్థిర మొనర్చు
కంటె నామెకు సంతుష్టి యగునె యెంట ? ౧౨

సతతము జపోపవాస
వ్రతార్చనాధర్మతత్పరతనుండియు నా
సతి పెంచె మమ్ము; ఆఋణ
మతిమాత్రము, దానిఁ దీర్ప నౌనే మాకున్". ౧౩

అని న న్నాదృతిఁ జూచి యార్తతతి నాహ్వానించి యిక్కావ్యమున్
మనసార న్విని మెచ్చి తేఁడు నను సమ్మానించి ముద్రింపఁగా
ధన మెంతే నొసఁగెన్ గృతిగ్రహణకృత్యంబెల్ల నీరీతిఁ దీ
ర్చెను; క్షత్రగ్రహణార్హసంస్కృతిని గాంచె న్మించె నిప్పట్టునన్. ౧౪

అనయం బబ్బలయందు నాంధ్రపయి నత్యంతార్తతాదుల్ పెనం
గొనఁ జూపించినమానవుల్ భువిని గోకొల్లల్ గలా రీవృశం
బనవద్యం బగున ప్రమతాకలితమాన్యప్రక్రియన్ సోదరీ
మణిపై నింతటిభక్తి సూపినమహామాన్యున్ గనన్ రా దెటన్. ౧౫

శివుఁడును శైవబోధలును జిక్కనిచక్కని శైవభాషలున్
శివగుణకీర్తనమ్మును వసించినయీకృతి నుద్ధరింపఁగాఁ
దివురుట మీధనమ్మునకు దీప్తియు వృద్ధియుఁ గల్గు, ఐశ్వరం
బవుటను, గోరి దానిని శివార్పణ చేసినకారణమ్మునన్. ౧౬

భారతీయసంస్కృతికి నద్వైతవిపుల
తత్త్వసిద్ధాంతములకు నద్ద మయినట్టి
దీని మీ రుద్ధరింపఁగాఁ బూను టరయ
ఆర్యధర్మోద్ధరణ చేసినటులె గాదె ! ౧౭

వ. అని యీ పెనుమెత్స వెంకటనరసింహరాజవర్యుల గుణగణంబులు
కొన్ని చెప్ప నెంచి, ౧౮

ఈవిని ధర్మతత్పరత నింపగుసత్కరుణార్ద్రదృష్టి, దీ
నావనదీక్షఁ, బుణ్యకవితాదృతి, వైద్యసహాయసంపదన్
పావనభావనన్, బుధసభాజకతాది, జనానురంజనం
బే, విధిగా నొనర్ప నన రే మిము రాజని సార్థకంబుగన్. ౧౯

సిరి వసియించుచోఁ బలుకుఁజేడియ నిల్వదు, పల్కుచేడె తా
వలిన లచ్చి నిల్వ దని పల్కుచు నుందురు పెద్దలెల్ల, నా
యిరువురు స్వస్వవైరములనేని గణింపక మీ కొసంగిరా
విరివిగ భోగభాగ్యముల విద్యల క్షత్త్రకులైకభూషణా ! ౨౦

తొల్లిటిరాజులెల్లరుఁ గృతుల్ రచియించి గ్రహించియుంగదా
చల్లఁగ నేటికి న్నిలువఁజాలిరె, వారిసమస్తసంపదల్
పెల్లగురాజ్యముల్ స్థిరములే ? యిపు డిక్కడ పెట్టినట్టి కో
ట్లల్లలు భోగభాగ్యములకుం ధగఁకొ వివేకవంతులై. ౨౧

పలికితో యది నీలశిలపైని లోఁతుగా
వ్రాసినయొకశిలాశాసనంబె
మనిచితో యది నిరామయ మాచు దేహికి
వజ్రాలకవచమై వన్నెమీఱు
చేసితో యది పరాశ్రితవృత్తి తొలఁగించు
పూర్ణతాసిద్ధికిఁ బుట్టినిల్లు
చూచితో యది రమ్యశోభావిరాజిత
రాజద్గుణాస్పద రమ్యసీమ.

అమృతహస్తము దృష్టియు నమృతమయము
అమృతహృదయము భావమ్ము లమృతమయము
లమృతవాక్కులు మూర్తియు నమృతమయము
నిన్ను నిజమైనరాజని యెన్నవలదె ? ౨౨

అశ్వినీపుత్త్రులయందు నున్నట్టి శ
స్త్రచికిత్స యెవనిహస్తగత మయ్యె
రాయచాణక్యులరాజకీయజ్ఞత
యెవని శేముషికి సాహిత్య మయ్యె
రఘుపాండ్యరాజాధిరాజవదాన్యత
లేరాజునకు భూషలై రహించె
బలిశిబిజీమూతవాహనాదులలోని
యుపకారబుద్ధి యేనృపతి కమరె

అట్టి వినుమెత్సగృహనామమై దనర్చు
రాజు సామాన్యుఁడే, సర్వరాజలోక
మార్గదర్శకకీర్తిసమంచితప్ర
పూర్ణగుణమాని నరసింహభూమిజాని. ౨౩

తనవిధి యనుచు నిచ్చినఁ బుచ్చుకొను గాని
యింత యిమ్మని నిర్ణయింపఁ డెవని
అర్ధరాత్రమున బాధార్తులైవచ్చిన
పరదేశికులఁ గోపపడఁ డొకింత

నవ్వుచు రోగుల నవ్వించుచుఁ జికిత్స
చేయుటగాని భంజింపఁ డెవని
కష్టజీవులకు నిక్కపుదరిద్రుల కెల్ల
"ఉచితవైద్య" మొనర్చి యోము నెవఁడు

సభలలోఁ జెప్పినంత యాచరణ సేయు
నాచరించుచు నాదర్శమై చరించు
మదిదయాసత్యశౌచముల్ మఱవ కెప్డు
పాదలు పెనుమెత్సనరసింహభూమిజాని. ౨౮

చిన్నలపెద్దలందుఁ గ్రమశిక్షణ మీగృహభూషణంబు, న
భ్యున్నతి నాట్యగానపరిపోషణ మీకులవిద్య, ఛాత్రులన్
గ్రన్నన దన్పుచుండు టుపకారపువేతనలక్ష్మి నిరంతరం,
బెన్నఁగ సంస్కృతాదృతియు నిట్టి వనం జన వెట్టివారికిన్. ౨౯

ఈమహేశ్వరకావ్యము నెలమిఁ గృతిగఁ
గోరి యిప్పించుకతన మక్కువలు మీఱ
దినదినాభివృద్ధిని గాంచి దీప్తి మించి
ఈనృపుం డితోధికపూర్ణవృద్ధిఁ గనుత. ౩౦

ఇట్లు,

దువ్వూరి సూర్యనారాయణశాస్త్రి.

# విషయసూచిక



## ప్రథమ తరంగము :



## ద్వితీయ తరంగము :



## తృతీయ తరంగము :

## చతుర్థ తరంగము :



## పంచమ తరంగము :

# శివలీలార్ణవము

## కావ్యముఖము



దయామరందాద్భుతవత్సలత్వ
పరీమలాక్తే తవ పాదపంకజే
సుఖప్రసుప్తం మమ చిత్తభృంగ
మవాంబ! దౌర్బల్య మపాస్య దుర్భరమ్. ౧

పూత మయ్యు ముక్కంటికొప్పున వసించి
పూతతర మయి, పొలయల్క పూనుగిరిజ
తన్నులం బడుటను బూతతమము నగుచు
నొప్పుగంగాజలమ్ము మమ్మోముఁగాత. ౨

ఎంచి యితరాంగమటు విభాగించలేక
యేకమై యణురూపమై యెసఁగుశివుల
యంతరంగ మాగర్భదాసానుదాసుఁ
డైన ననుఁ బ్రోచుత మనుగ్రహమ్ము నెఱపి. ౩

నిఖిలనిగమమ్ములను దానె నెమకి నెమకి
యలసి సొలసినమీనమును దలఁప నేల?
నిగమములచే నిరంతరాన్విష్యమాణ
మైననీనేత్రమీనము నంబ! తలఁతు. ౪

అంబచను బాలఁ గైతల నల్లె నొకఁడు
తల్లి తాంబూలరస మాని యల్లె నొకఁడు
వానికంటె నున్నతి పొందవలె నటంచు
నా మెయున్నతదృక్కోణ మాశ్రయింతు. ౫

అర్ధతనువున గిరిజ నే నైతి ననుచు
నాదిపూరుషుఁ డటు గర్వ మంద నేల ?
పూర్ణగిరిజాత్మతఁ బుణికిపుచ్చుకొన్న
భవ్యగీర్వాణయోగీంద్రుఁ బ్రస్తుతింతు. ౬

బ్రతికి చిరకాల మాపశుపతి మితమ్ము
గాఁ జతుష్షష్టికళలనే కడఁకఁ గూర్ప
సప్తతికె నూటికిని మించి సరసకృతులు
దీక్ష సంధించె నప్పయదీక్షితుండు. ౭

మొదట ననాహతమ్మున సముద్భవ మంది, నిరస్తభేదమై
మొదలిటిదై, మహానటునిమూర్తికె లభ్యము నౌచు, మోక్షపుం
బథమునఁ బోవువారలకుఁ బారగమై, నినదస్వరూపమై,
పొదలుననుత్తరం బయినపూర్ణమహస్సుఁ దలంతు నెమ్మనిన్. ౮

కవులు సాహిత్యజయఘంటికానినాద
ములనె తమయశస్సును జాటఁ గలుగుచుంద్రు
వాఁస నెంతెంతగా ధ్వని ప్రకటిత మగు
నంత లంతలె మూల్యభేదాంతరములు. ౯

కైతలో మార్దవము శ్రోత్రగణమనీషఁ
గోమలతయును నందాఁకఁ గొఱతవడవొ,
అందనుక భేదమూలకవ్యంగ్యకృతుల
కుచ్ఛదశ యంచు శాస్త్రంబు లూఁది పలుకు. ౧౦

విస్తృతంబు నస్తమితాన్యవేద్యము సయి
వీచికాభంగరీతిని వెల్లివిరియు
ధ్వనివిషయమునఁ గవి శ్రద్ధధానుఁ డగుడు
నితరశబ్దముల్ శ్రుతి కేల యింపు నింపు? ౧౧

తల్లి వాగ్దేవి ఘంటాపథమ్మునందే
చిమ్మ శబ్దార్థరూపవిచిత్రమణుల
సాదరమ్మునఁ గవులు చేసాచుచున్న
నందఱకుఁ గానఁబడ వందు నందు సుకృతి. ౧౨

కప్పువడినదీప్తులఁ జంద్రకాంతమణులు
ఉపలఖండములను గూడి యుండినటులు
శబ్దములఁ గూడి శబ్దముల్ సంచరించుఁ
బుణ్యులే వాని గుర్తింపఁబోలి యుంద్రు. ౧౩

మనము ప్రతిదిన మనుకొనుమాట లెవియొ
తడవుచుమొ నిత్య మెట్టియర్థములు సనిగ
వానివిన్యాసపూర్ణవైభవముకతన
కవులు జగములఁ దనియింపఁగలుగుచుంద్రు. ౧౪

వీణలును వేణువులు గానవృష్టి కురియఁ
బసులు పసిపాప లానందపడుదు రాని
కృతులు కూర్పఁగ వానిఁ బరీక్ష సేయ
నిర్వురో ముగ్వురో కలరేమొ పేరొ ? ౧౪

అభవుసవ్యాంగమే సుశబ్దాత్మ దక్షి
ణాంగ మర్థాత్మ యూటఁ గావ్యము శివాత్మ
ఆది జగన్మంగళాధాయి యర్హుఁ డగునె
యల్పపుణ్యుఁడు సాధుకావ్యము రచింప ? ౧౫

శ్రుతి మహేశ్వరుఁ గొనియాడఁ జొచ్చి యతని
తార్కికునిగ శాబ్దికునిగాఁ దలఁపలేమ
కవి కవి యటంచుఁ బదిపదిగా వచించె
నట్టికవితయె పరమగమ్యంబు మాకు. ౧౬

చెవిని బడి చెవియందె శోషించిపోవు
భవ్యగానము సైకతవారిపగిది
మాన్యకవిసూక్తి యమృతాయమానమై, హృ
దంతరము చేరి యానంద మందఁజేయు. ౧౭

చేరి యొకకవి కావ్య మీక్షింతుమేని
శబ్దకోశమె శూన్య మాసరణి తోఁచు
కోశమునం దటవితిమేని కొసటి నాక
కోణమునం దుండు నిసికోటి యెల్ల. ౧౮

కావ్యమునకు వక్రోక్తులే కప్రభావ
లగును లక్షణార్థమె ప్రకర్షావహంబు
అర్థబోధల నభిధ దోషావహంబు
కవులపద్ధతి యిటు విలక్షణము తలఁప. ౨౦

సత్పదార్థమాత్రజ్ఞత సరిగఁ దోఁచు
మహితసర్వజ్ఞత శశాంకమౌళి కొదవెఁ
గాని సత్కవి ప్రతిభచేఁ గాంచుదానిఁ
గాంచఁజాలఁడా చంద్రశేఖరుఁడు నేని. ౨౧

అన్యతంత్రార్థసంప్రదాయముల దాఁటి
జగము వేర్వేఱుగా నూహసలిపి సలిపి
కవులమై జంక మెవరికిఁ గాని మిగుల
నడఁకుదుము కావ్యవిదులదండనముకలన. ౨౨

భవ్యతంత్రములందుఁ జెప్పఁబడియున్న
యాపదార్థము లన్నియే యవియె సుమ్ము
అలజుగుప్సితశోకభయాదులును ర
సత్వ మందును సాహిత్యజగతియందు. ౨౩

అర్థబోధంబు తుల్యమే యైన సుకవి
సూక్తి కొఱకయి యారసజ్ఞుండు వెదకు;
సారసంతతిలాభంబు సమమె యైన
రూపసిని విదగ్ధులును గోరుదురు గాదె! ౨౪

వాక్చమత్కృతి మోహమున్ వఱలఁజేయు
నిశితకళలకునై దృష్టిగతి మఱల్చు
కాల మెంతైన క్షణ మట్లు గడపు, సరస
కవిత కాంతయుఁబోలెఁ జక్కఁగ రచించు. ౨౫

భావనలలో, సమాసపుబంధనముల
శబ్దఘటనఁ బునర్విమర్శనమునందు
కవులు పొందెడియానందగరిమ మెన్నఁ
దరము గా దది వాగతీతమ్ము గాని. ౨౬

శ్వాసలు బిగింపకయె, యుపవాసబ్రహ్మ
చర్యము లొనర్పకయె, దృష్టిసంయుతంబు
గాకె, చిత్తము శివునిపైఁ గడఁక నిలుపఁ
గవికి కైతయె సిద్ధయోగమ్ము సుమ్ము. ౨౭

సతము తిర్యఙ్మనుష్యభిన్నతకు హేతు
వల్లవాణీకటాక్షమే యనఁగవలయు
జగతి జనులప్రజ్ఞావిశేషములు కొన్ని
చాటి తెలిపెడి శ్వసృగాలసమత నెప్డు. ౨౮

కాలభేదాన రసవర్ణగతి విడునను
*జామిత బుజీషభావంబుఁ బ్రామిఁకొనదు
అమలసారస్వతం బనునట్టిఫలము
పూర్ణసుకృతాత్ములే దానిఁ బొందఁగలరు. ౨౯

---

*జామిత - పునరుక్తి, మొగము మొత్తుట; బుజీషము - పిప్పి, నీరసభావము.

బాల్యదశ యంద్రు ప్రాకృతభాషితముల
తత్శ్రుతిస్మృతులను వృద్ధదశ యటంద్రు
సారసాహిత్యమే సరస్వతికిఁ బూర్ణ
తరుణదశగ నభిజ్ఞులు తలఁచుచుంద్రు. ౩౦

అర్థములు శబ్దములును ధ్వన్యంతరములు
వాక్యరీతులు రసములు వఱలె నెన్ని ?
కవికి నెన్నిటిపై దృష్టి గ్రాలవలెనో
యింతచింత భూపతులకు నేని గలదె ? ౩౧

అక్షరార్థము మొదలు మోక్షాంత మైన
విద్యలను క్లేశమయముగ వెలయఁ జేసి
హృదయవిశ్రాంతి కానందహేతు వైన
కైత నొసఁగెను లోకులకై విధాత. ౩౨

పదము సిద్ధమె యర్థసంపదలు నవియె
కాని సాధ్య మొకండె పదానుపూర్వి;
కవిత తన్మాత్రసారసంకలిత మైన
ఉచ్చనీచస్థితులు దాని కొసఁగె విధియె. ౩౩

వివిధశాస్త్రముల్ శబ్దార్థవిధము లెల్ల
నున్నవియె గురువులు మును పున్నవారె;
కాని కైతకు గణన మొక్కటనె, యద్ది
వాణిశీతలదృక్పరివర్తనంబె. ౩౪

పదము లెంతభవ్యము లైన సద నెఱింగి
వాడుకొనకున్నఁ గావ్యశోభలఁ దొలంచు;
ముదిత తాటంకభూషలు ముక్కున కిడ
నాననమున కుజ్జ్వలశోభ యలముకొనునె? 3౫

అమలసాహిత్యవిద్య సర్వానవద్య
యయ్యుఁ దచ్ఛోభఁ జెఱుచు దుష్టార్థ మొకఁడె;
ముత్తెములకోవపల్చాలు సత్తమిల్లి
పైకి తన్ని పెట్టిన కోఱపంటిపగిది. 3౬

పెనఁగి యన్యోన్యసంసర్గమున రహించు
నయ్యలంకృతుల్ ధ్వనిహీన మైనకావ్య
మునకుఁ బెట్టినచో శవమునకుఁ దొడుగు
తొడవులటు లింపుసొంపులు నిడని వగును. 3౭

వ్యంగ్యమార్గము విద్వత్ప్రియంబు, దాని
విడిచి శబ్దార్థచిత్రవైవిధ్యమందె
మనసు నిలిపిన; నిగమాగమములు విడిచి
తగిలి భాషాకృతులఁ దలఁ దాల్చినటులె. 3౮

కృతయుగమ్మున వ్యంజన మతిశయించె
త్రేతయం దయ్యదియె గుణీభూత మయ్యె
నర్థచిత్రము ద్వాపరమందు నడచె
కలిని యమకప్రపంచమే యలముకొనియె. 3౯

దైవకృప సమర్థులు కవితాధిరాజ్య
మందియున్ శబ్దచిత్రము నాదరింత్రె?
అచ్చర లెసంగుస్వర్గము నందుకొనియు
నంధురాలికినై వెదకాడెదరఁటె? ౪౦

వట్టిపదములకూర్పె కావ్యం బటంచు
తలఁచి మూఢులు దుష్కీర్తి వలనఁ బడరె!
చేతులుం గాళు లూఁచుచే యీఁతయనుచు
డింభకుం డెంచి గంగలో డిందినటులు. ౪౧

మూర్ఖుఁడొకకొన్ని దుష్పదంబులఁ జిరమ్ము
కష్టపడి తెచ్చి విరఁజిమ్మి, కన్నములను
పెంటచే మంటిచేఁ బూడ్చి పెట్టినటులు
కులుకుచును నింపు నెగ్గుసిగ్గులకుఁ దొలఁగి. ౪౨

ఇప్పుడొక్కటి రేపుమా పింకొకటియుఁ
బదము లదికించి కొందఱుపంద లకట!
ఒక్కచో శుక్త మొకటఁ బర్యుషిత మొక్క
తావు కోష్ణంబు గాఁగ పద్యము రచింత్రు. ౪౩

ఈ కుబుద్ధులనోళ్ల సర్వేశ్వరుండు
నింబరసముతో వెల్లుల్లి నింపఁబోలు,
కానిచో వారినుడులఁ దిక్తతయుఁ బూతి
గంధ ముప్పతిల్లుట కేమికతము చెపుమ? ౪౪

వ్యంగ్యసౌరభ్యరసమయవాక్యకలన
సత్కవీంద్రులనిందయే చాలు మాకు,
నీరసములు గ్రామ్యములుగా నెగడునుడులఁ
జెలఁగుకుకవులస్తోత్రముల్ వలదు వలను. ౪౫

ఎవ్వరు వివక్షితార్థము నెఱుకపఱుచు
శబ్దవిన్యాసభేదముల్ చక్క నెఱుఁగ
రట్టివారి కర్థస్ఫూర్తి యయ్యుఁ బరమ
దుర్భగులకు సంతతియట్లు దుఃఖదమ్మొ. ౪౬

గ్రామ్యము కఠోరతరము దుర్గంధసాంద్ర
మైనపలుకును వెలిగ్రక్కునట్టిమొఱకు
చిరము వ్యథపడు; నాబాధ, చేరి వినెడి
వానిబాధలో నెన్నవభాగ మగును ? ౪౭

కరఁగి వేడిగ నున్నలక్కను దమంత
చెవులఁ గొనువారు పరుషదుష్కవిత వినుఁడు;
దుష్కవిముఖానఁ బడి వన్నె దొఱఁగియున్న
పలుకు లర్థముల్ సేయుపాపమును గనుఁడు. ౪౮

సుకవులు శ్రమమ్ము నెంతహెచ్చుగ వహింత్రో
కుకవులుఁ దతోధికశ్రమ గొనుచు నుంద్రు;
దౌహృదం బాది ప్రసవాంతదశల కుచ్చి
తులను గనువారికేని బాధలు సమంబె. ౪౯

క్షితిని బరమేష్ఠి దైనదాక్షిణ్యహాని;
మహితవాగ్దేవి దైనదుర్మరణయోగ;
మఖిలజనులపాపం బనునట్టి నరయ
దుష్కవిత్వకారణములై తోఁచుఁ గాదె. ౫౦

ఆ మహర్షులు లోదృష్టి నరసి యరసి
బ్రహ్మహత్యాదిసకలపాపముల కెల్ల
నెఱిఁగి తెలిపిరి గాని నిష్కృతులు కొన్ని
తెలుపనే లేదు దుష్కవితలకు శుద్ధి. ౫౧

తనమృదూక్తుల దొంగిలి తనయెదుటనె
జంకక పఠించుకవిసాహసాంకుని గని
ప్రాజ్ఞుఁ డది తన దని కుక్షి బాదుకొనున,
నీది కాదు నా దని వాఁడు బాదుకొనున? ౫౨

తెలిసి పరకవిత్వమును నిందింపనిమ్ము
స్వీయకవితనె ఖలులు భూషింపనిమ్ము
కోరి మొదటి దాస్వాదింపఁ గోరుకున్న
నన్యము పఠింపకుఁడు సుప్తునండ నేని. ౫౩

వ్యాసవాల్మీకు లాదిగ నాదికవులు
కావ్యశతముల రచియింపఁగలిగి కూడఁ
గింకవుల కోడియేమొ రక్తిని త్యజించి
కాకవంధ్యలై యుంటకుఁ గారణంబు. ౫౪

*జన్మములలోని పశుహింసస్వర్గమందు
అమితదుఃఖదమై యెటు లౌనో యటులె
పాపములమధ్య పడినశుభంబు గూడఁ
గుకవులకు సంతసంబె చేకూర్చుచుండు. ౫౫

కేవలస్థూలదృష్టి లిఖించుకుకవి
వాక్కులున్ స్థూలములె యౌచు వఱలుఁగాదె !
కానిచో యత్న మొనరించియేని చెవులఁ
బట్టకుండుట యెటులు సంభావ్య మగును ? ౫౬

మూకతాకుకవిత్వముల్ వారుఁ జెఱుచుఁ
గాని కుకవిత్వ మత్యంతగర్వ్యా, మందు
మొదటి దొక్కనికే దుఃఖమున్ ఘటించు
సకలమానవప్రాణభంజకము తుదిది. ౫౭

శ్రోత్రపేయధ్వనులతోడ సుకవివరులు
వాక్కుఁ బల్కింపఁగలరు విపంచినివలె
తమకుబుద్ధులన్ రోఁకళ్ల దంచి దంచి
మూర్ఖజనములు రూపుమాపుదురు దాని. ౫౮

---

*యజ్ఞములం దనేకపుణ్యకర్మములనడుమ చేయఁబడిన పశుహింస స్వర్గస్థుఁడైన సోమయాజికి నడుమనడుమ జ్ఞాపకమువచ్చి మనసు నెట్లు కలఁచుచుండునో పెక్కు దుష్కృత్యములను వర్ణించిన కుకవికావ్యములో యేచిన్నమంచిపడినను దానికే వాఁడు మురియుచుండును.

*కావ్యరచన శక్యమెన్న సుకరమె, కాని
యత్యశక్యము శ్రోతృజనానువృత్తి
దానికై యొకఁ డెందొ శ్రాంతత వహింప
దుఃఖపడును సర్వస్వముం దొలఁగినటులు. ౫౯

పరులు త్రొక్కని లేఖనపథము పట్ట
సీ! యసంప్రదాయ మని దూషింత్రు కవులు
ప్రహతపథమునఁ బడితిమా పరమమూర్ఖ
లాదరింపరు ముకుళీకృతాక్షు లగుచు. ౬౦

పదములను గొంద అర్థసంపదల నొరులు
రసమును రసజ్ఞు లెన్నుచు రహి వహింత్రు
యువతివలువఁ గువిందులు, యువకు లామె
చెలువున, వణిక్కు భూషల నలరునటులు. ౬౧

పఠనశక్తియె లేక యన్వయము కాక
భావ మందక మూర్ఖులు పఠన సేయు
తనకవిత్వము నెవఁడు శ్రోత్రములఁ బెట్టఁ
డాతఁడే ధన్యతముఁ డని యనఁగవలయు. ౬౨

దుర్జనుల కన్యపద్యసందోహమందు
అవి పరుల, వన్నె పెనుదోష మానుచుండు
అది యటుండ దోషాంతర మరయుకొలఁది
నేల యత్నింతురో వార లెఱుఁగఁబడదు. ౬౩

*శ్రోత లానందపడకలె నని తన్నకైతలో దానికై శ్రమగొన్న కవిని గాంచి సుకవి తన సర్వస్వమును పోయినటులు చింతించును.

బ్రహ్మవేత్త కానంద మెప్పటికి నొకఁడె;
కవుల కవి వ్యంగ్యలాభంబుకలన శతము;
పరులకైతల దోషవిస్ఫురణమందు
ఖలుల కవి సహస్రార్బుదమ్ములుగఁ దోఁచు. ౬౪

పూర్వపద్యమె యని భ్రాంతి పొంది ఖలులు
తొలుత నక్కవివరునిఁ బ్రస్తుతు లొనర్త్రు;
ఎదుటఁ దత్కవిఁ గాంచి యెంతేని శ్రమను
నన్యథాకరింతురు వారి కదియె శిక్ష. ౬౫

కావ్యమం దొక్కచో నొకొక్కండె దోష
ముండు ననుచు నాలాంకారికోక్తి సుమ్మ;
కావ్యసర్వానుగతముగఁ గ్రాలు దోష
మొకఁడె, తత్కవి జీవించియుండునె యదిఁ. ౬౬

చదివికొంటిమి సకలశాస్త్రములు పృథగ
కైతలన్ నేర్చితిమి మహాకష్ట మంది;
కాని పామరాకర్షకం బైనతంత్ర
మవసరము; దాని నేర్వలే దక్కటకట ! ౬౭

నిర్గుణోక్తిని గొనుచుఁ బాండిత్యకలన
సగుణ మంచు సమర్థన సలుపునతఁడు
కంచుకము చేతఁ బై కెత్తి కట్టఁబడిన
వ్రేఁలుఁడుచములదానికై వేడ్కఁ గొనును. ౬౮

పామరులకుఁ బాండిత్యలోభంబె యున్న
చదువుదురుగాక ప్రథితత్రిషష్టికళల;
కైత సీత స్వదేమె ? నిగ్గన రదేమె ?
వారికిని నీకుఁ బూర్వవివాద మున్నె ? ౧౯

సుకవిసూక్తిపై లాలన చూపుచును, ర
సజ్ఞుఁడు భజించు యువకుఁడు శ్యామనట్లు;
దానినే పట్టిపల్లార్చి దయ్యమటులు
తార్కికుఁడు ప్రాణములు దీసి తగ భుజించు. ౨౦

శబ్దములకు శాబ్దికు, లర్థసంపదలకు
మహి నలంకారవిదులు ప్రమాణతరులు;
అలకవీంద్రులకును దాంత్రికులకుఁ జూడ
బాదరాయణసంబంధ మేది కలదు ? ౨౧

వాక్కులను నర్థముల ఘట్టవాసుల నెటో
యటులె కావ్యాగమజ్ఞుల ననునయింతు;
కాని యెలుఁగులవలె అక్కఁ గలియఁబడెడి
గౌతమీయుల నిర్జింపఁగాఁ దరంబె ? ౨౨

అంతికస్థులకైనఁ దా నందకుండి
మృదుమధూక్తులవలన జన్మించునట్టి
ధ్వని సుసూక్ష్మము; కర్కశతర్కవాద
భయదరణభేరిముం దది పట్టుపడదు. ౨౩

ఖలులు గుణముల వీడనీ యొలికె నేమి?
దోషములనే గణింపనీ తొలఁగె నేమి?
ఉభయ మటునిటు చేయనీ యూడె నేమి?
గుణము దోషంబుగా నెంచుగుణము వలదు. ౭౪

బ్రహ్మలోకం బదెక్కడ? వాణి యెచట?
గ్రుడ్డిగవ్వలు నరు లేడ? కుతల మేడ?
పుణ్యవశత వాగ్దేవిని బొంది కూడ
పొట్టకై విక్రయింతురు మూర్ఖమతులు. ౭౫

దుర్విదగ్ధులసేవల దుఃఖపడెడి
కష్టకవితాధికారభాగ్యంబుకంటె
మూకభావంబె యుక్తము, కాక యున్న
వరము పశుపక్షితరుగుల్మభావమేని. ౭౬

జడులు మాత్సర్యపూర్ణులు జనులు తఱుచు;
విరలగుణములు మానుడుల్, వేయు నేల?
అవనిఁ గలుగఁడె యొక్కఁడు గుణైకలుబ్ధుఁ
డనెడియాశయె యీపాటి యత్నమునకు. ౭౭

*"తెలియుదును నేను పురుషు నాదిత్యవర్ణు"
వని సగర్వముగాఁ బలుకనట్టి శ్రుతుల
జ్ఞానములఁ జేసవైచె నేస్వామి, యతని
వాగతీతుని వర్ణింప వలనుపడునె? ౭౮

*వేదాహమేతం పురుషం మహాంతమాదిత్యవర్ణం—అని శ్రుతి.

సరసశబ్దార్థములఁ గూర్చి గురువు లెట్లు
నాకు బోధించిరో యట్లె నడపువాఁడ;
సొగసు లవి మించి నే నేమి చూపఁగలను?
పోలునే మత్కృతి తదంశములకు నేని. ౭౯

జడుఁడ నే నేడ? కవిరాజసాధ్య మైన
కావ్య మదియేడ? శ్రుతుల కగమ్యుఁ డైన
శంకరుం డేడ? తెలిసియు శంక మాని,
జనని! నిర్లజ్జ నీదయ సాగుచుంటి. ౮౦

కోరి యిడితివి వాగ్రత్నకోశ మీవు
అమ్మ కొని తింటిఁ గొంత నే నప్పుడపుడు
శిష్టమున నీపదమ్ము లర్చించికొందు
అమ్మ! మీనాక్షి! దయఁ జూడుమమ్మ సతము. ౮౧

ఎవ్వారి నోళులం బడి
యహీనమృదుత్వముఁ గాంచె శబ్దముల్
ఎవ్వారి బుద్ధినిర్ఝరుల
నీఁది మహార్థము లయ్యె భావముల్
ఎవ్వారి కీర్తులం బడయ
నెంచి శివుండె శ్రుతుల్ ఘటించె, నే
నవ్వారపూర్వసత్కవుల
నాద్యుల సంస్తుతి సల్పి మ్రొక్కెదన్. ౮౨

ఇది కావ్యముఖము.

# శివలీలార్ణవము

## ౧

## ప్రథమతరంగము



### పాండ్యదేశవర్ణనము

వసుమతీదేవివ్రజాలపతక మనఁగ
జలధితటమునఁ బాండ్యదేశంబు వెలయు
కుంభజునిదిక్కునం దది కుదురుకొనియు
జగతి సర్వోత్తరం బయి జరుగుచుండు. ౧

ఉత్తమోత్తమవైరాగ్య మూని యెవ్వఁ
డీత్రిలోకలక్ష్మిని దృణీకృత మొనర్చె
నతఁడు తన్నగరాధిపత్యము వహింపఁ
బదరి సుందరపాండ్యరూపము ధరించె. ౨

దానిప్రతిసృష్టి కష్టసాధ్య మని గాధి
సూనుఁడున్ సృష్టి మానెనేగాని మున్ను
సురలశుష్కప్రియంబులఁ జొక్కి కాదు;
గాధిసూనున కెపుడేని కలదె శాంతి ? ౩

మందమారుత మాహా ! సుగంధివాత
మోహహా ! మలయానిలం బని యువకజనులు
శిరము లార్చుచు గౌరవించెడిసమీర
మా నగరిసందుగొందులం దాడునదియె. ౪

అధ్వరములందు నాహూతులైనవిబుధు
లానగరిభోగభాగ్యము లరసి యేమొ
మిమ్ముల యజింతు మొసఁగరే మీపద మ్మ
టంచుఁ దద్విప్రజనుల యాచించుచుండ్రు. ౫

కొండలఁ దపోవనంబుల నుండి తపము
సలుపువారికి న్యాయ్యమే స్వర్గఫలము
నాకము మొగంబు నీడ్చునీనగరమందె
సుచిరవాస మిందలితపస్వులకుఁ దగును. ౬

తండ్రి మృతిఁబొందఁగాపుఁడు తాతగారు
కోస కోకకులాలుఁ డయ్యె నేకుంభజునకు
ఆతఁ డీపురి నొకమూల నధివసించి
సూత్రకారత్వసిద్ధిని జూఱఁగొనియె. ౭

ఆ నగరిలోని కౌమారగహరులు తఱుచు
మందమారుతమౌక్తికచందనముల
భవ్యతర మగునవ్యసౌభాగ్యలక్ష్మి
ననుభవించి త్యజించెద రనుదినమ్ము. ౮

వింధ్యగర్వాపహారులై విష్ణుపదము
నంటునుభయరసాలము లరసి వాని
పైని భారము నిల్పి కుంభజుఁడు హాయి
రేపుమాపులఁ దప మాచరించుచుండు. ౯

అద్రి మలయాచలేంద్ర ప్రత్యంత మకుట
చందనతరు ప్రభూత వాసనల నలమి
యతిచమత్కృతిగా వ్యజనానిలములు
బుగబుగలు గ్రమ్మఁ గమ్మతావులను జిమ్మె. ౧౦

అచటి చందనతరువుల నడఁగి పెనఁగు
పాపజాతిచేఁ బీల్వంగఁబడుటకతన
అమితముగ వీఁచు నా మలయానిలంబు
మందమందగమనముల మసలుచుండు. ౧౧

మదనసమూలకందము మందమారుతమ్ము
నచటి మానులు సేవింప నడలుఁ గొనుచుఁ
బులికళాసంపు విసనకఱ్ఱల జనించు
గాలినే వ్రతముగఁ బొంది గడపుకొంద్రు. ౧౨

రథ మయత్నలభ్యమ్ము చిత్రంపు విండ్లు
శరము లయుతమ్ము లిచ్చోట దొరకు ననియొ
స్మరుఁడు జగదేకవీరుఁ డేర్పఱిచికొనియె
స్థిరశిబిర మెంచి యీపురీవరమునందె. ౧౩

తామ్రపర్ణీతరంగవాతమ్ము లోలయు
పొదలుమాకందవాటిలో మదనుబలము
మించి ముమ్మరముగ నాక్రమించుచోటఁ
దరుణులు రమింతు రతనియాధారకలన. ౧౪

క్రముకమౌక్తికములు కరకమ్ము లచట
చందనద్రుమఖండము లింధనములు
గులకరాలఁ గంటకములఁ గూడియుండు
నితరతలములు దీనికి నీడ, జోడ? ౧౫

దీనిగాలి సోఁకినమాత్రఁ ద్రిదివభాగ్య
భోగ్యము సులభ మనునూహ పొడమి కాదె
దీనిసమ్ముఖమందె సంధించె మున్ను
నూతనస్వర్గసృష్టిఁ దా నాతపస్వి. ౧౬

అన్యనదు లయ్యపాంపతి ననుగమించి
యాదసాంపతి యనుబిరు దతని కొసఁగ
నిచటిరత్నాపగయు దాని నెలమిఁ గలిసి
రమణున కొసంగు రత్నాకరత్వసిద్ధి. ౧౭

ముక్తితం గాంతురో యెందు మునుఁగ జనము
లట్టిగంగమ్మ యెఱిఁగిన దండజకును;
తాదృశం బగునిచ్చటితామ్రపర్ణి
సన్నుతిం గాంచు దక్షిణజాహ్నవి యని. ౧౮

దర్ప మొప్పఁగ హరికి వేదమ్ము లొసఁగి
నట్టియుదధికి గోత్రమహత్తరునకు
నవమణివిభూషితాంగి నీనదిని స్వీయ
కన్య నర్పించుటకు నగస్త్యుఁ డొసఁగె. ౧౯

చీటికిని మాటికిని దన్నుఁ జేరవచ్చు
తన్నది నగస్త్యగోత్రజాత యను ప్రీతి
మురిసి యెదు రేఁగి ముత్తెంపుఁబూలఁ జల్లి
యుదధి తనయంతిపురము నెమ్మదిగఁ జేర్చు. ౨౦

తనర్ఝురులతో మహాసముద్రమునఁ గలియు
పావనము దీనిజలము స్వభావ మధుర
మబ్ధినిం దచ్చి దేవత లాహరించి
యమృత మని త్రాగునది దీనియమలజలమె. ౨౧

నాఁడు క్షారోదకాస్వాదనమ్మొకతనఁ
బాడమినవిపాకము నగస్త్యుఁ డుడుగ నేమొ
ప్రకృతి మధురముల్ దీనిజలంబు లాన
మలయశైలంబు విడువక మసలుచుండు. ౨౨

భవ్యరత్నాలగని తామ్రపర్ణి వీడి
శివుఁ డదేలొకో గంగను జేర్చెఁ దలను ?
మొగలి యుండ జిల్లెడుపూవు మొనయు టిదియె
యీశ్వరులశీల మెవ్వారి కెఱుఁగనగును? ౨౩

దివ్యవైదూర్యనీలమౌక్తికము లెందు
నడుగడుగునందు నుద్భవ మందుచుండు
నట్టియీ తామ్రపర్ణి యిం దమరి యుండె
*సర్వసాధారణం బగుసారణివలె. ౨౪

*సారణి — పిల్లకాల్వ.

ఆ విశాలదేశమున వృషాద్రిచెంత
నమరుఁ దరుణేందుమౌళియాశ్రమ మొకండు;
అది కదంబకదంబకహారి, సర్వ
భువనపావనం బద్భుతములకు నెలవు. ౨౫

సూర్యరశ్మిని గన్నులఁ జూడకున్న
వానినీడలు తమము సర్వమ్ము నణఁచు
వానిపుష్పరజమ్ము సర్వజనరజము
నాహరించును గాలి కల్లల్ల రేఁగి. ౨౬

బద్ధరజము లంతర్లీనభ్రమరము లగు
కుసుమముల నెల్లెడల నిండుకొన్నవనము
అణఁచివైచి రజస్తమోగుణములను, వె
లుంగు సత్వగుణాంబ ల్లైసంగు వెలికి. ౨౭

అచటితరువులు మధుధార నవని నెల్ల
అష్టమూర్తిని బోలె నిత్యమును దడుపు
శ్రుతుల కింపులు నింపుఝుంకృతుల భృంగ
వితతి సామగానములు వినిపించుచుండు. ౨౮

వక్రములు నిర్మలమ్ములై వాసి గనిన
యచటిమునిపాదపమ్ముల యులకు లలరు;
శివుఁడు శంకరుఁ డాముముక్షువుల కిడఁగఁ
బ్రోవు చేసినశశిఖండములవిధాన. ౨౯

అయుతపూర్ణిమలందు మృగాంకబింబ
ములఁ దదాశ్రమవృక్షాగ్రములు కలంచి
రాపిడులు వెట్టఁ బెక్కులు రాలె నేమొ
యనఁగ వందలమృగము లవ్వానిఁ జరించు. ౩౦

అల త్రిణేత్రుని గుట్టుమట్టులను దెలియ
నెంచి తద్రిపుచరుల నేమించెనేమొ
భావజుం డన్నకరణిఁ దద్వనము నెల్ల
కడల వన్యపుష్పములు భృంగములు దిరుగు. ౩౧

అంబతోఁ గూడుకొని ప్రమథాధిపతియు
ననువుగఁ గదంబమూలము నధివసింప,
అగురుమాకందజంబూవటాదిపాద
పములు సిగ్గున మందమందముగ నుండె. ౩౨

శాఖశాఖకు ఫలసహస్రములు గలవు
వానిలోఁ బెక్కుతెగలు తద్వనమునందు;
మహి నొకం డయి సర్వాగమములఫలము
లీలఁ గనఁబోలును గదంబమూలమందె. ౩౩

ఇచటియార్యులచేఁ దృణీకృతము గాన
నీ చరాచరభువిఁ జరియించుఁ బసులె;
అమలవైకుంఠవాసమునకు తృణీకృ
*తమ్ము గావున హరిణాదృతమ్మె యయ్యె. ౩౪

*హరిణాదృతము = విష్ణునిచే ఆదరింపఁబడినది అను భావము స్ఫురింపఁజేసి కొనవలెను. లేళ్లచే ఆదృతమైనది.

పూలఁ గోయుఁగ వృక్షాగ్రములకు నెక్కు-
మునికుమారుల లాలించుచును విబుధులు
ఏఫలము కోరి మీతంత్రు లిటు తపింతు
రనుచు శంకితులై నిత్య మడుగుచుండ్రు. 3౫

ఇచటినీపముల్ మునులనే యెపుడుఁ గనుట
మొగ్గగముల రోమాంచముల్ మొనసినటులు
పుష్పరసవృష్టిని ముదశ్రుపూర్ణములటు
పుప్పొడుల నొప్పును విభూతి పూసినటులు. 3౬

శివకరావలంబనమునఁ జెలఁగుమృగము
ఆత్మబంధువు మా కని యచటిమృగము
లెలమిని మృగాదనముల సేవలను గొనుచు
హాయిగా స్వేచ్ఛగాఁ దిరుగాడుచుండు. 3౭

వేఁటఁబడి మడిసినవ్యాఘ్రవితతి యచట
శివసరూపత నంది మచ్చికలు మీఱ
మాకులమువాఁడవే మహాత్మా! యటంచు
తమ్ముఁ జంపెడిబోయల నెమ్మిఁ బలుకు. 3౮

దృష్టవేదోక్తవిధులయం దిచటిధీరు
లతివిరక్తు లటన్నచో నబ్ర మున్నె?
త్రిదివమును మించునిచ్చోటఁ గుదురుకొనియు
నాకఫలకర్మముల వార లాదరింత్రె? 3౯

పాణియందు మృగంబును ఫార్శ్వతలము
నందునఁ గిరాతి నొడిలో మహోగజమ్ము
నేఁటికివఱ కాదరించుచునే చరించు
నద్భుతం బిట నొక్క పంచాననంబు. ౪౦

ద్వాదశైకాంతభావ్య మై తనరు నెద్ది
యద్ది త్రయ్యంతదృశ్య మెట్లగును మనకు ?
అనుచు నిశ్చయించికొనియే యచటిపాశు
పతులు బ్రహ్మర్షివరులును స్థితి వహింత్రు. ౪౧

తీవత్తై కఠవల్లికాదికము, శాఖ
లగుచుఁ గాణ్వమాధ్యందినాద్యఖిలములును;
మహితసర్వాగమస్తోమమయము నైన
దానిమహిమము వర్ణింపఁ దరమె మనకు ? ౪౨

## సుందరనాథవర్ణనము

జనులదీర్ఘతపఃఫలసార మఖిల
లోకకల్యాణకరము దయాకరమ్ము
దివ్య మవ్యయ మామహాదేవలింగ
మం దొకకదంబతరుమూల మధివసించు. ౪౩

వేదవాగ్గుంఫముల సుసంవేద్య మెద్ది ?
మౌను లెద్దానిఁ గన యత్నమూనువారో ?
నామమున రూపమునను సుందరము నగుచు
అది కదంబమూలమునఁ బ్రత్యక్ష మిచట. ౪౪

పాండ్యుచేఁ గొట్టఁబడియు నిప్పటికిఁ జెదర
దబ్బురం బగు బెత్త్రపుదెబ్బజాడ;
అతని నానారహస్యసర్వాగమప్ర
బోధనీయసర్వాత్మతాస్ఫూర్తిఁ దెలుప. ౪౫

నిఖిలనిగమాగమాభిసంధిని, వెలుంగు
లీలఁ దారాత్మకగిరీశలింగమందు;
అర్ధచంద్రుఁ డర్ధేందు వై, యాజటాగ్ర
సింధువదిమాత్ర మొప్పును బిందు వగుచు. ౪౬

దేనిమూలము మూలినిం దెలియ నెంచి
పయనము లొనర్చిరో ప్రజాపతియు హరియు
వినుతతన్మూలమూలు లీవృక్షమునకు
మూలమూలులై యయ్యె నబ్బురము గదర. ౪౭

తలిరులం దోఁగియును మరందముల మునిఁగి
బ్రుంగి పత్రంబులను భోగిభూష లంది
ఆ స్వయంభూమహాలింగ మర్చలను, ద
నంతఁ దాను సుందరనాథుఁ డై గడించు. ౪౮

అద్వితీయు మేకము బ్రహ్మ, మట్టిదాని
నాలు గయ్యె శ్రుతుల్ చెప్పఁజాలవయ్యె
నట్టిబ్రహ్మము లమలపంచావయవము
లై విరాజిల్లె సుందరహారున కిచట. ౪౯

బంధముక్తత కనినజీవములగములు
క్రిక్కిఱిసి యహంపూర్వికఁ ద్రొక్కడుపడి
యెట్టులో యిందుఁ జొచ్చిన హేతుకలనఁ
దొడరె నీలింగమునకు దంతురత నిజము. ౫౦

శివునితనువును వేదముల్ చిత్స్వరూప
శాశ్వతానందమయ మని చాటెఁ గాని,
యీదృశదయామయం బని యెఱుఁగ వయ్యె
నదియును గదంబమూలమం దమరె నిచట. ౫౧

గూఢముగ నుండవలె ననుకొన్నఁ గాని
యీపరజ్యోతి గూఢమై యణఁగు టెట్లు ?
ఛన్నతను గన్న; బొదలచంద్రరేఖ
యేల చూపకుండుఁ గదంబమూలమందు. ౫౨

హరునిలింగమునకుఁ గళ లైదె యనుచు
శైవశాస్త్రములందుఁ బ్రసిద్ధి గలదు
కాని యీలింగ మున్న దేశానమాత్ర
మలచతుష్షష్టికళలు విఖ్యాతిఁ గాంచె. ౫౩

అర్చ లిడి లింగమునకుఁ గృష్ణార్జునులు, న
నేకసిద్ధుల నందిరం చెఱఁగి తొల్లి
యలఁది కస్తురి కప్పురం బఖిలలోక
లీమహాలింగ మర్చింతు రిప్పటికిని. ౫౪

## ప్రథమతరంగము

దేనిపీఠము క్రింద బంధింపఁబడుచు
వాణి కటకటచే వెలివడదొ, యట్టి
కారణేశత్రయంబును మీఱి వెలుఁగు
నట్టిశివుని వర్ణింప హా కాదు నెటులు ? ౫౫

జలక మాడించు నిచ్చలు జహ్నుతనయ
అర్చలను దీర్చు నెపుడు సుధాంశుమూర్తి
నట్టడవి నొంటరిగఁ దాను నవయుచున్నఁ
గడఁగి యాలింగ మెల్లలోకముల నోము. ౫౬

అడవిపక్షులకూఁత లటన్న దేవ
గాయకులపాట లన్న నొక్కటిగ నెంచి
లీల ఖేలించు నాశివలింగ మచట
శర్వదృష్టికి సర్వము సమమె కాదె. ౫౭

అచ్చరలతోడ విద్యాధరాళితోడ
దివ్యయోగులతో వినోదించు నెవ్వ
డాతఁ డీలింగమునఁ జిర మధివసించి
యాదుకొను వ్యాధజంతువిహంగవితతి. ౫౮

అచట లింగస్థితుం డైనయట్టిశివుని
బూవులనురాల్చి పాదపములును, గొమ్మ
కొనల గోఁకి కురంగముల్, కుబుసము లిడి
సర్పతతియును భక్తి నర్చల నొసగు. ౫౯

దేవగణము లదృశ్యత దీపములను
సంజలం దస్ఫాలమ్ముగ ననదరింప
వృద్ధజంబుకమ్ములు నోటివెంట నెడలు
జ్వాలనముల వాని సుప్రకాశముగ నెఱపు. ౬౦

వన్యగజములలో గణేశ్వరుఁ డొకండు
వ్యాధవర్గంబునఁ గుమారవరుఁ డొకండు
శబరకాంతల నయ్యాదిశక్తి యొకతె
యాపురారిసన్నిధిఁ దిరుగాడు చుండ్రు. ౬౧

గిరగిరం గాలచక్రము తిరుగ నిటులు
చావుబ్రతుకుల నీప్రపంచంబు దొరల
నమరులందున యోగిసంఘములలోన
నీరహస్యంబు గుర్తించి రెవ్వ రెవరో ? ౬౨

దివ్యతరదృష్టి, నాప్తోపదేశకలన
మునను, ననుమానమునఁ, బూర్వపుణ్యవశత
నీకదంబకాంతారమహేశుగాథ
అల్లనల్లన స్వర్గమం దలమికొనియె. ౬౩

దూరమం దుండి నతు లిడి తొలఁగి కొంద
ఱచటినీపతరూత్కర మరసి కొంద
ఱవ్వనిం జొచ్చి నల్గడ లరసి కొంద
ఱరిగి; రాలింగమును ధన్యు లరసికొనిరి. ౬౪

కాంచి వారు మదగ్రజుల మించినారు
అర్చ లిడినారు ఫుల్లనేత్రాబ్జతతుల,
అమలినంబు లానందాప్లుతములు నైన
తీయనియొడందలను నివేదించినారు. ౬౫

ఈరహస్యమున్ మీర లెంతే నిగూఢ
ముగను దాఁచియుంచినను మేము గనుఁ గొంటి
మనుచు, విధిని వేదముల, శిలాదసూను
నాడిపోసిరి వేర్వేఱ నందఱప్పుడు. ౬౬

వాక్కులను బూజ లిడిరి వాక్పతులు, మతుల
ధ్యాన మొనరించి మ్రొక్కిరి ధ్యానపరులు
బాహ్యపూజావిధానతత్పరులుమాత్ర
మచట సామగ్రి లేమి దుఃఖార్తులైరి. ౬౭

సుందరేశ్వరులింగమున్ జూచి సురలు
దోఁగఁజేసి రభ్రాపగాతోయములను
భూతలమునీంద్రు లద్దానిఁ బొందలేక
అశ్రుపూర్ణాక్షులై జడులైరి కనుచు. ౬౮

తలఁచి వారిపూజాప్రయత్నముల నెల్ల
తెలిసి జల మట లేనందువలనిబాధ
దీనరక్షకుఁ డామహాదేవుఁ డచట
నొకసరస్సును నిర్మింప నూహ చేసె. ౬౯

దక్షిణంబున బాణపాతంపు మేర
సరసు నిర్మింపవలె నని చంద్రమౌళి
వాఁడియాత్రిశూలం బెత్తి వైచె భువిని ౨౦
కేలిమై లీలమై పెల్లగించునగిది.

సుందరేశ్వరుఁ డారీతి క్షోణిఁ గ్రొచ్చి
కాలినాగాభరణమును గాంచినంత
నీదుభక్తున కేహాని లేదు సామి! ౨౧
క్షేమమే శేషున కటంచుఁ జెప్పె గిరిజ.

ఆత్రిశూలాభిఘాతము నంది ప్రిదిలి
వడిగ జగదండభిత్తికయడుగునుండి
బుద్బుదంబులతోడ నుప్పొంగి పొరలి ౨౨
యంచుల న్ముంచి నిండె మహాజలంబు.

విష్ణుఁడు త్రివిక్రమఖ్యాతి వెలయునప్పు
డాకబంధ మధోగతి నందెఁ గాని
ఈతటి శివత్రిశూలాభిఘాతవశత
నూర్ధ్వగతి నంది పూతమై యొప్పెఁ గాదె. ౨౩

ఆమహాద్భుతముం గాంచునట్టిశివుఁడు
లీలఁ దనమౌళి వంచెనో లేదో కాని
తలను నెలకొన్నగంగామతల్లి పడుట
నాసర స్సుత్తరంగితమయ్యెఁ ద్రుటిని. ౨౪

మించి ముల్లోకముల నాక్రమించికొన్న
యాత్రివిక్రముఁడుం దేలియాడునటులు
భవుత్రిశూలాగ్రకలన నుద్భవము నంది
యత్యగాధత లిప్తలో నందె సరసు. ౭౫

బాడబమువల్ల రామకుంభజులవలన
జంకుకొంకు లెఱుంగనిసరసిఁ గాంచి
అబ్ధిఁ గుములుచు నున్నయయ్యాదికూర్మ
మీనములు సమాశ్వాసము నూనె నంత. ౭౬

ఆసరస్సలిలంబున నవతరిలిన
పద్మనలినంబులు వికాసభావ మంద
నాపరేశ్వరురూపులై యవతరిలిన
సూర్యచంద్రులు ప్రీతిఁ గాంచుదురు సతము. ౭౭

రుద్రశూలము త్రైగుణ్యరూప మనుచు
నదె జగత్కారణం బనియెదరు బుధులు
తద్భవం బగుసరసి నుద్భవము నొందు
జలజములయెడఁ గారణచర్చ యేల? ౭౮

పద్మపాటలతయును శైవాలనైల్య
మచ్ఛతయుఁ దోఁపఁ దనత్రిగుణాత్మతయుఁ, ద్రి
శూలసంభవతయుఁ జాటఁ జాలు జలము
స్వీయహేతుగుణంబులఁ జెప్పుచుండె. ౭౯

తరణి పూర్వపుఁదమ్మినిఁ బరిహరించి
యీసరోవరజలజము నెన్నికొనియె;
పద్మ నెలకొన నిండలిపద్మమందె
బ్రహ్మ యాశించె నందుండి ప్రభవ మంద. ౮౦

ఆచమించుఁడు మునుఁగుఁడీ హ్రదమునందు
నాకుఁ దజ్జలంబుల నభిషేక మిడుఁడు
అనుచు సర్వాగమప్రభు వాదరించి
ఋషుల దేవతల ననుగ్రహించె నపుడు. ౮౧

ఖాతంబై గిరిశత్రిశూలమున
భర్గశ్రీజటాధారలం
బూతంబై పరమేశశాసనసము
ద్భూతోపయోగంబునై
ఖ్యాతిం జెందినయీసరోంబువుల
కాదా దేవతల్ గంగనున్
బ్రీతిం జూడరు, జాహ్నవిన్ మునివరుల్,
నిత్యోపయోగంబులన్. ౮౨

వృత్రహతిచే నింద్రుని విలయము.

ఇంద్రుఁ డొకనాఁడు దిక్పతులెల్లఁ గొలువఁ
దనసుధర్మను గొలు వుండి, యనుదినోప
చీయమానతఁ బ్రబలి యజేయుఁ డైన
వృత్రుని జయింప మంత్రాంగవిధిని నెఱపి. ౮3

ప్రథమ తరంగము

మనకుఁ జతురంగబల ముండినను దదీయ
సన్నిధిం జేరఁ జతురత చాల దయ్యెఁ,
అవశమై యంజలి ఘటింప నైన మద్భు
జములబల మాతనిం దీర్పఁజాల దకట! ౫౪

అతఁడు సురలనే పట్టి పల్లార్చుచుండఁ
గట్టువడునె సురాస్త్రసంగతికి లోఁగి?
ప్రబలయూధాధినాథుఁడై పరగువాని
కాసురాస్త్రంబు లెపుడుఁ బాదానతములె. ౫౫

శౌర్య మొక్కఁడె మనకు రక్షక మటంచుఁ
దలఁచుచో నీమహాపద దాఁటఁగలము
పుణ్యజనుఁ డని ప్రఖ్యాతి పొందియున్న
నిరృతి మనవాఁడె యఱుగుఁడీ నేర్పుతోడ. ౫౬

కపటయుద్ధ మొనర్ప రక్కసుల మగుదు
మనుభయం బేల మీహృదయముల కకట!
గర్వ్యాసురభావసంపదకన్న నసుర
భావమే మంచి దనిపించు స్వాంతమునకు. ౫౭

అప్పు డొకద్వీపమందు నిరాశ్రయ మగు
నొకసమాధి నతండు పూనికను బూని
తప మొనర్చుచు నిశ్శంకతను వసించుఁ
గాన సుఖజయ్యుఁ డిష్టమె యైన మీకు. ౫౮

పాకశాసనుఁ డీరీతిఁ బలుకఁ, దక్కు
దిక్పతులు వల్లె యనిరి మోదించి మదుల;
ప్రజల నైజమె పెడదార్ల పట్టు టనిన,
ప్రభువు నట్టిఁడె యైనఁ జెప్పఁగల దేమి? ౮౯

వృత్రుఁ డెచ్చటఁ దప మాచరించుచుండె
నాతపోవనమును నింద్రుఁ డధిగమించి
పావనతపస్సమాధినిర్భరుని వృత్రు
నొక్కవజ్రాహతిం గూల్చె నుర్విఁ ద్రెళ్ల. ౯౦

అట్లు కృతకృత్యుఁడై పోవునట్టియింద్రు
వృత్రహతిఁ జేసి కలుగుకిల్బిషము రేఁగి
తలను విరఁబోసికొని వికృతంపురూపు
పొదల ననుగమించెను మహాభూత మగుచు. ౯౧

మఘవుఁ డారీతిఁ దనసుధర్మకును జేరి
తన్నుఁ గొనియాడుదేవతాతతిని విడిచి
యంతిపురమును జేరుచు ననుగమించు
భూతముం గాంచె మదికి నబ్బురము గొలుప. ౯౨

తనపవిని వీడి కేశబంధమును జార్చి
యాప్తవరులయాలోచన లందికొనక
సమరసాహసుఁ డయ్యు వాసవుఁడు జడిసి
భయదభూతానుగతుఁ డౌచుఁ బఱచె నంత. ౯౩

## ప్రథమ తరంగము

చెడ్డదారుల నాదరించినది యెవరో,
ఆదినుండియు బోధించినదియు నెవరో,
వారె ముందు హసించిరి వ్రజి నప్పుడు,
జనుల కది స్వామియెడ సహజమ్ము కాదె! ౯౪

అతఁడు గిరినుండి గిరికి మహాబ్ధినుండి
యబ్ధికి వనంబునుండి వనాంతరంబు
జగమునుండి జగత్తుకు జడిసి పఱవ
నద్ది విడువక యతని వెన్నాడుచుండె. ౯౫

నముచిహరుఁ డంతలో నిపుణముగ నెంచి
తుది శోకసరోజనాళతంతువున నిమిడె;
సప్తతంతుశతంబును జరిపికొనిన
తనకు నిపు డొక్క తంతు వాధార మయ్యె. ౯౬

ఆయెడ నెఱింగి నహుషుఁ డింద్రాధిరాజ్య
పదవి నెఱపఁగ నుబలాటపడుచు నుండ
రాజు లేనట్టిదయ్యె స్వర్గ మనుచింత
రెచ్చ; దేవత లంగీకరించి రతని. ౯౭

పసిగ నశ్వమేధమ్ముల జరుప లేదు;
అల్పసుకృతమునం జేరె నకట! యితఁడు;
సురలకుఁ బ్రభుత్వ మొనరించుచున్నఁగాని
తనతమోమయ ప్రకృతిని దప్పఁ డితఁడు. ౯౮

భువిని బాలించునప్పు డాభూభుజుండు
తనకు శత్రువు లగువారి జనపదముల
జలదవితతిని వర్షింపనల దటంచు
నాన వెట్టును నేఁ డతిహీనమతిని. ౯౯

ప్రజను వర్షణమునఁ దృప్తిపఱుతు నేనె
నేనె పూజార్హుఁడను ప్రజానీకమునకు
వీ రెవరు నరు లిచ్చుహావిస్సు లంద ?
నంచు దేవతలఁ దృణీకరించు నతఁడు. ౧౦౦

క్రతుహవిస్సులనెల్ల భద్రముగ నాకె
తెమ్ము, మద్భుక్తశేషము నిమ్ము పిదప
వారి వారి, కటంచు నీబాలిశుండు
హవ్యవాహుని బెదరించు ననుదినంబు. ౧౦౧

జాహ్నవీవారిపూర్ణ మహాజలధిలోనఁ
బుట్టెడుపదార్థవితతి యద్భుతము గాన
గంగ నిప్పుడు శోధింపఁ గడఁగవలయు
ననుచుఁ దజ్జలంబును జిమ్ము నాన వెట్టు. ౧౦౨

స్వర్గ మందిన తనపూర్వసైనికులను
ఎఱిఁగి, యెన్నినవారిఁ బరీక్ష చేసి
మూలబలముగ నేమించి, మున్నుగలుగు
నాకబలములఁ దొలఁగించు నహుషరాజు. ౧౦౩

అమితగజహయబల మిప్పు డవసరమ్మె
కల్పకమ్ములఁ నడుగుఁ డీఁ గడఁగకున్న
వైధవేయుం డితండు తత్పాలకులకుఁ
బెఱకుఁ డహ్వాని నని యాన పెట్టుచుండు. ౧౦౪

మున్ను భూలోకమందుఁ దా నున్నయపుడు
కొలిచినను వరంబీనివేల్పుల నతండు,
రక్కసుల నిర్దయులను బ్రేరణ మొనర్చి
వారిఁ గాఁచించుఁ బలుభంగపాట్ల ముంచి. ౧౦౫

సురలు ప్రతిమాసమందుఁ బంచుకొని తినెడి
స్వకులకూటస్థుఁ గూర్చి విచారపడుచు
అబ్జ నోముఁడు బహుళపక్షాదినుండి
యనుచు భృత్యుల నేమించు నాప్రభుండు. ౧౦౬

శక్రశత్రువు లెవరో రాక్షసులలోన
వార లీరాజునకు మిత్రవరు లగుదురు;
పాకశాసనువిషయముల్ పలుకునెడల
వారిపై మండిపడును వాక్శూరుఁ డౌచు. ౧౦౭

నిర్నిమేషనేత్రము లొడల్ నిండుకొనఁగ
పండుకొన, దొర్ల, నంతేని భయము గొనుచు
నాకనులఁ బంచికొనుఁడు మీ నాకులెల్ల
రనుచు సందేశ మంపు మాఘాత్ముఁ డతఁడు. ౧౦౮

పక్షిమృగమానవసరీసృపంబు లెవ్వి
యశ్వమేధాన నీచేత హతము లయ్యె
నవియు నినుఁ జంప వెదకుచున్నవి యటంచు
సురలు భయపెట్టి యుడికింపఁ జూతు రతని. ౧౦౯

సురగణిక నొక్కదానిని జూపి, యీమె
యే శచీదేవి యని సుర లాశ గొలిపి
మోసగింతురు కొందఱు మూఢు నచటఁ;
బ్రజల కిష్టము గానట్టిప్రభుత యేలో ? ౧౧౦

ఆతఁ డొకనాఁడు శిబికయం దధివసించి
మోయుఁ డని మహర్షులను సన్మునులఁ బూన్చి
'సర్ప సర్ప' యటంచు సత్వ నతఁ బలుక
సర్పమవె కమ్మనుచు ఘటజన్ముఁ డాడె. ౧౧౧

భోగ మది తుదముట్టకే యోగ మిట్లు
పిడుగువలె శాపముం దెచ్చిపెట్టెఁ దలను;
కనుక నే భూమినిం బడి మనుచునున్న
భోగిభావంబు వీడఁ డాభూభుజుండు. ౧౧౨

ఇంద్రుసంగతి దివమున నింకిపోయె
నతనిప్రతినిధియును భువిఁ బతితుఁ డయ్యె
నింద్రువృత్తాంత మెఱుఁగఁగ నెదఁ దలంచి
సురగురుఁడు యోగదృష్టిని జూచె నపుడు. ౧౧౩

హ్రదములో నొక్క-సరసీరుహప్రనాళ
మందు యోగనిగూఢత నడఁగునతసి
దేశికుఁడు కరణీయముం దెలుపఁ దలఁచి
కాంచి కరుణాప్లుతముగ బోధించె నిట్లు. ౧౧౪

భయము గొని యెంతకాల మిప్పగిది నిందు
నమరులకు బాధ కల్పించి యణఁగి యుందు ?
దురితమున కేదొ నిష్కృతి జరుపకున్నఁ
బ్రలయమందైన నిన్నది పాసి చనునె ? ౧౧౫

సకలకిల్బిషహర మగుతత్సమాధి
వఱలువృత్రునిఁ జంపుటవలనియఘము
పాపుటకుఁ బతితులను గాపాడునట్టి
శంభుచరణము దప్ప రక్షకము గలదె ? ౧౧౬.

ఎచ్చట శివాజ్ఞ నీయఘం బెల్ల నిన్ను
వెంబడించుట మాను నిర్వీర్య మగుచు
అందనుక పాశుపతదీక్ష నంది నీవు
సంచరించుము శాంభవస్థలములెల్ల. ౧౧౭

అమృతశోధితమట్లు నీయంతరాత్మ
యేస్థలము మెట్టినంతనే యొనక మెసఁగు
నచటనే కరుణావరుణాలయుండు
శంకరుఁడు నీదురితమున్ జదిపినట్లు. ౧౧౮

అనిన గురుశాసనము నింద్రుఁ డాదరించి
తచ్ఛుభాశిషములఁ దలఁ దాల్చి, స్వీయ
వాహనం బెక్కి వివిధశివస్థలముల
సంచరింపఁగఁ దొడఁగె విశ్వాసబుద్ధి. ౧౧౯

పాశుపతసువ్రతంబుఁ జేపట్టి తిరిగె
నామహేంద్రుఁడు నైమిశాద్యఖిలవనులఁ
బూతజాహ్నవీయమునాదిపుణ్యనదుల
మందరహిమాలయాదిసమస్తగిరుల. ౧౨౦

వనముల వసించె సత్తపోవనము లనుచు
హ్రదనదులఁ దోఁగెఁ బుణ్యతీర్థాళి యనుచు
అమితధన మిచ్చె జనులు బ్రాహ్మణు లటంచుఁ
బూజ లెల్ల మహావ్రతంబు లని నెఱపె. ౧౨౧

మఘవుఁ డాంతరబాహ్యసామగ్రి నొసఁగి
యమితభక్తిని ద్రివిధలింగములఁ గొలిచెఁ
గాని హృత్తాపశాంతియే కలుగ; దుగ్ర
పాతకమునకు శాంతి యేరీతిఁ గలుగు? ౧౨౨

అతఁడు తపములు నెన్నెని యాచరించెఁ
గాని పాపము వెన్నాడ మానలేదు;
కొనకు భవబంధముల నెట్టునసమపవన
సీపవనమును బొందె సంతాపపడుచు. ౧౨౩

హారునకు ననుత్తమం బుపహారమైన
శ్రవణభూషణోత్పలసువాసన హారించి
యనులభక్తిఁ జిరాగతుండైన యతిథి
కాకదంబానిలమ్ములు స్వాగత మిడె. ౧౨౪

గాలి చిమ్మినకడిమిపూధూళు లాలయఁ
గాలకంఠుగంగార్ద్రశీకరము లంట
నాసురేంద్రున కటఁ జెప్పనలవిగాని
పరమనిర్వృతి తనయంత పరిఢవిల్లె. ౧౨౫

మనసు దేటను, గనులు నిర్మలము లయ్యె
బలము వర్ధిల్లె, శౌర్యసంపదలు పొదలె
నతఁడు వనసన్నికర్షము నందుకొలఁది
కలుషమును నెమ్మదిగ విప్రకర్ష మందె. ౧౨౬

ఆ నిమిత్తాల కతిహృష్టుఁడై యతండు
గురునిబోధలు స్మృతికి రా నెఱిఁగి యెఱిఁగి
మదిని పరధాముపరమధామంబులందు
దివ్యతమ మిది యంచు గుర్తించికొనియె. ౧౨౭

అప్పు డైరావతము డిగ్గి యధికనియతి
నబ్బురములకుఁ బుట్టినిల్లైనవనిని
గాలు వెట్టెను; బాప మొక్కటియుఁ దక్క
సకలపరిజనవృతుఁడు వాసవవిభుండు. ౧౨౮

ఆతఁ డీక్షించె భుజగఫణాతపత్ర
ముల సుఖించెడినకులసమూహములను
కోఁటకొనలఁ దరక్షువుల్ గోఁకుచుండ
మ్రాఁగనులు వెట్టుమెకములమందల నట. ౧౨౯

కౌతుకమునఁ గిరాతకుల్ కదుపుచున్న
నంతికాన్యతరూపగూహన భయాన
చివురుజొంపముల ముడుంగఁ జేయునట్టి
యగముఁ బెనఁగొన్నలత నట నరసె నతఁడు. ౧౩౦

కదళులం దామరల నిక్షుఖండములను
జివురు లందిచ్చి వేల్ నమస్కృతు లొనర్చ
వన్యగజతతి యాశతమన్యుఁ గొలువ
సురగజం బోర్వఁజాలక చూచుచుండె. ౧౩౧

ప్రమథులు మహర్షు లలపాశుపతులు ఘనులు
దరియ వచ్చెడిసత్తపోధన్యు నింద్రు
నరసి యాదరావృతచిత్తులై కరమ్ము
చేర్చి రాసుందరేశ్వరుచెంత కంత. ౧౩౨

త్రిభువనంబున నామహాదేవలింగ
మశ్రుత మదృష్ట మవిచింత్య మైన దనుచు
నా సహస్రాక్షుఁ డాద్యోపహారముగను
దనదృగుత్పలముల శివార్చనము తీర్చె. ౧౩౩

భక్తియోగాతిరేకసంభరితవృత్తిఁ
గనుల నానందబాష్పముల్ గ్రమ్మికొనఁగ
పతనినిలువెల్లఁ గరఁగి నీరయ్యె, నపుడు
అమ్మయాంగుఁడునా సహస్రాక్షుఁ డమరె. ౧౩౪

సాంబునకు దండవస్త్రప్రణామంబు లిడిన
యతసిదృజ్మయదేహ మల్లంతఁ దోఁచె
దివ్యవికసితపరిమళేందీవరములు
భవుని కర్పింప మాలగాఁ బజిచినటులు. ౧౩౫

సగణు, సవృషు, సనందికేశ్వరు, ససుతుని
సాంబు, నాద్యుని సర్వలోకాధినాథు
నామహాదేవు నర్చింప హరి తలంచె,
మహితములు గావె యమ్మహామహులరుచులు ! ౧౩౬

పిమ్మట స్మరింపఁబడి సమీపించె విశ్వ
కర్మ సురగురుతోఁ బ్రభుకార్య మెఱిఁగి
శక్రుశాసనమును శిరసావహించి
యొకశివాయతనము గూర్ప నుద్యమించె. ౧౩౭

దివ్యసుముహూర్త మందు నా దేవశిల్పి
దంతులు విమానరూపము దాల్ప దివిని
దాఁకుశిఖరాళితోడఁ బ్రాగ్ద్వార మెత్తి
పపులగర్భాలయంబు గావించె నదట. ౧౩౮

మూఁడు ద్వారముల్ ముద్దులుమూటఁ గట్టు
భవ్యమణిమండపం బొందు పరిఢవిల్ల
విపులసుందర మర్ధమండప మొకండు
దేశశుభ మెంచి కల్పించె దేవశిల్పి. ౧౩౯

భవ్యపరివార దేవతా ప్రతిమలకును
వివిధచిత్రాలయమ్ములు వేడ్కఁ గూర్చె
సుందరోన్నతగోపురశోభితముగ
నచటఁ బ్రాకారపంచక మ్మలవరించె. ౧౪౦

విమలశాలపుష్కరిణిపశ్చిమపుఁదీర
మందున భవాని కొక్కరత్నాయతనము
అల్లగణనాథునకు నొక్కయాలయమ్ము
దివ్యమణిగణయుతము సంధించె శిల్పి. ౧౪౧

ఆ మహేంద్రునిప్రభుతకు నమితభక్తి
పాటవమునకు వన్నెలు పరిఢవిల్ల
వివిధమండపశాలలున్ విపులతరము
లైనయుత్సవవీథిక లతఁడు దీర్చె. ౧౪౨

పుణ్యదృష్టియు నగుమోము భుజయుగంబు
శ్రితనవోత్పల మమర దక్షిణపు వెసన
గరళశకలమ్మునా గడ్డకట్టునయును
దేవివిగ్రహ మా శిల్పి దీర్చె నచట. ౧౪౩

తనకు నొడలెల్లఁ గన్నులే యనుచు సతము
వేనిఁ గాంచి యింద్రుఁడు లోన వెక్కసపడు
నవియె యీవిశ్వకర్మకృత్యములఁ జూడఁ
జాల వని నేఁడు మిగుల విచార మందు. ౧౪౪

వామభాగ మైననీవామనయన
నరయఁగోరును విభుదక్షిణాంగ మనుచు
నింగితజ్ఞుఁ డా బుధశిల్పి యీమెయునికి
శివునికిన్ దక్షిణంబుగఁ జేసె నేమొ ? ౧౪౫

వివిధశుభలక్షణోపశోభితమధురము
లలిత మీబింబ మని చూఁడఁదలఁచునాది
శక్తి నింద్రుఁడు ప్రార్థించె, ససిగ గురుఁడు
నావహింపఁగఁ జేసె, శివాజ్ఞ యయ్యె. ౧౪౬

తనవలనఁ బుట్టునీజగత్తులనెల్ల
*తనదుదృష్టియె పోషించి తనరుచుంట
మీనలోచన యనుచు నామెకు సునామ
ధేయ మంకించె నప్పు డా దేవగురుఁడు. ౧౪౭

దివ్యకనకకంజంబుల దేవవిభుఁడు
అర్చ లొనరింపవలె నని యాత్మఁ దలఁచి
యమరదూతగ గంధవాహుని బనిచి
స్నానమాడెను శూలపుష్కరిణిఁ దాను. ౧౪౮

*మీనము దృష్టిచేతనే సంతతిని పోషించుట సూచితము.

నిత్యవిధు లామహేంద్రుఁ డన్నియును దీర్చి
క్షణము ధ్యానించుచును శివార్చన మొనర్పఁ
గాంచుచుండఁగ శూలపుష్కరిణియందుఁ
బుట్టె స్వర్ణాబ్జములు బుగబుగలు నిండ. ౧౪౯

అబ్బురము చిఱునవ్వుఁ ద న్నావరింప
సురభిలస్వర్ణపద్మాల హారునిపూజ
లొనరుపం దెచ్చెఁ బాకశాసనుఁడు భక్తి
సరసి కనకాంబుజినిపేర శ్లాఘ్య మయ్యె. ౧౫౦

తలఁచినంతనె పొడముపద్మములయెడలఁ
గాంచనత యేడ, సౌరభకలన యేడ?
భ్రాంతికల్పితతత్త్వదర్శనము భువిని
నిర్జరులకు యథార్థమై నెగడు దివిని. ౧౫౧

పుష్కరిణిలో సుగంధిలపుష్కరముల
దానిపావనాంబువుల వృద్ధశ్రవుండు
శివులకు గురూక్తవిధిఁ బూజ చేసె నతుల
నుతుల సంతుష్టి గావించె నతులభక్తి. ౧౫౨

సంభ్రమాతిరేకంబున సారమెడల
నదరుడగ్గుత్తి సంప్రమోదాశ్రువృత్తి
లోకజనకుల నింద్రుం డలోలవృత్తిఁ
బూజలను జేసె వాక్సుమంబుల నొసంగి. ౧౫౩

అవని నియ్యది సుందర మైనతావు
అంతకన్న సుందర మీమహోర్వీలింగ
మహాహా ! సుందరసుందర మ్మగును నీదు
నమృతమయ మగునామధేయము మహేశ ! ౧౩౪

మందరమునందుఁ గనకాద్రికందరమున
మంచుమలయందు నిన్ను సేవించుకొంటిఁ
గాని యీవిశ్వపారముఁ గనఁగనైతి
నచట నిటవలెనే యుంటివా ? మహేశ ! ౧౩౫

మఖజపంబుల దానహోమములనేని
భవ్యతపములనేని లభ్యంబు గాని
యిట్టినీసన్నిధానము నిచట నందు
కొనె నిరీహంబులై యున్నకొన్నితరులు. ౧౩౬

[illegible] లణంగి రీత్రిలోకమ్ము జితము
సర్వము లభించె దీన లాభం బదేమి ?
ఇచటిమృగవిహగంబులకేని, మాకు
ఆరతు లొసంగి కొలువ నర్హతలు గలవె ? ౧౩౭

తివిరి కైవల్యమేను సాధించికొనినఁ
గాంచునది త్వదానంద మొక్కటియె గాదె !
నీదుప్రత్యక్షసేవల నెగడునట్టి
యీమహానందమం దది యెంతపాటి ? ౧౩౮

## శివలీలార్ణవము

జడజగంబెల్ల నీదయ సాగుచుండె
సజడ మాదృశనిఖిలజీవాళి, పదరి
వాఙ్మనసగోచరత లేనివాని సర్వ
శాసకుని నిన్నె పొందె విశ్వాస ముంచి. ౧౪౯

హరునిలో నవినాకృతి నందియున్న
అంబ! మీనాక్షి! నిను వేఱె యూడవలెనె?
ఐన నిను వేఱుగాఁ జేసి యూడుకొనెద
వేఱుగా నన్ను దలఁపకువే మదంబ! ౧౫౦

అద్రుల వనంబులందు వెంటాడుచున్న
నిన్ను గిరిరాజసుత వని నిరతిఁ దవిలి
అంబ! ప్రియకప్రియా! నిన్నె యనుసరింప
త్ర్యంబకుం డీకదంబమూలంబుఁ జేరె. ౧౫౧

లోకలోకేశ్వరులకు లోలోన వెలయు
శక్తివై, నిండియున్నను జగములెల్లఁ
బూర్ణకరుణార్ద్రమైన నీమూర్తి వీడఁ
జిత్త ముత్తల మందు విచిత్ర మేమొ? ౧౫౨

ఈమహావనిలోన నెన్నొనిహారకలు
నింద్రపాదపములు నెన్నొ యింద్రలతలు
నాదు పేరిట నెలకొని నీదుసేవ
కడఁగి చేయుట నాసేవగాఁ దలంపు. ౧౫౩

సీతరంగితాపాంగసన్నిహితు లగుచు,
నెందఱెందఱో బ్రహ్మలు నింద్రు లుంద్రు;
నాకమున కేటిలోచ్చ నే లేకయున్నఁ
గృపను నను జేర్చుకొమ్ము నీకింకరునిగ. ౧౬౪

దనుజులందున నాకు మత్సరము సురిగెఁ
బానుఁగువడియెను త్రిదివోపభోగపరత
వృత్రహననకిల్బిషమును వెలికిఁ దోలఁగ
భవదనంతదయాదృష్టి పరగుకతన. ౧౬౫

భక్తులం దగ్రగణ్యుఁడై ప్రణుతి సలుపు
నామహేంద్రునిఁ గరుణామయైకదృష్టిఁ
దనిపి కాంచుచు నాదిమదంపతు లిటు
లాడి రప్పుడు భక్తప్రియంకరముగ. ౧౬౬

పార్షదులలోన నొకఁడవై పరగు మీవు
కొడుకు లిర్వుర మూఁడవకొడుక వీవు
ఎఱిఁగితిమి లెమ్ము నీదగుపరమభక్తి
బ్రహ్మహత్య నీయది పటాపంచ లయ్యె. ౧౬౭

వజ్రి! వాసంతికాద్యపర్వములయందు
నిటులె నీయనుయాయులనెల్లఁ గూడి
నాకనగర మ్మిడిగి కనకారవింద
ములను భక్తిని మాదుపూజలను సలుపు. ౧౬౮

పలుక నీరీతి నాదిదంపతులు దయను,
సపరివారుఁడై పాకశాసనుఁడు వెడలు
నపుడు వేవేల్ నతుల్ ప్రహృష్టుఁ డగుచ [illegible]యు
శివునిదయ యిన్మడించె విచిత్రలీల. ౧౬౯

ద్విరదవరాస్యు వీడ్కొని మ
దిన్ బ్రణమిల్లుచు భక్తి నందికే
శ్వరుఁ బ్రమథాళికిం దెలిపి,
శాంభవమూర్తికి చండచండికే
శ్వరునికి మ్రొక్కి, మానుల ప్ర
శస్తులఁ దాల్చి, గురున్ భజించి, యా
హారి కరి నెక్కి నాకమున
కై పయనించెను ధన్యమూర్తియై. ౧౭౦

ఇంద్రగజ శాపమోచనము.

వెడల మహేంద్రుం డిట్టులు
కడచెను మన్వంతరం బొకం డీలోనన్
గడుకొని వేడ్కయింద్రుం
డడు గిడి నాకంబు నేలనయ్యెం బ్రభువై. ౧౭౧

అభ్రమాతంగ మెక్కి యయ్యమరవిభుఁడు
అమరవరులు సేవకులుఁ ద న్ననుగమింప
విభ్రమంబున వాహ్యాళి వెడలె స్వర్గ
పురబహిఃప్రదేశములెల్ల సరిసికొనుచు. ౧౭౨

అంత సతపత్రపనరూప మైనవాఁడు
అజ్వాలజ్వాలనాకృతి యైనవాఁడు
అష్టసిద్ధుల కాకర మైనవాఁడు
అతని కెదు రయ్యె దూర్వాసుఁ డభ్రగతిని. ౧౭౩

అఖిలలోకంబులను బ్రలయం బొనర్చు
రుద్రశక్తిని బాలింప లోఁగి యతని
కోపము జ్వలింపదే కాని కోరి తేఁగ
నఖిలజగము లోకాహుతి యై నశించు. ౧౭౪

ఆతఁ డగ్నిగృహంబున నధివసింపఁ
బిలువకయె నిల్చి దేవతావితతి బయట
మొనసి యావాహనక్షణమునఁ దమంత
వచ్చి కాన్పింత్రు వడవడ వణఁకికొనుచు. ౧౭౫

వహ్ని యాతని ననుగమింపఁగ వడంకుఁ
జోటు తప్పింపదే హవిస్సును గ్రహింప
అరణి మంథనమం దైన గాలసింప
దడలుకొనును నిప్పుచ్చరం బగుట కేని. ౧౭౬

ఆతఁడు శివ ప్రసాద మానజ్జ మూని
స్వర్గవిభుఁ డుపపూజ్యభావము తొలంక
హరికి నందించె నాతఁ డనాదరముగ
దాని నందుచు హస్తిమస్తమున వైచె. ౧౭౭

కరియుఁ దనపుష్కరమునఁ బుష్కరము పట్టి
నైజ మొప్పఁగ నద్దాని సలుప; మునియుఁ
గపిలదృక్కోణముల నిప్పుకలు తొరఁగ
నధరము చలింపఁ గనుబొమ లార్చె నపుడు. ౧౭౮

అప్పుడు చలించె నాదిత్యుఁ, డడఁగె గాలి
భూమి కంపించె సార్ణవంబుగను బొగిలి
అంతరిక్షము వ్యథపడె, నచటి దేవ
గణము లెల్లను భీతిల్లి వణఁకిపోయె. ౧౭౯

వజ్రియం దొకదుర్వారవజ్రముగ, ని
రంకుశం బగుగజమున కంకుశముగ
హస్తిహస్తిపకులకు నాయయ్య యపుడు
ఘోరశాప మిచ్చెను మహాక్రూరవృత్తి. ౧౮౦

తివిరి పాండ్యుఁడు మాలి భేదింప హరికిఁ
గరికి భూవాసమును క్షుద్రకరికివలెనె
శాపముగ నిచ్చి యాముని శాంతి చెందె,
నగ్ని కట్టెలం గాల్చి చల్లారునటులు. ౧౮౧

శాంతి కనినమానిని దేవసంఘ మెల్ల
సంభ్రమోద్వేగవందనసాంత్వనములఁ
బొదివికొని సుప్రసాదాభిముఖు నొనర్పఁ
బరమమాహేశ్వరుం డిట్లు పలికె దయను. ౧౮౨

మకుటలక్షణ మైనతన్మౌలిని వడి
నూడఁగొట్టెడుఁగాక పాంగద్యుండు కవిసి
సుందరేశార్చనాంతమే సురగజమున
కిచ్చియున్నశాపము ఘటియించుఁగాక. ౧౮౩

చిరతరమహేంద్రసవిధసంచరణవాస
నారసికుఁ డైనసురగజనాయకుండు
అచలపతి యగునామహేంద్రాద్రియందె
జనన మందెను బూర్వవాసననుబట్టి. ౧౮౪

భువిని జతురర్ణవపరీతముగను దనకు
మూఁపునం దాల్చి తేలిక మోవ నేమొ
మహిని భేదించు నామూలమగ్నదంత
మగుచు నైరావతం బాటలందు మునిఁగి. ౧౮౫

ఏగజంబుల మదగంధమే స్పృశింప
ధావన మొనర్చు నితరమతంగజమ్ము
లవ్వి యాకరిపోతకర్ణానిలములు
సోఁకినంతనె ధావింపఁ జూచుచుండు. ౧౮౬

తుండమున సింహమును బట్టి యెండుగడ్డి
పోచపోలిక నీగజం బేఁచి విసరు
పాదముల గ్రాహవితతిని బట్టి బిట్టు
భేకమర్దముగాఁ జంపివేయుచుండు. ౧౮౭

మొసళులు గ్రసించు, హర్యక్షములు వధించు
మానవులు కట్టినైతు రన్ మాటలు విని
యా మహాగజ మబ్బుర మంది మదిని
వట్టిమాట లటంచు భావమున నెంచు. ౧౮౮

ఒక్క తొండపు బీల్పుతో నక్కజముగ
నాగజము సరిత్సలిలము లాస్వాదించి
నిజముగా మదధారల నెపముతోడ
వెలికి నిస్సరణమ్ము గావించుచుండు. ౧౮౯

తనకు లోఁగిన వని మగతనము సూపి
గజముల సజమ్ములను బోలెఁ గడకు నెట్టు
నరసి మధ్యములోకసుందరత, నభము
భువి యొనర్పనా రజమును దివికిఁ జిమ్మ. ౧౯౦

దిగ్గజంబులబరువులు దీర్ప నేమొ
పాదముల విరఁజిమ్ము భూభాగ మెల్ల
నుదధిజలము మిన్నేటికిఁ జెనరఁగొట్టుఁ
జిరవియుక్తదంపతులను జేర్చుకరణి. ౧౯౧

అవ్వనంబునఁ బర్విడునట్టి సింహ
శరభశార్దూలవనచరజాతివలన
మృగములను రక్ష సేయుటనే గజమున
కమ్ముభతమృగేంద్ర మనునామ మమరె భువిని. ౧౯౨

ఇంద్రగిరినుండి మలయాచలేంద్రమునకు
మలయముననుండి దర్దుర మ్మెలమిఁ దిరుగు
చొక్కినాఁ డాగజమ్ము మహోజ్వలంబు
నవ్యసుమగంధనీపకాననముఁ దఱిసె. ౧౯౩

మదసుగంధమునకుఁ జేరుమధుపతతులు
చోపుదారులు గాఁగ నచ్చోటు వాసి
మందమందయానమ్ముల మధుసుగంధి
కమలమండిత హైమపుష్కరిణి కరిగె. ౧౯౪

గణపతి మదోత్థగంధసంగతికిఁ దనిసి
యుండుటను మత్తమధుకరవ్యూహ మచట
దానిమదధారలందుఁ జిత్తమును దగుల
నీయక నుపేక్షభావమునే వహించు. ౧౯౫

పాలసంద్రాన మంథాద్రి పడినరీతి
సరసునందున దుముకి నక్కరివరంబు
ఆకదంబవనాంత మల్లల్లఁ దేలెఁ
బొంగిపొరలెడియుత్తుంగభంగతతుల. ౧౯౬

మలిన మగుచును మునుఁగ నా మత్తనాగ
మాసరసునుండి నిర్మలం బగుచుఁ దేలె;
ధామమాత్రమె యైనయీభద్రగజము
వన్యగజముల కది సార్వభౌమ మయ్యె. ౧౯౭

నీరజాకరమున మున్గి తీర మంద
రహిని బహిరంతరముల నీరజము నయ్యె;
గజము మునిశాపమును వీడె నిజ మెఱింగి
తబిసిమాటల నెదలోనఁ దలఁచుకొనియె. ౧౯౮

శైవగాంగేయము లయినజలజములను
గమలకాస్పదము లయినకమలములను
సింధురము నేకదంతమున్ సింధురమ్ము
తమిని బూజించె నాచతుర్దంత మంత. ౧౯౯

పుష్కరోపహృతస్వచ్ఛపుష్కరముల
శ్రీమహేశ్వరులకు నభిషేక మిచ్చి
మరలఁ [1]బుష్కరసంగతి మదిని గోరి
పుష్కరమ్ములచేఁ బూర్ణపూజ సలిపె. ౨౦౦

[2]గౌరకాంచనసుమమె శంకరున కెలమి
కూర్చు నందురుగాని యీకుంజరమ్ము
తెచ్చిన[3]పిశంగసుమమె తృప్తిని ఘటించెఁ
బరమశివునకు; నది యెట్టిభాగ్య మగునొ ? ౨౦౧

శాపము తొలంగి యాగజేశ్వరుఁడు పుడమి
ముదము గదురఁగ సంచారముల నొనర్ప
నాఁటినుండియు గజతీర్థనామమున మ
హాసరోవర మందెఁ బ్రఖ్యాతి భువిని. ౨౦౨

---

1 స్వర్గప్రవేశమునుగూర్చి 2 ఉమ్మెత్త 3 ఆ రంగుగల తామర.

అచట నైరావతేశ్వరుఁ డనెడిశివుని
గడఁగి యైరావతవినాయకుఁ డనుశివుని
వరుస నాసరిత్తటిని స్థాపన మొనర్చి
పూజలను జేసె సద్భక్తిపూర్వకముగ. ౨౦౩

సుందరేశుని కెదుట నానందముగను
ఆ గజేంద్రుఁడు స్వామినామాంకితముగ
నిలిపియుఁ బురందరేశునర్చలను దీర్చె
భక్తితాత్పర్యవినయప్రపత్తు లొలుక. ౨౦౪

అచటఁ జిరతర ముండి యాయమరగజము
సుందరేశునికడ సెల వంది దివికి
చేరుకొనుతోడనే సునాసీరవిభుఁడు
కాంచి యుద్దానిఁ గన్నులఁ గప్పికొనియె. ౨౦౫

ఆకదంబవనికిఁ దూర్పునందు నెలసె
మిగులఁ జెలువగుకల్యాణనగర మొకఁడు;
అందుఁ జిరకాలమున నుదయంబుఁ గాంచె
వణిజుఁడు ధనంజయుం డనువాఁ డొకండు. ౨౦౬

అస్త్రసిద్ధికినై భక్తి నరిగి తీవ్ర
తరతపం బొనరించి శంకరునితోడ
జగడముం గొన్నయాధనంజయునికన్న
నిస్పృహుం డితఁడే మంచినేర్పుకాఁడు. ౨౦౭

అమలతరుణేందు శేఖరునం దతనికి
నమరునాజన్మసిద్ధమైనట్టి భక్తిఁ
బరులయాగంతుకం బైనభక్తి దాని
ననుకరించుటకే నసమర్థ మగును. ౨౦౮

చతురు లైనవణిక్కు లీజగతిలోనఁ
బది యొసంగి చేకొందురు పదియునొకటి;
ఈతఁ డర్థుల కొక టిచ్చి యిహమునందు,
పరమునందు సహస్రముఁ బడయ నెంచు. ౨౦౯

ఒరులక్షేత్రములును ధ్వంస మొనరుచు నను
శంక బాధింప నీధనంజయుఁడు సతము
తనదుగోషంగవము నెప్పుడును బహిర్గ
త మ్మొనర్పక యుండుఁ బెత్తనము తనర. ౨౧౦

వసుధ నుల్లేఖన మొనర్చి బ్రతుకుచుండె
వైశ్యకులవృత్తిఁ గాఁ బరిపాటి యుండ
నాకమునె చక్క నుల్లేఖన మ్మొనర్చి
స్వకులవృత్తిని విడనాడఁ జాలె నితఁడు. ౨౧౧

అనుదినమ్మును సుకృతముం గొనుచు కాని
యామహావైశ్యుఁ డమ్ముటన్నది యెఱుఁగడ
సమయమున నుపయోగింపఁ జాలు ననియె
చలుపుచుండును బుణ్యరక్షణము నతఁడు. ౨౧౨

అతఁడు వాణిజ్య మొనరింప నఖిలదేశ
ములఁ జరించియు మఱల నిమ్ముననుఁ జేర
నడుమ నొకనాఁటిసాయంతనంబునకును
జేరికొనియెను సీపకాంతారభూమి. ౨౧౩

అప్పుడు మందేహయుద్ధరక్తాక్తదేహుఁ
డరుణుఁ డరుణుఁడై పోనుండ నస్తశిఖరి
కనుచరకరమ్ము లప్పు డల్లల్ల మగిడి
వ్రేలఁబడుచును వెన్వెంట వెడలుచుండె. ౨౧౪

గర్హ సేయఁదొడంగఁ గోకములు రజని
నలచకోరిక లద్దాని నభినుతించు;
ఆకులమ్ముల కుదరి సాయాహ్నవేళ
ముక్కుపోటుల జగడ మెప్పుడును జగుగు. ౨౧౫

కొన్నిద్విజతతు లప్పు డాక్రోశ మంద
మౌన మూనుచుఁ గొన్ని నెమ్మదిగ నుండె;
కడక నిట "ద్విజానా మనేకత్వ" మనెడి
తథ్యజాతీయ మిచట సార్థకము కనఁగ. ౨౧౬

అలప్రతీచిప్పైఁ దోఁచెడునట్టిరాగ
మెంతకాలము నిలుచుఁ? దా నెపుడుఁ దిరుగు
నరుణరాగము ప్రాచియం దనవరతము
దృష్టచర మాట జగతికిఁ దెల్లమొకద. ౨౧౭

అస్తమింపఁ దేజోరాశి యంత నంత
గగనమందునఁ దారకాగణము దోఁచె
లోకమెల్లఁ దమోరాశిలో మునుంగ
మిణుకురిక్క లొానర్చెడిమే లదెంత ? ౨౧౮

భానుకరములై నక్షత్రపటలిరూప
మున వెలింగెడినింగిపై నన్గి పెనఁగి
యైనఁ దపనుఁడు లేడుగదా యటంచుఁ
జిమ్మచీకట్లు జగమెల్లఁ గ్రమ్మి కొనియె. ౨౧౯

పద్మములజాతి ముకుళభావము వహింప
తలుచు జాత్యనురోధము తప్ప దని వి
*కర్తునిచేత నున్నపంకజము గూడ
వినతభావముతో నిమీలనము దాల్చె. ౨౨౦

దిఙ్ముఖములందుఁ జిక్కనితిమిరపటలి
కరడులం గట్టి యూఘనాఘనము లట్లు
లొకటి నింకొక్కటి దురీన నొఱసికొనుచు
భీతి కొల్పెడురీతి వ్యాపించుచుండె. ౨౨౧

కొలఁకుల నిరంతరమ్మగ నెలవుకొనిన
శైవలోత్పలపట్పదసంతతుల సు
రూపము నిశాముఖమున నెఱుంగఁబడును
స్పర్శసౌరభ్యకూజాభిసంధికలన. ౨౨౨

*పద్మాసనః ...పద్మకరో పద్మద్యుతిః... సూర్యః అని.

గగన మెల్లెడఁ గూలినగతి వలిర్వ,
సంద్ర ముప్పొంగి పొడమినజాడ దోఁప,
వెగ్గలం బైనయట్టియవిద్య లోక
మాక్రమించినరీతిగా, నడరెఁ దమము. ౨౨౩

ఇనుపసంకెలల్ వలె బిగియించుటకును
గొసరి తృణపూలమట్టులు కోయుటకును
తడి తొరంగినభూమి నాఁ ద్రవ్వుటకును
బదనుగా నుండె నప్పటిముదుకతమము. ౨౨౪

మనసుచేనైన లంఘింప ననువుపడని
తరణి కంకనివేగవిస్తార మమరి
యంధకారప్రవాహ మాయయ్యె నపుడు
నీపకానవభూమికి నెట్టివైచె. ౨౨౫

సోమవారోపవాససంశోషణమున
మేదురం బగుదూరాధ్వఖేదమునను
సంఘము స్వీడినట్టివిచారకలన
నవసెను గృశించె పనవె ధనంజయుండు. ౨౨౬

మెరక లేదు పల్లము లేదు మొకము లేదు
మలలు గోనలుఁ జెట్టుపుట్టలును లేవు
అతనికి సమస్త మొక్కఁడే యయ్యె నపుడు
భవునిసన్నిధానప్రభావమున నేమొ ? ౨౨౭

అతఁ డటఁ దదంతికమున నశ్రుతచరమ్ము
నద్భుతసుధాప్రవాహ మత్యంతసుఖద
మగుచు నాతోద్యసంభిన్న మైనయట్టి
నవ్యమధురగంధర్వగానమ్ము వినెను. ౨౨౮

గానశబ్దానుసారంబు గాఁగ వైశ్యుఁ
డల్లనల్లన నచ్చోటి కరుగుచుండ
సామములు పాడి ధ్యానించి జలక మార్చి
ఖండపరశు నర్చలఁ దీర్పఁ గాంచె నతఁడు. ౨౨౯

సామగులు సామగానముల్ సలుపుచుండ
దేవవేశ్యలు నాట్యముల్ దీర్చుచుండ
ప్రమథు లాడఁగఁ గిన్నరప్రభులు పాడ
నామహాదేవలింగము నరసె నతఁడు. ౨౩౦

అంతట ధనంజయుండు పూర్ణానురక్తి
విమలకనకాబ్జినీకమలములతోడ
అంబికాచంద్రచూళుల నమితభక్తి
మునిసురసమన్వితుం డయి పూజ సలిపె. ౨౩౧

సుప్రభాతంబుతోడనే చూడవచ్చు
జనుల; రాకపోకలు చక్కఁ సాగుచుండె
రేయి దేవర్షిగణము వర్తిల్లుచోట
నాతఁ డప్పుడు గాంచె మృగాగవితతి. ౨౩౨

ఆ మహాద్భుతదృశ్యము నరసినంత
అమృతపారణ చేసిన ట్లగుడు నతఁడు
రక్తితోడ వ్రతాంగపారణ మొనర్ప
నా[illegible]ాపపురంబున కరిగె నంత. ౨౩౨

కులశేఖరునిచే రాజధానీనిర్మాణము

అపర దేవేంద్రుఁడుర్వి ద్రమిడాన్వయుండు
నైన కులశేఖరుం డేలు నప్పురమున
చుట్టములయింట నాఁగి వైశ్యుండు దేటి
వినిచె ఱేనికి నీపకాననచరిత్ర. ౨౩౩

అంత నొకనాఁడు దయతోడ నామహీశు
నకును జంద్రశేఖరుఁడు స్వప్నమున వచ్చి
నీనగరిదరిఁ జిరముగ నీపవనిని
మృగతతిని గూడి నే వసియించుచుంటి. ౨౩౪

నీదు పే రర్థవంతమై నెగడురీతి
నీవు దానిని రాజధానిగ నొనర్చి
వత్స ! కుల ముద్ధరించుకోవయ్య యనుచుఁ
బలికి దయతో నదృశ్యభావంబు నందె. ౨౩౫

దానిఁ గులశేఖరుం డాప్తతతికిఁ దెలుప
నద్ది శంభుకటాక్ష మం చనిరి వారు
శివునియాదేశ మాఁదలఁ జేర్చి భక్తిఁ
దరలె పురనిర్మితికి సబాంధవుఁడు ధవుఁడు. ౨౩౬

భావిశుభము సిద్ధించుఁ దప్ప దనురీతి
వెడలు నతనికి కుడినుండి యెడమ పెడకుఁ
గడచె నొకఖంజరీట మక్కజముగొలుప
నదియు దేవీకటాక్షమం చాడె ఱేఁడు. ౨౩౭

ఆతఁడు కదంబవన మంది యచటఁ గాంచె
బంగరుహొరంగుసాలముల్ నింగి నంట
దివ్యదేవేంద్రభవన మై తేజరిలెడి
మహితతరము మాహేశ్వరమండపమ్ము. ౨౩౮

ఆతఁ డంబాసమేతుని హరుని కెఱఁగి
నమనపూర్వకముగ గజాననుని గొలిచి
నగరనిర్మితి ససిగ నొనర్పఁ డనుచు
మించుశిల్పులఁ దా నియమించికొనియె. ౨౩౯

స్వస్తికమ్మును సర్వతోభద్రమును సు
మండలము దీర్ఘవృత్తసమంచితమ్ము
గాఁగఁ బురమును నిర్మింపఁగావలె నని
శిల్పు లెల్లరు భిన్నార్థజల్పులైరి. ౨౪౦

అపుడు ఱేనికి స్వప్నమునందుఁ దోఁచి
యున్నసిద్ధుఁడు శిల్పులం దొక్కఁ డగుచు
వచ్చి ప్రభువులు వినుచుండ వారితోడఁ
బలికెఁ గర్తవ్యతను గూర్చి లలితఫణితి. ౨౪౧

స్వప్నదర్శనరూపమున్ సంవదించు
శిల్పిరూపము నా రాజు చింతసేయఁ
దివురుసంతలో నాతఁ డదృశ్యుఁ డయ్యె
నిదియు భవుననుగ్రహముగా నెంచె ఱేఁడు. ౨౪౨

అది మహాటవి సాంద్ర మైనదియుఁ బవలె
యంధకారబంధుర మట్టి దయ్యె నేఁడు
పాండ్యభూపతిశాసనభాగ్యవశత
క్షణములో మహానగర మై చక్కఁబడియె. ౨౪౩

దైవనియతిచే నా వనోదరమునందు
సూర్యచంద్రులకరములు సోఁకుకతన
అలరథాంగముల్ బ్రహ్మచర్యమును మాని
విడిచెను జకోరికలును దుర్భిక్షభయము. ౨౪౪

అచటఁ దిరిగెడిజంతువు లాదియందు
వనచరము లనునామమున్ బడసెఁ గాని
అవ్వనమె నేఁడు వనచరం బయ్యె నహహ!
*భూతపూర్వచరట్టునద్భుతపు మహిమ. ౨౪౫

అది షడధ్వాంతసుస్థితి నలరుచున్న
శివపదం బని బుధులు వచించుచుండు
రిట్టిసిద్ధాంతమును వినియే యతండు
దీని నధ్వాంత మొనరించె దీక్ష పట్టి. ౨౪౬

---

* భూతపూర్వచరట్ - ఇదివఱలో వనము గాని నేఁడు కాదని భావము.

అంతరతమంబు హరియించు నట్టి విభుని
కెన్న బాహ్యాతమం బన నెంతపాటి ?
కాలకంఠునిదరి నింత కాల మునికి
గలుగుటయె దాని కొకగొప్పగాదె తలంప. ౨౪౭

పులులఁ దెగటార్చి మిగుల నబ్బురముగొలుపు
వానిచర్మముల్ గుట్టలు వైచి వైచి
రాజభటు లట శంకరప్రభుని కైన
వస్త్రదుర్భిక్షమును మాన్చివైచినారు. ౨౪౮

జంతుసంహార మొనరించు సమయమందు
కరులఁ జంపక సంగ్రహించిరి సుభటులు,
సుందరం బగురూపంబుఁ బొందుపడినఁ
గాల మంతయు శుభద మై గడచుఁగాదె. ౨౪౯

సాలములు వేలకొలఁదిగాఁ జక్కనర్చి
సాల మభ్రంకషమ్ముగాఁ జక్కఁబెట్టి
రల్ప మెందఱు గలుగ సాధ్యం బదేమి ?
యిల మహోన్నతుం డొక్కరుఁడేని చాలు. ౨౫౦

అద్భుతముగ వప్రక్రీడ లాడఁ దివురు
సమరకుంజరస్థూలదంతములు నాఁట
సాలశృంగముల విశాలజాలకమ్ము
లేర్పడెఁ దమంతఁ దా మని యెంచఁ దగును. ౨౫౧

పరిఖ నిర్మింపఁ బాతాళభాగమునకుఁ
జొచ్చుకొనిపోవునరుల నచ్చోటులందు
నెవరు మీ, రాసగరపుత్రులే ? యటంచు
నడిగినా రంట పన్నగు లదరిపడుచు. ౧౪౨

భూమినుండి రసాతలంబున కరిగిన
గంగ యీనగరపుపరిఖాముఖమున
యంత్రములఁ జిమ్మినట్లు నిత్యమును వడిని
భూమిమట్టముగాఁ బొంగి పొరలుచుండు. ౧౪౩

భగినినిం దత్పతిని జూడవలయు ననెడి
తలఁపు గలుగ ప్రాకారకైతవముతోడ
నచటిపరిఖాసముద్రమునందునుండి
లేచినటు లుండె మైనాకుఁ డేఁచి పెరిగి. ౧౪౪

రాజసింహాల భటకుంజరములతోడ
మానవవ్యాఘ్రముల నసమాన మగుచుఁ
బుర మది యథాపురం బటు పొలిచె నంత
సాటి యద్దాని కన్య మెచ్చుటను లేదు. ౧౪౫

అచటిగహనమున్ భేదించినపుడు సుభటు
లచ్చటచ్చట విడిచినయట్టివనులె
యిప్పు డుద్యానవనములై యెల్లకడల
మించి ఫలపుష్పతతిఁ బ్రకాశించుచుండె. ౧౪౬

స్వామి కుత్సవంబు లొనర్పఁ జాలునట్టి
వీథు లెయ్యవి తీర్చెనో విశ్వకర్మ
నాల్గువర్ణాలవారి కీనాఁట నవియె
వేఱువేఱుగ నివసింప వీథు లయ్యె. ౨౫౭

క్రమసౌధప్రపూర్ణప్రాకారమందు
శాంభవం బగుధామంబు చక్కనొప్పె;
మహితమౌక్తికతాటంకమధ్యమునను
దాఁపఁబడియున్నజాతిరత్నం బనంగ. ౨౫౮

భూతనాథునిమందిరంబునకు దరిగ
రాజితోత్తరపూర్వాంతరాలదిశను
నిర్మలము రాజభవనము నిలిపినారు
దేవశిల్పులు శుభవాస్తు వావటిల్ల. ౨౫౯

ఆ భవనమందు శ్రేనికై యమరియున్న
యున్నతం బగుప్రాసాద మొప్పుచుండె;
ఆకసము తాఁక నిర్మల మై చెలంగు
త్ర్యంబకుని దైనసుప్రసాదంబు కరణి. ౨౬౦

అభ్రవాహనుఁ డైనయాహరిహయుండు
భవ్యపీయూషమయమేఘపటలిఁ బనిచి
క్రొత్తగా నట నిర్మించికొన్నపురిని
ముద్దినంబులు తడిపె సమ్మోద మెసఁగ. ౨౬౧

అమితమధురోదసంసిక్త మైనకతన
మధుర యనుపేర నిప్పురి మహిత మగుత
ననుచు నశరీరవాణి యయ్యంబరమునఁ
బలికెను తథా స్తటంచు దేవతలు నొడువ. ౨౬౨

ఇమ్మగుపట్టులందు వటు
కేశ్వరదుంఠిగణేశమాతృవ
ర్గమ్మును దుర్గయున్ నిలువఁ
గాశుభలీల శివోత్సవమ్ముఁ దా
నెమ్మి నొనర్చి సొంతముగ
నిశ్చలుఁడై కులశేఖరుండు ని
త్యమ్ము శివార్చనాపరుఁడు
నై మధురాపురిఁ గాఁపురించుచున్. ౨౬౩

ధనముల నర్థికోటిని బ్రశ
స్తంబున శ్రోతుల బంధుకోటి స
మ్మననముల్ మహాత్ముల స
మంచితసేవల భృత్యసంతతిన్
బెనుదయ నాత్మతత్త్వసువి
వేచన నాశితికంఠుఁ దన్పుచున్

వినుతుఁడు పాండ్యుఁ డబ్ధిపరి
వేష్టితధారణి నేలె మే లనన్. ౨౬౮

ఇది:- శ్రీమదాత్రేయసగోత్ర, దువ్వూర్యుపనామకపవిత్ర,
పెదశేషయార్య శేషమాంబా ద్వితీయపుత్త్ర, మహా
గాయత్రీశరణ్య, గురువేంకటరమణకారుణ్య
సూర్యనారాయణశాస్త్రి ప్రణీతం బైన
ఆంధ్ర శివలీలార్ణవ
మహాకావ్యంబున
ప్రథమతరంగము
సమాప్తము.



# శివలీలార్ణవము

## ౨

## ద్వితీయ తరంగము



వ. అంత నా కులశేఖరుండు;

అటులు పరమేశ్వరారాధనాత్తసుప్ర
సాదసంపత్పరీపాకసంభృతుఁ డన
పేర మలయధ్వజుం డనిపించికొనెడి
కులవతంసుని దా నొక్క కొడుకుఁ గనియె. ౧

అతఁడు సైకతక్రీడలయందుఁగూడ
బ్రహ్మపురుల శివాలయప్రతతిఁ గట్టి
భువనమాతామహత్వవిస్ఫూర్తి యెసఁగ
నాట లాడు మహాశయుండై సతమ్ము. ౨

ఆనృపాత్మజుఁ డుపనీతుఁ డగుచుఁ గుంభ
సంభవమునీంద్రుకడ వేదచయము నేర్చి
తండ్రితో సకలాస్త్రవిద్యలు గడించి
దివ్యశివభక్తిమహిమ గుర్తించె నెడఁద. ౩

యువకుఁడై విద్యలను నేర్చియున్నకొమరుఁ
గాంచి కులశేఖరుండు; విక్రమముతోడ
పొంతినట్లు, ధర్మముతోఁ బ్రశస్తలక్ష్మి
నట్లు, లోకకన్యతో వివాహం బొనర్చె. ౪

కన్య కాంచనమాలిక కాంచివిభుని
పుత్త్రి, యున్నతభావ, యొప్పులకుఁ గుప్ప
యెల్లరిక్కల శశికి రోహిణివిధాన
రాణులం దామె ప్రియునివాల్లభ్య మందె. ౫

తాను తొలిజని నొక్క-గంధర్వపతికిఁ
బుత్త్రియై పుట్టి కళిమెప్పులను గాంచి
అంబ ! నీ కేను మాత యానట్టు లిమ్మ
టన్న నీయమ, తత్తథా స్తనియె గౌరి. ౬

మానవతి యగు కాంచనమాల భవ్య
రూపగుణశీలకరుణలు రూఢి కెక్కఁ
దద్గుణంబులు వాసింపఁ దనరె నామె
కురుతరం బగుభక్తి శంకరునియందు. ౭

స్వజనులన్ బుత్త్రికలరీతి ససిగఁ జూచు
నత్తమామల శివులయ ట్లాదరించు
దైవతములకు దైవ మన్ తలఁపుతోడ
రేపుమాపులఁ బతిపూజ లాపె సలుపు. ౮

ధర్మపథమును నడిపించుధన్య సాధ్వి
పతిశరీరార్ధ మని చెప్పఁబడుచు నుండుఁ
గాని, యీసాధ్వి భర్తకుఁ దాని యమ్యో
దృక్శరీరాత్మజీవితహృదయములుగ. ౯

ఎట్టి కార్యాచరణమందు నేని వైమ
నస్య మనుమాట వారి కెన్నఁడును లేదు;
భేద మే దేని పొసఁగ నాప్రియతముల క
నంగమూలక మైయుండ నగు నొకటియె. ౧౦

యుక్త దాంపత్యనిర్వృతి నున్న తేఁడు
వినయయుక్తుఁడు లోకరక్షణసమర్థ
బాహువిక్రముఁడుఁ బితృభక్తుఁ డైన
నందనుని గాంచి యాతఁ డానంద మందె. ౧౧

తనవహించినభూభాగమును ద్రిలోక
ధూర్వహుం డైనకొమరునందునను నిలిపి
తప్పకున్నను ధర్మముఁ దనయునకును
రాజు బోధించె ధర్మమర్మముల మరల. ౧౨

భవజటాజూటవిధుసంభవంబు విశ్రు
తంబు విపులంబు విమలకులంబు మనది,
ఇంద్రియజయంబు లేనట్టిహీనజనుల
భావనలకేని పుడమి దుర్భరము పుత్రి! ౧౩

రాజ్యలక్ష్మి నవోఢయై రంజిలినను
ఆమె ప్రకృతిప్రగల్భ; మౌర్ఖ్యము వహించి
రాజపుత్త్రులు ఘనతరరాగమతులు
మంచిచెడ్డ లెఱుంగరు కొంచెమేని. ౧౪

ఖలులు మెల్లఁగ రాజుపజ్జలకుఁ జేరి
మొదట స్వప్రసంగముల సొంపుగను బలికి
పిదపఁ బ్రభువును గుపథప్రవృత్తుఁ జేసి
యుండెదరు స్వార్థసిద్ధుల ననవరతము. ౧౫

చకితు లట్లుపక్షేపము సలిపి మొదట
నడుమ నెవ్వరో వల దన్నవడువు దోఁపఁ
బొగడుచున్నట్లె మాటలఁ బొంది పొసఁగి
తప్పును దృఢీకరింతు రుత్తములయందు. ౧౬

పతిహితైషులరీతిఁ బండితులకరణి
కడుఁ గృతజ్ఞులువోలె జగత్తటస్థు
లనఁగ మసలి యసాధువు లజ్జ దేని
దీనునిగఁ జేసి స్వార్థసిద్ధిని గడింత్రు. ౧౭

ప్రభునిగూఢాశయము గుర్తుపట్టుకొఱకు
తెగడి సుజనుల రిపులను బొగడుచుంద్రు,
వారిలో వారు కృతకవివాదములను
బెట్టుకొని తమగుట్టును బ్రిదులనీరు. ౧౮

హేయ మియ్యది మన కుపాదేయ మిదియె
యని వివేచన సలిపి నీయాత్మబుద్ధి
వారివాగ్వాగురలఁ జిక్కనీనిపగిది
నటన సేయుచు ఖలుల దండనము సలుపు. ౧౯

తేని వర్జింతు రూపన్నలుండేని జనులు,
శాంతుఁడేని తిరస్కృతి సలుపుచుండ్రు;
కాన శరదృతువందు భాస్కరునికరణి
మెలఁగుచుండుము మనుష్ణశీతలుఁడ వగుచు. ౨౦

ఆత్మవిమల నలోలుపు లైనవారి
వ్యసనరహితుల నుత్తమవంశజుల మ
హాత్తరులను బహుశ్రుతు లైనవారిఁ
దెలిసి మంత్రములందు మంత్రులుగఁ గొనుము. ౨౧

అమిత మైనకోపప్రసాదములఁ జూపు
వేని కీలోకమే తలక్రిందు లగును;
ఎదను సువిచారధారావిశద మొనర్చి
యెల్లజనులం దతంద్రితవృత్తి నడపు. ౨౨

ఇపుడు నీవలెఁ బరుఁ డెంతయేని దీర్ఘ
దర్శియు బహుశ్రుతుండు విత్తముఁడు గాఁడు;
ఐనను, బ్రశాసితుఁడ వౌచు నమరపలయు
మంత్రులే శాసకులు గాఁగ మసలుకొమ్ము. ౨౩

నీ వజాతశత్రుండ వన్నియును దెలియుఁ
బ్రజ్ఞ గలవాఁడవు ప్రజానురంజకుఁడవు
చేసినాఁడవు గురువృద్ధసేవ లెల్ల
నింక నే నుపదేశింప నేమి గలదు? ౨౪

ఏను పెద్దలవలన గ్రహించినదియు
వినినది సుసూక్ష్మముగ నీకు వినిచినాఁడఁ
గాని యొకయూహ మనసునఁ గలదు నాకు
మఱవ కద్దాని నొనరింపుమా కుమార ! ౧౫

తనకు నవతంస మైనచంద్రునికతాన
నిందిరామందిర మొనర్చె నిందుమౌళి
మనకులమ్ము; నీమాటను మఱవఁబోక
మహితరాజ్యసంపదల మమత్వ ముడుఁగు. ౧౬

ఇది శివస్వము గావున నెఱిఁగి దేవ
యజనముల కగ్నితృప్తికి యాజకులకు
వెచ్చపెట్టుచు శివుని భావించికొనుచు
సకలకృత్యములన్ శివార్చనమె సలుపు. ౧౭

శివుని బూజింపు మగ్నిలో శివు యజింపు
శివుని గీర్తించు సూర్యులో శివుని దలఁపు
విప్రులందు శివాత్మ భావించుచుండు
పుత్త్రిక! శివైకనిష్ఠను బొదలుమయ్య. ౧౮

భవునికన్నను బరమదైవతము లేఁడు,
అతఁడు మధురేశ్వరునికన్న ననితరుండు;
పరమభక్తిని సుందరేశ్వరునె నమ్మి
యెల్లకాలము నీరాజ్య మేలుకొనుము. ౧౯

అనుచుఁ గులశేఖరుండు పుత్త్రునికి సర్వ
మొలుకపలికి జయాశిష మిచ్చి తాను
నాలువేలేండ్లు మోసినయట్టిభూమి
భరము విడిచి మహానందభరితుఁ డయ్యె. ౩౦

పిదప యోగము పూని యాపృథివిపతియు
మూర్ధలగ్నముగా నాడి మొనయఁ బట్టి
తనువు చాలించి మాయభూతలము వీడి
పొందె శాశ్వతలోక మానందమయము. ౩౧

జగము చేమామురీతి నశ్వర మటంచు
జనకుఁ డందినసుగతి ప్రశస్త మనుచుఁ
దా నెఱింగియు స్వాంత ముత్తలము గొనఁగ
మొనసి యావళి వివశుఁ డయ్యెను గరంబు. ౩౨

ఎట్టెటో ధీరభావము నిరవుకొలిపి
జనకుపరలోకవిధులను జక్కఁ జలిపె;
తాదృశులకుఁ గర్మ మొనర్పఁ దప్పకుంట
ఆత్మభూతికె కేవల మాను గాదె? ౩౩

కులగురుండు మాని కుంభసంభవుతోడ
సచివబంధుమిత్రసహితుఁ డగుచు
సుందరేశు నెదుట శుభముహూర్తంబున
భస్మ దాల్చె విభుఁడు ఫాలమందు. ౩౪

అథవునిశిరస్సునుండి తనంత జాఱు
సుమము, దీపస్ఫులింగముల్ చూచి యెదుట
మునులు శుభనిమిత్తము లని మురిసి పలుక
నతశిరస్కుఁడై యాజనపతి గ్రహించె. ౩౫

పురమును బ్రదక్షిణించి పూఁబోఁడులెల్ల
రారతు లొసంగఁ గైకొని యాజనపతి
చిరపరిష్కృతరాజమందిరము మెట్టి
విత్తముల బాపల యజించె విత్తములను. ౩౬

భద్రపీఠస్థుఁ జేయ నాపతిని మంత్రు
లెంచి యనుజీవులను గౌరవించె తేఁడు;
పావనకటాక్షసుస్మితభాషితముల
భవ్యవాహనభూషణాంబరవితతుల. ౩౭

భూమిని భుజంబునకుఁ, బుణ్యభూతదయను
హృదయమునకుఁ, బురారిసత్కథలు శ్రుతుల
కెలమి ననపాయభూషణంబులుగఁ దాల్చె
నాదిరాజయశోబింబుఁ డావిభుండు. ౩౮

అతనికీర్తిప్రతాపభూషితలు దిశలు
అతనిచే విధుకులము భూషితము నయ్యె
ధృతిని దయను నాతేఁడు భూషితుఁడు నయ్యె
సకలము విభూషితం బయ్యె శంభుభక్తి. ౩౯

అలమిఁ గొనిన యాతనియశస్సులకతాన
భ్రమరగజకాకకోకిలప్రతతియెల్ల
తెల్లవడి పూర్వనృపతుల దీప్తకీర్తు
లకుఁ దగులొ్కనె వానినైల్యము కడంగి. ౪౦

అతనిసద్దానముల నందినట్టిద్విజుల
యజ్ఞభాగముల్ తిను దేవతాళివలన
నెలమిఁ బోషింపఁబడు కల్పవృక్షవితతి
యతనిఁ బోలుదు నన దానియబ్బురమ ? ౪౧

అతనిదానోదకముచేత నబ్ధి నిండెఁ
దజ్జలం బాని మొగి లంబుదంబు నయ్యె
విధుఁడుఁ దద్వర్షపోషితౌషధులకె పతి;
యిందఱకుఁ గూర్చె దాతృత యితనియీవి. ౪౨

భూసమృద్ధు లుండియును దత్పురమునందు
వాస మొనరించు బ్రాహ్మణవర్గమెల్ల
భూపతిఁ దరింపఁజేయుసద్బుద్ధితోన
*అతనిదానాల సంప్రదానత వహించు. ౪౩

ధర్మదూరుఁడె లేనితత్పత్తనమున
ఆతఁ డెవనిని దండించు ? నతనియింద్రి
యములును నివృత్తిశీలము లగుటకతన
దండనావసరమ్మె యెత్తటిని లేదు. ౪౪

*చతుర్థీసంప్రదానే-అని పాణిని. బ్రాహ్మణాయ ప్రతిగ్రహీత్రే- అని సంకల్పము.

అవనిపతి వీతకల్మషుఁ డగుడు నేల
నందఱు వినీతు లైరి తమంతఁ దామె
ఆత్మశక్తి ద్వంద్వాతీతుఁ డైనమౌని
యాశ్రమంబునఁ గ్రూరమృగాళియటులు. ౪౫

విమలమతియై ప్రజావ్యసనములపట్ల
తద్ధితం బెంచియే తటస్థత వహింప
జనులునుం దమకలహములను స్వగృహము
లందె గుప్త మొనర్తురు న్యాయమటులు. ౪౬

అవనియు నకృష్టపచ్య సస్యాభివృద్ధి
వృష్టినేని యపేక్షించి యెఱుఁగ దెపుడు;
అధ్వరహవిస్సు లందుటన్ హరిహయుండుఁ
గురియు వృష్టిని కాలానుగుణముగానె. ౪౭

అతనియంతరంగమ్ము శివైకతాన
మగుచు బాహిరవిషయము లంటకునికి
రాజ్యతంత్రము సకల మారాజసుతుఁడు
బాహ్యకరణమ్ములనె యొనర్పఁగను దివురు. ౪౮

అవని ద్విజదేవసాత్కృత మయ్యె, దివము
కానుకలు వెట్టె శత్రువర్గమున కెలమిఁ
దన్ను శివున కిచ్చుకొని తా ధన్యుఁ డయ్యె
నీయఁగారాని దాతేని కేది కలదు? ౪౯

## ద్వితీయ తరంగము

జనకుచరమోపదేశమున్ సారెసారె
కాతఁ డక్షరాక్షరము నిత్యముఁ దలంచు,
సకలదివ్యసంపదల కాస్పదము శివుని
పదమునే నెఱనమ్మె నప్పార్థివుండు. ౫౦

చిరతపస్సులు చేసె నిర్జించె మనసు
నిచ్చె నధ్యయనించె వహ్నికిని వేల్చె
నిశ్వసించినఁ గనుఱెప్ప నేని వేయ
భవునిఁ బూజించుబుద్ధినే పఱపు నతఁడు. ౫౧

హరిహరహిరణ్యగర్భుల కంబ యగుచు
సర్గస్థితివిలయనిసర్గహేతు
తాపరంపరావిశ్రమస్థాన మైన
యాదిశక్తి భవానినే యతఁడు నమ్మె. ౫౨

శశిశిరోమణి మీనలోచనము తతద
యామయము సుందరస్మితాత్యంతమధుర,
మయుతభూషోజ్జ్వల మ్ముత్పలాంకితమ్ము
నైనతద్రూపమే హృదయమున నిలుపు. ౫౩

కన్ను తెఱచిన మూసినఁ గాని, యెడఁదఁ
దలఁచు నతఁడు జడాజడాత్మకజగం, బు
పాత్తనీలోత్పలంబు సంపన్నకుచము
పుణ్యవదనహారకిరీటభూషితముగ. ౫౪

భూపుఁడు నిమేషనిశ్వాసములవిధాన
నప్రయత్నత నడపి రాజ్యాంగమెల్లఁ
ద్రికరణవిశుద్ధి చెదరనీయక శివైక
నిష్ఠ పచరించుఁ దాను నిర్నిద్రవృత్తి. ౫౫

కాన నశక్యు, వీనుల క
గమ్యు, ననూహ్యు, నిరంజనున్ మహా
స్థాణుని నిత్యు నద్భుత క
థాకలితున్ త్రిజగన్మహోజ్జ్వలున్
మానితవేదశీర్షమణి
మండను ద్వైతవిభంజనున్ హృదా
స్థానముతో లగించును వి
శాంపతి సోఽహ మటన్న భావనన్. ౫౬

బాధ్యబాధకభావంబు పడయకుండ
కాలమును బంచికొని త్రివర్గము భజించు
తఱిని మలయధ్వజుం డంతిపురము చేరి
పత్ని కాంచనమాలతోఁ బలికె నిటులు. ౫౭

చంద్రవంశము మనది, విశాల మిదియు
ఆఁగునో యేమొ నాతోనె యంతరించి
యవని శివదాససంతతి యడ్డు లేక
సాగు టెట్లనుచింత నిచ్చలు కలంచు. ౫౮

పాశుపతదీక్షచే మోక్షపథము గొన్న
పితరులు నివాపములకు నపేక్ష గొనరు;
కాని, తాదృశోజ్వలవ్రతఘాత కిప్పు
డగుదునో మూల మే నంచు నడలువాఁడ. ౫౯

*ప్రజ ననుసరించి మనుజుఁడు ప్రభవ మందు
టదియె "మర్త్యామృతం" బని యాడఁబడును
మించి "యపరామృతము"ను సాధించి జనుఁడు
చొఱవలె "పరామృతం" బని శ్రుతి వచించు. ౬౦

శివునిపై భార మిడియు నిస్పృహుల మగుచు
నర్చలనుమాత్రమే చేయునట్టిమనము
చేరి యాలోకమాతను గోరు టెటులు ?
కులము కూలుచోఁ గోరక నిలుచు టెటులు ? ౬౧

అని యనిశ్చయముద్రితుఁడై విచార
పడెడిపతిఁ గాంచి యాపతివ్రత, ప్రపంచ
సత్తపస్యాపరీపాకజన్మము లగు
పలుకులు మనోనురంజకములుగ నొడివె. ౬౨

---

ప్రజా=సంతతి,
"అపరామృతం పరామృతా యోపనమేత్॥ అని శ్రుతి.
అపరామృతం=అమృతత్వద్యోతకపుత్త్రాది.
పరామృతం=వయోగతః ప్రీతి,
సత్కర్మాచరణాయ సంతతి మిహ నియుజ్య, భూలోకే పుత్త్రాదిరూపేణ
జీవన్, పుణ్యోపభోగాయ స్వర్గం ప్రాప్నోతి॥ అని విద్యారణ్యులు.

పండితుల కగుశంకలఁ బాపుతమకు
నితఁడు దనుశాసకుండుగ నెవ్వఁ డగును?
మీనలోచనయేని, యీమెను భజించు
తాదృశుండేని శాసింపఁ దగును గాక. ౬౩

జ్ఞానమయుఁడు తేజోరాశి సత్యవాది
కలితకాలత్రయజ్ఞాత కులగురుండు
నగునగస్త్యునియాదేశ మందవలయు
నాతఁడే శాస్త మన కిందు నందుఁ గూడ. ౬౪

అనుచు హృదయంగమమ్ముగ ననెడిధర్మ
పత్నిపలుకుల నాలించి ప్రభువరుండు
కుంభసంభవు శరణముఁ గోరి మదిని
దలఁచుకొనినంత నతఁడు ప్రత్యక్ష మయ్యె. ౬౫

అర్ఘ్యపాద్యమ్ము లొసఁగి పాదానతు లయి
నెమ్మి నవరత్నఖచితపీఠమ్ము వెట్టి
తదనుమతి నంది యప్పు డాదంపతులును
అతనిసన్నిధిఁ గూర్చుండి రతులభక్తి. ౬౬

ధర్మపత్నీసమేతుఁడై తనకు నెదుట
భక్తిబద్ధాంజలుం డయి పరగుతేనిఁ
గాంచి కరుణార్ద్రదృష్టి నాథుఁడు మౌని
స్వప్రభావానుగుణవాక్యసరణి నెఱపె. ౬౭

ప్రాకృతుల కందికొన దుర్లభంబు సత్త
మోత్తమం బిది మీశివయోగికులము
త్యాత్తులు శ్రుతశీలసంపదల కనుగు
ణమ్మె కద యీవితర్కపథమ్మ్ము నీకు. ౬౮

తత్ప్రవృత్తిధర్మమును గొందఱ గ్రహింత్రు
కొనఁగొన నివృత్తిధర్మ మగోచరమ్మ్ము,
ఈ వితర్క మొనర్చుచు నెల్లవేళ
నలువసభలో మహర్షులే నలఁగుచుంద్రు. ౬౯

నిత్యనైమిత్తికక్రియానిరతి యెపుడు
రూఢి నైష్కర్మ్యమునకు విరోధి కాదు;
విడువ నద్దానిఁ బతితులై చెడుదు రనుచు
శిష్టజను లెంచి దాని వర్జింప రెపుడు. ౭౦

అమలతపోధనుల్ మునికు
లాగ్ర్యులు గేస్తులు గౌతమాదులున్
విమలనివృత్తిమార్గపరి
నిష్ఠితు లయ్యు ఋణార్థవాదస
*త్క్రమమునఁ; నిత్యతం గనియె
కాదె యపత్యముఁ గాంచి వేదపా
ఠములు పఠించి యగ్నులఁ గ
డంగి భజించిరి బ్రహ్మభావనన్. ౭౧

*జాయమానో వై బ్రాహ్మణః త్రిభిర్ఋణవా జాయతే, బ్రహ్మచర్యేణ, ఋషిభ్యః, యజ్ఞేన దేవేభ్యః, ప్రజయా పితృభ్యః— అని శ్రుతి.

నాయనా! యీరహస్యము నామెడందఁ
జిరము నీకయి దాఁచి యుంచితిఁ గదోయి,
యిపుడు వచ్చెను శుభకాల మీవు పుణ్య
పూర్ణచిత్తముతో గ్రహింపుము కుమార! ౭౨

మున్ను నీధర్మపత్ని సంపూర్ణభక్తి
నర్చనలు సల్పి మీనాక్షి కబ్బురముగ
ఆ జగజ్జననికిఁ దల్లి యగునటులుగ
నన్యదుర్లభవరముఁ దా నందుకొనియె. ౭౩

ఇలను దనయవతరము నూహించుచున్న
శాంకరియె యీమెపతిగ నిన్ జలిపెఁ జుమ్మ;
భువిఁ బరాత్పర మైనవస్తు వది యెట్టు
లవతరిలునో యటన్నదే యబ్బురమ్ము. ౭౪

అవనిఁ గర్మరహోమాగ్ను లాశ్రయించి
సఫల మొనరించు వివిధవాంఛల నెవర్తు;
ఆమె యిప్పుడు వైతానకాగ్నినుండి
యుదయ మందెడు నని తోఁచుచున్నదయ్య! ౭౫

కుంభసంభవుఁ డిట్లు వాకొనుచు నుండఁ
దోడనే బిట్టు దేవదుందుభులు మ్రోఁగె
రాజునకు దేవికి శివంకరముగ నపుడు
దక్షిణేతరాక్షులను స్పందమ్ము తోఁచె. ౭౬

ధర్మపత్నీసమేతుం డై ధరణిపతి, ప్ర
దక్షిణించి యావింధ్యాద్రిదమను నెఱంగె;
పిదప నానందబాష్పగద్గదిక గదురం
బులకితశరీరుం డై భక్తిం బలికె నిటులు. ౭౭

ఆచిదానందమయి జగదంబ యేడ?
కష్టజనులము మే మేడం గలశజన్మ!
త్వత్పదరజఃప్రమార్జనప్రభవ మగు, న
హీనసంపత్పరీపాక మిట్టి దగునె? ౭౮

ఆర్య! నీ కింకరుండ నీయనుంగుబిడ్డ,
మాని! నీయనుయాయులం దే నొకండ
ఈ వనుగ్రహించినరీతినే చరింతు
నింతపాటిదె గద నా యభీప్సితంబు. ౭౯

ఇట్టులు శతాశ్వమేధావభృథసమాప్ల
తాంగుండు ప్రపన్నుం డగుత్రేని నాదరించి
భావికర్మాధికారిత్వపదవి నంద
ముని ముదలవెట్టె హయమేధమును బొనర్ప. ౮౦

ప్రభువు నీరీతిం గుంభసంభవుండు దేర్చి
తనతపోవనభూమికిం దరలె, నంతం
బతియుం దా నశ్వమేధసంభారభరణ
సంభ్రమముం డయ్యె శివునిపూజలను విడండు. ౮౧

## పాండ్యకులమునఁ దటాతకాజననము.

భటులు రాజాజ్ఞఁ దగినయశ్వమును వెదుక
దేశములు నగరములెల్లఁ దిరిగి తిరిగి
సోమపార్శ్వజాతమును దత్సోమయాగ
యోగ్యమగు సైంధవముఁ దెచ్చి యుంచి రపుడు. ౮౨

పూతతపనీయపంకజనీతటాన
శాల నిర్మించినారు యజ్ఞము నొనర్ప
మునుల కుటజమ్ములును రాజముఖ్యులకయి
మేలుసౌధము లచట నిర్మించినారు. ౮౩

అతిథులను గౌరవింప సమస్తవస్తు
సంపదలు తెచ్చిపెట్టి, రశ్వమును వచ్చె
ఛాత్రులం గూడి చులుకితసాగరుం డ
గస్త్యుఁ డేతెంచె బ్రహ్మర్షిగణముతోడ. ౮౪

ధర్మపత్నీసమేతుఁడై ధరణిపతియు
శివుని మీనాక్షి నెలమి నర్చించి మొదట
మునులనెల వంది గురుపాదములకు మ్రొక్కి
సవనకృత్య మారంభించె శాస్త్రవిధిని. ౮౫

*జనత స్వప్రతాపవినమ్రతను గనినను
మొనసి సాంగ్రహణేష్టిఁ జేకొనుచు మరల
అశ్వమును వీడి తత్పదమందు వేల్చి
నియతుఁడై యగ్న్యగార మానృపతి చేరె ౮౬

*సాంగ్రహణ్యేష్ట్యా యజతే, ఇమాం జనతాగం సంగృహ్ణానీతి- అని శ్రుతి.

*అనువుగఁ జరించుయాగాశ్వమును జతుశ్శ
తాధికబలంబు వెన్నంటి యరయుచుండ
రాజులెల్ల నిరోధింప రారు గాని
పూనికమై ననురోధింపఁ బూనినారు. ౮౭

సత్ప్రతాపగుప్తమును యశఃప్రకాశి
తాధ్వమును నై చరించునాహయముఁ గాంచి
తద్ధవిగ్రహణరసార్ద్రితాలుమూలు
లై విబుధు లాఁగి రాయజ్ఞ మగువఱకును. ౮౮

*వసుధలో నాఁటిజనులెల్ల వాజిమేధ
కాండ మెఱిఁగినవారె తత్కారణమున
దీక్షితనృపాలువిత్త మర్థించి తినక
స్వస్వజీవిక వాజిరక్షకులు చనిరి. ౮౯

పౌషపూర్ణిమనాఁటి కశ్వము మఱలఁగ
క్షణము దాని నశ్వత్థవృక్షమునఁ గట్టి
పూని వారు హేమంతావసానమునకు
నగరముం జేర్చి రెట్టివిఘ్నములు లేక. ౯౦

---

*యాగాశ్వమును "చతుశ్శతారక్షంతి" యజ్ఞస్యాఘాతాయ॥
*నదీక్షిత స్యాన్నమశ్నీయాత్, హుతాయాం వపాయాం
దీక్షిత స్యాన్నమశ్నీయాత్ - అని శ్రుతి.

ఆసముద్రక్షితీశులు సఖులకళల
నారితేరినలోకులుఁ జేరి రటకు
వేల్పులును వత్తు రటకు హావిస్సు లంద
ననెడిరహితో వసంతుఁడు నటకుఁ జేరె. ౯౧

శిశిరమున మామిడిచివుళ్ళు చిక్కకునికి
పరమనిర్విణ్ణవృత్తితోఁ దిరుగునట్టి
కోకిలమ్మలు వనులందుఁ గూయఁదొడఁగెఁ
బంచమశ్రుతి దివి నూడిపడినయట్లు. ౯౨

వాడుతరువులు తలిరుల వాసి గాంచె
మలయగిరినుండి పిల్లగాలులును దరలె
విషమశరుబాహుకాండాన వీరలక్ష్మి
స్వాయముగా విశ్రమింప వాంఛలను జలిపె. ౯౩

యువతులకు లోఁగి యువకులు నుండవలె న
టంచు శాసింప మషిచే లిఖించి లిపులు;
తిరుగుచున్నతచ్ఛాసనాక్షరములటులు
ఝుంకరించుచు నళులు నిచ్చలుఁ జరించు. ౯౪

మదనునిపురోహితు లగుతుమ్మెదలు రొదలఁ
బూల నభిమంత్రణ మొనర్పఁబోలు నిజము;
కానినాఁ డున్నచో టవి కదలకుండ
శరము లెటు లక్ష్యభేదనచణము లగును? ౯౫

నిరతము పఠించు చానంగనిగమములను
తరులవీథుల భిక్షులై తిరుగుచుండి
పవలు నిద్రింపకయె ద్విరేఫములగములు
గురుని ఛాత్రులట్లు వసంతుఁ గొలుచు నెలమి. ౯౬

మలయపవనుఁ డధ్వర్యువు మలయునళియు
సామగుఁడు హోత యన్యపుష్టమ్ము బ్రహ్మ
మాధవుఁడుఁ గాఁగ నవ్వనమధ్యమందు
యువకు లానంగయజ్ఞము నొనరుతు రట. ౯౭

జగతి మోహాంధ మగుతఱి శంకమాలి
బుధులు కొంద ఱగ్ని యజింపఁ బూనుకతన
దశదిశల భృంగదంభాన దర్పకునికి
నపయశమ్ము ముమ్మరముగ నలమికొనియె. ౯౮

అవిరలముగ నామూలముఁ జివురుఁ దొడుగు
మావిఁ గనియును గోయిలల్ మదిని గుందె,
కిసలయమ్ముల నన్నింటి మెసవలేక
నిలువ నొకశాఖయేని గన్నులను బడక. ౯౯

భృంగములవేడ ? కోయిల లేడ ? మంద
మారుతానంగవిధులును మధువు నెవరొ ?
విరహిజనపాపమున దుర్విభేద మైన
మైత్ర్య మీసంఘమున కిప్పు డమరెఁ గాక ! ౧౦౦

ఆమ్రచంపకవిచకిలాద్యఖిలతరులుఁ
జల్లనివసంతుదయ నిలువెల్లఁ బూచి
తత్సమృద్ధి యుమ్మెత్తకును దనుకు టరసి
గాఢలజ్జను నతశిరస్కత వహించు. ౧౦౧

పుష్పగుచ్ఛపరిష్కృతంబు లగులతలు
మధుమదాతితుందిలము లౌ మధుపములును
నొకరినొక్కరు గుర్తించియుండు టరయ
నది వసంతకటాక్షసంపదలబలమె. ౧౦౨

అతనుఁడు హిమావృతావని నాక్రమించి
మంచుపైరైన విన నేవగించుచుండఁ
జట్టన హతావశిష్టతుషారములకు
నభయము లభించెఁ జంద్రశీతాద్రులందు. ౧౦౩

తనువిభేదము లేనిద్వంద్వములు మొదలు
భృంగకీటసరీసృపోద్భిజము లెల్ల
దర్పకునిశాసనంబును దప్పి మనుటఁ
గనము విన మీవసంతర్తువునను బళిర ! ౧౦౪

మదను ప్రభుత యటుండనీ, మందమారు
తమ్ము వీతెంచెనేని యుత్తలము గొనుచు
నెన్ని శుకపికశారికాభృంగవితతు
లటు లిటులు ముందువెన్కల నలమి యెగురు ? ౧౦౫

కాంతకనులలో శీధురాగమ్ముఁ గమల
వనులఁ గేసరమ్ములు నుపవనులఁ జివురు
రూఢిఁ బ్రకటింపఁ దనవిశ్వరూపగరిమ
యించువిల్తుప్రతాపమే మించి వెలుఁగు. ౧౦౬

విధుపికాళులబాఱిఁ దప్పించి కాఁచి
చిమ్మచీకటిన్ భయదనిశీథమందు
దర్పకుం డొంటిగ నధిజ్యధన్వుఁ డగుచుఁ
గేళిఁ దార్చు నిత్వరుల సంకేతములకు. ౧౦౭

నఖముఖక్షతిఁ గౌఁగిలింతలను దశన
ముఖసుఖక్షతి శీత్కారగములను బడసి
తమకు హేమంతమం దయత్నముగ లభ్య
ము లగువానినే ప్రేమికుల్ దలఁచుకొంద్రు. ౧౦౮

ధాత్రిని విధాత మదనుదుర్దాంతుఁ గాంచి
యువిద యనువర్మము ఘటించె యువకతతికి,
అది కలుగ పుష్పమాత్రమే మదనుశరము
లది త్యజింప వజ్రమ్ములే యగుచు నుండు. ౧౦౯

త్ర్యంబకతపోవిలోపకోపంబుకతన
తెగినమిత్రు ననన్యజుం దెలిసి మధుఁడు
మునుల శివపూజలకు సుమంబులను గూర్చి
సేవలను దీర్పఁ దరులఁ బుష్పింపఁ జేసె. ౧౧౦

అధిపుయాగాశ్వ మపుడు శీతాద్రివఱకు
వెడలి మఱలినవార్త యేర్పడ గ్రహించి
యేము; సప్తాశ్వునశ్వము లేఁచి పఱచి
యుత్తరాశకు నుత్సాహవృత్తిఁ జేరె. ౧౧౧

జరుగ నొకయేఁడు నియమాతిభరముకలన;
వాజితోన వసంతుఁడున్ వచ్చె నటకు
మునియనుజ్ఞను దత్క్రతువున శివార్చ
నల నొనర్పఁగ భూజాని తలఁచె నంత. ౧౧౨

కుంభజన్ముఁ డధ్వర్యుఁడై కుదురుకొనియె
హోతగా నాశ్వలాయనుఁ డుండె నందు;
అవల జైమిని యుద్గాత యయ్యె, సర్వ
విదుఁ డగువసిష్ఠముని బ్రహ్మపదము నందె. ౧౧౩

*వెన్నతోఁ జేసె నీమహావిభునియంత
రంగ మం చెఱిఁగినతొల్లియాప్తులెల్ల
అధిపునవనీతచర్చిత మైనసకల
తనువు నవనీతమయముగఁ దలఁచి రపుడు. ౧౧౪

బాల్యముననుండి ఱేఁడు స్వభావసిద్ధ
ముగను దా ముక్తహస్తుఁడై పొదలుచుండ
*ముష్టిని బిగించి నేఁ డవిముక్తహస్తుఁ
డగుచు దీక్షల నిముసమే నలరు టెటులు ? ౧౧౫

*యోదీక్షతోంతరేవ నవనీతం, తస్మాన్నవనీతే నాభ్యంక్తే- అని శ్రుతి.
*"ముష్టీకరోతి వాచంచ యచ్ఛతి యజ్ఞస్యధృత్యై"- అని శ్రుతి.

యజ్ఞ మగువఱ కధ్వర్యుఁ డగునగస్త్య
మానియే ప్రభుత్వమును దా నూని యుంటఁ
జర్మతృణముష్టివిష్టరాషాఢములకుఁ
గఱవు లేదయ్యె బ్రాహ్మణగణమునకును. ౧౧౬

నివ్వరులఁ జల్లి దర్భల నిరతి నోమి
బిల్వఖదిరపలాశముల్ పెనుచుఁ దనుచు
వల్కలంబులఁ దొం డంచు వడి నగస్త్య
శిష్యులు భటాళి కానగాఁ జెప్పుచుండ్రు. ౧౧౭

*ఇచ్చట నిషిద్ధ మంచు ఱేఁ డీఁడు గాని
యతనిజన్నమునందు బ్రాహ్మణులు పొంది
కుడిచి కట్టిన దింతని నుడువఁ దరమె ?
తచ్ఛతాంశమే నీలేరు దాత లోరులు. ౧౧౮

యజ్ఞమం దిందు వివిధపదార్థములను
నమితముగఁ దినుబాపల నరసి సురలు
తమకుఁ గ్రతుభాగములనుమాత్రమె యొసంగి
విధియె కికురించె నని గొణంగుదురు సతము. ౧౧౯

రాజు నెదుటఁ గ్రియాంతరాలమ్ములందు
న్యాయవేదవేదాంగపదార్థయోగ
శాస్త్రసంపన్ను లగుఋషిసత్తము లట
మించి బహువివాదములఁ దర్కించుకొనిరి. ౧౨౦

---

* చంద్రమసీత్యేతైర్యథాలింగం ప్రతిగృహ్ణాతి. అనుశ్రుతిచే దీక్షితుఁడు ప్రజలనుండి గ్రహింపవలెను.

### తార్కికులపై నాక్షేపము

పరమసుఖదుఃఖహానిరూపంబె మోక్ష
మైనచో నాత్మపత్ని నహల్య శిలగ
గౌతమమహర్షి శపియింపఁ గారణం బ
దేల యని మాను లొకకొంద ఱెంతు రతని. ౧౨౧

తా. "ఆత్యంతిక దుఃఖధ్వంసోహి మోక్షః" దుఃఖములు లేకుండుటే మోక్ష మైనచో అహల్యను గౌతముఁడు ఱారూపుగ నేల శపించెను ? అది శాప మెట్లగును ?

### సమాధానము

పూని దుఃఖవిధ్వంసమే మోక్ష మనిన
మాకుఁ దప్పు లెన్నుదురె ? మీమాట యేమి ?
యెన్న నజ్ఞానవిక్షతియే గదయ్య,
అట్టిచో ఱాతికిని మోక్ష మమరకున్నె ? ౧౨౨

తా. దుఃఖధ్వంసమే మోక్ష మన్నమామీఁద మీ రెట్లు దోషము నుద్ఘాటింతురు ? "జ్ఞానాదేవతు కైవల్యం" అనుటచే అజ్ఞానక్షతియే మోక్ష మన్నమీరు రాతికిఁగూడ మోక్ష మొప్పినటులే కదా ! మ మ్మాక్షేపింతు రేల ? అని తార్కికు లనిరి.

### వేదాంతులపై నాక్షేపము

జగము కల్పితమేని యజ్ఞానకలన
నజ్ఞులం దగ్రసరుఁడె యయ్యభవుఁ డగును;
వాద్దు లే దింక మీమతవాఖ్యమున కిం ద
టంచు వ్యాసుని నొకకొంద ఱపహసింత్రు. ౧౨౩

## ద్వితీయ తరంగము

తా. ఈ జగత్తు అజ్ఞానమువలననే కల్పితమైనచో పశుపతి యగునీశ్వరుఁడే యజ్ఞాని కాఁగలఁడు. పరమేశ్వరునే యజ్ఞునిగఁ జేసిననీమాఘ్యమున కపు డంతు లేదు. అని వ్యాసు నాక్షేపించిరి.

సమాధానము

ఋషి సర్వజ్ఞుఁ డజ్ఞానరూపమైన
ప్రకృతిచే విశ్వసృష్టి కల్పన మొనర్ప,
నీదునజ్ఞతకు నయుక్తవాదమునకు
నంతు లే దని వ్యాసశిష్యాళి పలికె. ౧౨౪

తా. అజ్ఞానమును బ్రకృతిగఁ జేసికొని సర్వజ్ఞుఁడై నయీశుఁడు ఈజగత్తును సృష్టించుచుండఁగా నీశ్వరునియందు నీవు మోఁపినయజ్ఞానము నీనిరంకుశాజ్ఞానమును సూచించుచున్నది.

వైయాకరణులపై నాక్షేపము

పదములందు జాతియె సాధుభావ మంద
వేదలోకములందు ద్వైవిధ్య మెటులొ ?
భవనమున గోవు వని గర్దభంబు నగునె ?
యని పదజ్ఞుల నొకకొంద అపహసింత్రు. ౧౨౫

తా. పదములకు జాతియందు శక్తియా, వ్యక్తియందు శక్తియా ? అనుపక్షద్వయమందు జాతిశక్తివాదమునే మీ రంగీకరించితిరి. కాని లోకమందును శ్రుతియందును జాతివ్యక్తులరెంటియందును శక్తి కన్పట్టుచున్నది. లోకమందు—

"గా మానయ" అన్నచోట వ్యక్తినిమాత్రము బోధించును.
"యతిః పూజ్యః" అన్నచోట జాతిని దెలుపును.

వేదమందు - "గా మాలభేత" అన్నచోట వ్యక్తిని "బ్రాహ్మణో న హంతవ్యః" అన్నచోట జాతిని బోధించుచుండును. పద మొకచో వ్యక్తిని వేఱొకచో జాతిని జెప్పుట న్యాయమా? ఇంటియందున్నపుడు గోవును, అదే అడవి కేఁగినపుడు గర్దభమును అగుట సంభవమా?

సమాధానము

వేదముల లోకముల శబ్దవితతి భిన్న
మది యెఱుంగనివారికయి విదితముగను
బలికితిమి మేము దూర మాపథము తమకుఁ
గాన మౌనము మీ రింకఁ బూను టొప్పు. ౧౨౬

తా. లోకవేదములందు భిన్నభిన్నార్థములలో భిన్నభిన్నశబ్దము లుండఁగా సందర్భానుసారముగ జాతివ్యక్తులందు శక్తివాదములను మే మంగీకరించితిమి. తమ కీమార్గ మగమ్యము; కాన పలుకకుండుట లెస్స.

[ఈవిషయము లోకవేదాధికరణమునకు విరుద్ధముగా నున్నట్లు కనిపించును; కాన ఇంకను విమర్శనీయము.]

శబ్దశక్తు లెట్టివియొ మాశాస్త్రకలన
నరసి యాశబ్దములను మాయందె పఱపి
తగినటు లొసంగితిరి గురుదక్షిణ యని
పలికిరి పదజ్ఞులు విపక్షపండితులను. ౧౨౭

సాంఖ్యులపై నాక్షేపము

క్రతువులందలిహింస దుష్కృతమె యైన
మించి యుత్పన్నకుల ముద్ధరించుకతన
సుకృతమే కాదె పారదారికుల కనుచుఁ
గాపిలమునఁ గొండఱు కళంకమ్ము నెంత్రు. ౧౨౮

తా. క్రతువులలోఁగూడ హింసవలన దోషమే కలుగుచో హింస లేకుండఁ జేయుట పుణ్యము కావలసియున్నది. పారదారికులు ఉత్పన్నకులము నుద్ధరించుకతన వారికిని బుణ్యము గలుగవచ్చును. అని కాపిలులపై నాక్షేపము.

సమాధానము

దుష్కృతంబుల సుకృతమే తోడరు ననుచు
శాస్త్రమే దేని కలుగుచో జనుకె లేదు;
ఈరు దేవరవరణమ్ము నెటు తలంతు
రనుచుఁ దాద్విశుల్ ప్రతివాది కందు రెదిరి. ౧౨౯

తా. దుష్కృతములచేఁగూడఁ బుణ్యము రాఁగల దని శాస్త్రమున్నచో మే మటులే చేయుదుము. "దేవరాచ్చ సుతోత్పత్తిః" అను వచనానుసారముగ దేవరవరణమున పుణ్యము కలదని మీ రంగీకరింపలేదా? అని కాపిలు లనిరి.

యోగయుక్తులపై నాక్షేపము

అంగి యందువు యోగాఖ్య మగుసమాధిఁ
గాని యష్టమాంగముగను గణన మెట్లు?
ఆదరింతురె యంగాంగిభేదరహిత
మతము నని ఫణీంద్రునిగూర్చి యితరు లనిరి. ౧౩౦

తా. యోగ మనెడిసమాధి యంగియై యుండఁగా దానిని అష్టమాంగముగ నంగీకరించితిరి. అంగాంగిభావమేని కుదురని మీమతము నెవరు గ్రహింతురు ?

సమాధానము

ఇందు సామాన్య మేమి ? యే మిట విశేష
మెట్టిదో సమాధియోగము లెఱుఁగ కనెడి
యాధునికవిప్రలాపము లవి యటంచు
నగుదురు పతంజలీయులు తెగడి తెగడి. ౧౩౧

తా. సామాన్య మన నేమో విశేష మన నేమో, యోగ మననేమో సమాధి యన నేమో తెలియక యోగమే సమాధి యని పలుకు మీప్రలాపములు బాగున్న వని సమాధాన మిచ్చిరి. యోగాంగములలో నొకటిగఁ జెప్పఁబడినసమాధి వేఱు; యోగపర్యాయమైనసమాధి వే అని భావము.

మీమాంసకులపై నాక్షేపము

యజ్ఞభాగము లంద సమస్తదేవ
తలును స్వస్వరూపముల రాఁ దలఁచుచుండ
నెటు లపలపింతు వవ్వారినెల్ల ? ననుచు
మునులు కొందఱు జైమినిన్ మొనసి యనిగి. ౧౩౨

తా. ఈమహాయజ్ఞమున హవ్యమునిమిత్తము సమస్తదేవతలును స్వస్వరూపములతో రాఁగలరు. "వజ్రహస్తః పురందరః, ఇత్యాదయో అర్థవాదాః" అని వారిని రూపహీనులుగ నీ వపలపింతువా ? అని జైమినిని పరిహాసించిరి.

సమాధానము

జగదుపాస్యులై దేశికు లగుచు భిన్న
భిన్నజగమును మిథ్యగా నెన్ని రెవరొ,
వారిశిష్యుల మేము, తత్పథముఁ బట్టి
నడచెద మటంచుఁ బూర్వతంత్రజ్ఞు లనిరి. ౧౩౩

తా. ముల్లోకములకు గురువు లగుమహాత్ములు స్తంబాదిబ్రహ్మ పర్యంతప్రపంచమును అసత్య మని తిరస్కరించుచున్నారు. వారి శిష్యుల మగుమేము దేవతలనుమాత్ర మపలపించుటలో దోషము చేసినవార మెట్లగుదుము ? అని పూర్వమీమాంసకు లనిరి.

తమదె పైచేయి యనునట్టితలఁపుతోడ
నిట్లు వాదోపవాదము లెసక మెసఁగ
జరిగె దీక్షాహములు నుపసదహములును
సౌత్యదివసమునకు వచ్చె జనవిభుండు. ౧౩౪

తా. సోమరసము నభిషవము చేసి (దంచి) ఆ రసమును హోమము చేయుదినమును సుత్యాహమందురు. ఏఁడు దీక్షాదినములు కడపి సౌత్యదివసమునకు వచ్చెను.

పాలాశంబులు ఖాదిరంబులును బై
ల్వంబుల్ మహోదుంబరా
లోలి న్నిల్పిరి యెన్మిదిం బదియుఁగా
యూపంబు లం దవ్విధా

శేళం బిల్వ ఉదౌశసుల్ దిగఁగను
ర్వీన్ నిలుపఁ గ్రశ్శేణిశా
జాలం బట్లు రహించెఁ జూపఱకు ను
త్సాహంబుఁ గల్పించుచున్. ౧౩౫

వ. *అగ్నిసమీప మందలి రాజ్జుదాల మనుయూపమునకు 13 మూరల కుశరశనచే అశ్వమును బంధించి మహర్త్విక్కులు మంత్రప్రతిపాద్యార్థము సిద్ధముగ నున్నను మంత్రములచేతనే యీయర్థము స్మరింపవలె ననువిధివాక్యగౌరవముచే నామంత్రము లుచ్చరించుచు అశ్వమును సంప్రోక్షించిరి. ౧౩౬

శమిత లంత నశ్వాలంభనము నొనర్ప
చంద్రమేద స్సగస్త్యుఁడు సంగ్రహించి
యుంచి వేతసశాఖపై నొక్కకుణము
వేల్వఁగ స్రువాగ్రమున యథావిధిగఁ బట్టె. ౧౩౭

---

*పైవానికి వేదప్రామాణ్యములు "షడ్బైల్వా భవంతి, బ్రహ్మవర్చసస్యావరుద్ధ్యై, షట్ ఖాదిరాః తేజసోవరుద్ధ్యై, షట్ పాలాశాః, సోమపీథ స్యావరుద్ధ్యై అని, ''రాజ్జుదాల మగ్నిష్ఠం మినోతి" ఉత్తరవేద్యగ్నికి దగ్గరగఁ బాతబడునది. దీని కడపెడల పౌతుద్రవములు రెండు, తరువాత పదునెనిమిది, మొత్తము 21 యూపము లశ్వమేధమున నిలుపుదురు.

"త్రయోదశ మరత్నిగ్ం రశనాయా ముపాదధాతి. అనుటచే కుశరశన ప్రమాణము దెల్పిరి. 'తస్మహర్త్విజాం మహర్త్విక్త్వం, హోతాధ్వర్యు రుద్గాతా బ్రహ్మేతి మహర్త్విజః' అని మహర్త్విక్ శబ్దార్థము. మంత్రైరేవ మంత్రార్థః స్మర్తవ్యః" అని మీమాంస.

తా. అశ్వముయొక్క వపను ఏకశూల ద్విశూల అనుశాఖలయందు విస్తరింపఁజేసి దానిని జుహూవుతో హోమ మొనర్చుటకొఱకు స్రువముచేత జుహూవునందు అవదానము చేసి హోమము చేయుట వపాయాగహోమము. ఇఁకహవిరవదానములలో వేతసశాఖయందు అశ్వముయొక్క శ్రపణముచేసిన (వండిన) హృదయాద్యవయవములను ఖండించి హోమము చేయుటకొఱకు జుహూవునం దుంచి స్వధితిచే (కత్తిచే) అవదానము చేసి హోమ మొనర్చుట సంప్రదాయము. కాని యిందు అశ్వమేధాలంభనానంతరము వపను దీసి యేకశూలాదులం దుంచి హోమము చేయుసంప్రదాయము చెప్పఁబడినది. వేతసశాఖయం దుంచి హోమ మొనర్చుసంప్రదాయము హవిరవదానములందే కలదు. దీనికి శ్రుతి "ప్లక్షశాఖాయా మన్యేషాం పశూనా మవద్యంతి, వేతసశాఖాయా మశ్వస్య. ఉభయోరప్సుయోనిత్వాత్" అని.

అంత నధ్వర్యు వాయాగ్నీధ్రుని గుఱించి
"ఆశ్రావయ" యటంచు ననినవెనుక
ఆతఁ "డస్తుశ్రౌష" టంచు మంత్రము సెప్పె
వీక్షణప్రభ దెసల్ వెలుఁగువెట్ట
హోతృసంబంధమై యొప్పుఋగ్వేదయా
జ్యామంత్ర మవల సమాప్తి నంద
జుహూవుముఖంబుచే సొగసుగ నయ్యాగ
స్త్యుండు హోమము మంత్రయుత మొనర్చె

౧౦౫

అఖిలజీవుల లోఁదమ మణఁచునట్టి
పూర్వపుణ్యావిహీనులు పొందనట్టి
యాహావిస్సారభంబు మహాత్ము లైన
పండితులు గ్రోలి రానందపరవశు లయి. ౧౩౮

అపుడు సర్వాభిమతముగ నాహావిస్సు
శ్రుతికి వెలిపెట్టి బాప లిచ్చుటకు జంక,
పాశుకచరుపురోడాశభాగముల స
మృద్ధిగాఁ దిని రాదేవవృషభులెల్ల. ౧౩౯

తా. హావిర్దానము ప్రమాణము నతిక్రమించి చేయరాదు. దీనికి "హావిషో మధ్యాదంగుష్ఠపర్వమాత్ర మపదానం తిరీచీన మవద్యతి" అని. దాని ననుసరించి పెట్టినది స్వల్పమైనను దేవతలు దానిని వలసినంతగాఁ దినిరి. మంత్రశక్తిచే ఆపదార్థము వృద్ధిచెందు నని భావము. "యావ దేశా దేవతా కామయతే యావదేశా, తావ దాహుతిః ప్రథతే" అని పైదానికి శ్రుతి.

అగ్నిలో 'చంద్ర' మను వప నాహుతింప
దానిపొగల నేర్పడు జలధరచయమ్ము
నేఁటికిని మంచిముత్యాల నెపముతోడ
నాహావిర్బిందువుల నె నిత్యమును గురియు. ౧౪౦

తదను సావయవోద్దీధతత్సమష్ట్యు
పాసనజ్ఞుఁడు జైమిని ప్రభుహితుండు
సలిపె నుద్గాన మాజగజ్జనని పుడమి
నవతరించు టాకాంక్షించి సవనవేళ. ౧౪౧

తా. సామవేదావయవములు ఐదు. హుంకారము, ప్రస్థానము, ఉద్గీధము, ప్రతిహారము, నిధనము. వాని యుపాసనాభేదములు వివిధము లని ఛాందోగ్యమునఁ గలదు.

"ఆగాతాహ వై కామానాం భవతి. య ఏత దేవం విద్వా నక్షర ముద్గీధ ముపాస్తే. ఏవం ఉపాసకః యజమాన కామనానాం గానేన సంపాదయితా భవతీ త్యర్థః". ఈభావము ప్రభుహితుండు అను పదముచే సూచితము.

సురలు ప్రత్యక్షముగ హవిస్సులను దినుట
గాంచి సభ్యులు హేలనగా నగస్త్యు
నరయ, నతఁడు విగ్రహహీను లన్నమాట
వ్యాకరించెను గలహవిపర్యయముగ. ౧౪౨

ఈయఁదగు భూమి దక్షిణ యీక్రతువున
నైన నోమహాభాగ యీయవని నెల్ల
దారవోసితిగాదె యుదారబుద్ధి
ననుచు ఋత్విజుల్ దీవించి రధికతృప్తి. ౧౪౩

ఇలను బాలింప ననధికారు లగు బాప
లోనఁగ ధర నెల్లఁ దిరుగ సంతసము గదుర
ద్విగుణధన మిచ్చి కొని ప్రభు వగణితస్వ
సకలలక్ష్మిని బ్రాహ్మణసాత్కరించె. ౧౪౪

అశ్వమేధావబృథ మిది, యవనిపతిది
మునుఁగవచ్చువారు వసిష్ఠముఖ్యమునులు
తీర్థము త్రిశూలభవము, యీత్రితయమందుఁ
బావన మొకొక్కఁడే త్రిభువనములకును. ౧౪౫

అంత మిత్రావరుణసుతు లఖిలవిదులు
బ్రహ్మమునులు యోచించి పరస్పరమ్ము
అంబపుట్టువుఁ గోరి మనంబునందు
పుత్రకామేష్టి నొనరింపఁ బూనినారు. ౧౪౬

ఆ భవాని భువంబునం దవతరింప
నిష్టిసంకల్ప మావిభుఁ డెలమిఁ జేసె;
''అవతరిల్లుమ వైతానికాగ్నినుండి''
యనుచు పశుపతి చిచ్ఛక్తి కాన వెట్టె. ౧౪౭

భువనమాతఁ గుమారిగాఁ బొందఁ దలఁచి
ఆత్మపత్నీసమేతుఁడై యాగకర్త
నిరతితో నుండె ననుచు నాగ్నీధ్రుఁ డప్పుడు
హోతతో నెమ్మదిగఁ బల్కె శ్రౌతవిధిని. ౧౪౮

అంత బంగరుచాయతో ననలుఁడున్ బ్ర
దక్షిణార్చియై హోమము దయను గొనియె;
దళితనవపద్మగంధసాంద్రమ్ము లగుచు
మొగలిపూచాయతో ధూమములును నెగసె. ౧౪౯

## ద్వితీయతరంగము

త్రిభువనసుధామ శాంభవదివ్యధామ
వేల్చెడిహావిస్సునందు భావించి భక్తి
నధిపుఁ బురికొల్పి వైతానికాగ్నియందు
ముని యుదఙ్ముఖుఁడై హోమముం బొనర్చె. ౧౫౦

ఆజ్యహోమంబుచే మండునగ్నినుండి
యంతలోఁ బుట్టె నొక్కకన్యాలలామ
దళితకువలయదామకోమలత మెఱయ
భవ్యలావణ్యలహరీవివర్తమూర్తి. ౧౫౧

జడను బంగరుతామరసరుల ననఁగి
పెనఁగి వ్రేలాడుముత్తెపుఁబేఁట లొప్ప
వ్రేలుముంగురులఁ దెమల్చి వెడలు చూపుఁ
జెలువు చంచలశఫరికాశ్రీ వహింప. ౧౫౨

మనసిజునిముద్దుటుంగరం బనఁగఁ జెవుల
రత్నతాటంకములు రవరవలు నెఱప
ముద్దుఁబలుకులు నగవులు మొలుచునపుడు
మొగ్గపల్ చాలు నిగనిగ మురువుఁ జూప. ౧౫౩

వదనవిధుఁ గవిసెడిలేఁడి బెదరి పఱవ
మెడను బులిగోరుఁబదక మెప్పుడును వ్రేల
బిడ్డలట్లు త్రిమూర్తులన్ బెనుప నేమొ
మూఁడుపాలిండ్లురమ్మున మొనసికొనఁగ. ౧౫౪

దివ్యతరుపల్లవాభమై తేజరిల్లు
కరమునన్ గల్వచెండు చక్కఁగను దాల్చి
బంగరుంజీరపై నితంబమున వ్రేలు
భవ్యమణిమేఖలాకలాపంబు మెఱయ. ౧౫౫

గిలుకుటందియ లడుగుల గులుకరింప
అమ్మ యమ్మా యనుచు బాల యల్ల నడచి
శ్రుతిశిఖరముల మచ్చరించుచు వెలుంగు
సెజ్జపై తల్లిప్రక్కఁకుఁ జేరికొనియె. ౧౫౬

బిడ్డమోమును ముద్దులు పెట్టుకొనుచు
నొడలు నిమురుచు ఱొమ్మున కొత్తుకొనుచు
కనులు చేరలు చేసి యగ్గలిక మీఱఁ
గనుచు నాతల్లి నిర్వృతి గనదు సుంత. ౧౫౭

అప్పు డానందపారవశ్యమున నుబికి
కంచుకము చించికొను చనుకట్లనుండి
భువనమాతను బుత్రిగాఁ బొందియున్న
రాజపత్నికిఁ బా ల్సేపి రాఁదొడంగె. ౧౫౮

రాణి బిడ్డ నందింప రారాజు పైకి
వాల నుబలాటపడెడి యబ్బాల నంది
యమృతమయి గాఁగ నెంచుచు నక్కు జేర్చి
యతఁడు కైవల్యమును తృణ మట్లు లెంచె. ౧౫౯

మాటిమాటికిఁ గనులవెంబడిఁ దొఱంగు
నశ్రువుల దృష్టిసంరోధ మలమికొనఁగ
కొసరునగవులఁ దొక్కుఁబల్కుల వెలార్చు
బాలమోము వారలు గనఁజాల రైరి. ౧౬౦

యజ్ఞశేషము నడప, నాహారు స్మరింప
మాన్యమునిబృందమునకు నమస్కరింపఁ
దమిని నన్యోన్యముఖవీక్షణము లొనర్ప
నుభయులకుఁ జతురత చాల కుండె నపుడు. ౧౬౧

అంత శోభాపహీన మానసులు, బాల
కురమునఁ గుచాంకురత్రయ ముంటఁ గాంచి
కలఁతపడుచుండ పర్జన్యగర్జ యనఁగ
వెడలె నాకాశవాణి యేర్పడఁగ నంత. ౧౬౨

ఈమె పేరు తటాతక; యీమె కెవఁడు
పతి యగునో వానిదృష్టి పైఁబడినయంత
దీనిమూఁడవకుచము లోలో నడంగుఁ
దప్ప దని దైవవాణి తథ్యముగఁ బలికె. ౧౬౩

ఆ సుధామధురోక్తుల నాలకించి
పూర్ణదక్షిణలన్ గ్రతుపూర్తి చేసి
దేశికునిచేతి కామహాదేవి నొసఁగి
యతనిపదములకు సదారుఁ డగుచు మ్రొక్కె. ౧౬౪

అంత నధ్యాత్మవిద్య యానామె నపుడు
కుంభసంభవుఁ డెలమిఁ జేకొనుచుఁ బులకి
తాంగుఁడై ముదశ్రులతో మహామునులకుఁ
గానిపించె ననశ్వరకలితవృత్తి. ౧౬౫

కలుషము లడంగె మోహాసంకలన తొలఁగె
నీఁదులాడె లోకములు ప్రమోదజలధి
వసుధయెల్ల నభూతపూర్వత వహించె
నాజగన్మాత మనుజులం దవతరిలఁగ. ౧౬౬

తటాతకను పాండ్యరాజ్యమం దభిషేకించుట.

హరుని మేధావివర్త మైనట్టిబాల
కపు డగస్త్యుఁడు మేధ పెంపందుకొఱకు
పసిఁడిగిన్నియఁ దెలిదేనె పట్టి, పాల
రంగరించి త్రావించె లాలన మెలర్ప. ౧౬౭

పుణ్యకాంచనమాలాంకమున వసించి
యమృతతుల్యమాతృస్తన్య మాస్వదించు
ఛే యెఱుంగని నవ్యప్రవృత్తి నపుడు
పొందినటు లుండె నాబాల పూర్ణలీల. ౧౬౮

తల్లియక్కున మోమాని తనయ పూర్ణ
సౌఖ్య మందెను గాని తజ్జననిమాత్ర
మారుమూరిక మోమునే యరయుచుండి
తనివిఁ గన దామమత్వ మెంతటిదొ కాని! ౧౬౯

ఆకసమ్మునుండి తనంత వెడలె
బిడ్డకు తటాతకాఖ్యను బెట్టు మనుచు
సకలజనకర్ణపూర్ణరసాయనాక్ష
ర మ్మనుచు బిడ్డ కాపేరె రాజు పెట్టె. ౧౭౦

కనకశృంఖలాబద్ధమై కనులు చెదరు
పట్టుపరుపులతొట్టెల బాల నుంచి
జోలలను లాలిపాటలఁ జొక్కఁజేసి
నిదురపుత్తు రంతిపురంపుసుదతు లామె. ౧౭౧

పూర్ణశుభకర్మ మీపుణ్యభూమిలోన
నెవనిపేరిట యదపేక్ష నెసకమెసఁగు
అట్టిపరమహిమాలయుం డై యశోవ
దాతుఁ డగుమహీభృద్వరుతనయ యీమె. ౧౭౨

అమితభవతాపతాపితు లైనదేహ
ధారులకు నీమె పీయూషధార యగును;
నిర్మలస్వనమధుర వాణీకరస్థ
లలితలలితమనోజ్ఞవల్లకియె యీమె. ౧౭౩

దేవి ! నీ విట్లు మెలఁకువఁ దేజరిలఁగ
నిఖిలభువనముల్ కుశలత నెగడుచుండు
ప్రలయమందు లయించుప్రపంచమటులు
నీనిమేషంబునను మేము నిష్క్రియులము. ౧౭౪

ఇట్టు లవరోధకాంత లెన్నెని జోల
పాట లనుచుండఁ దత్ప్రతిధ్వనులఁ, సురలు
కెలఁకులను డాఁగి తత్త్వార్థకలితముగను
ననువదించుచు నున్నట్లు వినఁగ నయ్యె. ౧౭౫

సకలభూవలయంబుఁ జేలిక వహింప
పరిచయము చేసికొననేమొ బాల లీల
సకలబాలకగ్రహదోషశాంతికొఱకు
కేల మృత్కా-చవలయముల్ గీలుకొలిపె. ౧౭౬

ఇట్టిబాలిక నొకపరి యెదను జేర్చ
నట్టివారి కాఁకలిదప్పు లణఁగుచుండ
ఆటల సపాత్రహస్తయై యన్వ కబ్బ
కెట్టితాయల్ల మిడకయే యడఁగె తృప్తి? ౧౭౭

ఆకసమ్మున శశిరేఖ నట్టె చూపఁ
గౌతుకము మీఱ నద్దానిఁ గాంచి బాల
అద్ది తలపూవు; తెచ్చి యిం డనుచు మాటి
మాటి కనుచుండుఁ జే సాచి బోఁటితోడ. ౧౭౮

కలితమణిభవనములందుఁ గలయఁ దిరుగు
బాలికామణి కాలిమువ్వల బెడంగు
ఈమెపదము లన్వేషించి యెలమిఁ గేరు
నుపనిషద్దర్శనాద మట్లురవడించె. ౧౭౯

## ద్వితీయ తరంగము

అర్థసందర్భ మెడల ననన్వితముగ
సకియలకు బాల యేకథానికలు పలుకు
వానిఁ బరమోపదేశభావనను నిలిపి
మునులు సురలు నిగూఢులై వినుచు నుంద్రు. ౧౮౦

ఆమెకు విలాసవస్తువు లై కురంగ
పోతము లవెన్ని ధన్యత పొందినవియొ ?
అట్టిమృగతరుగణములయందు నేని
పుట్టనైతి నాసమయము పోయె నేఁడు. ౧౮౧

పొలఁతికి విహారసాధనంబులను గూర్చు
కార్యమే తేని కొకమహాక్రతువు నేఁడు;
కూఁతు రాజెడితొక్కుఁబల్కులను వల్లె
వేయుటే జపతపము లావిభుని కిపుడు. ౧౮౨

అమ్మ డాఁచినతినుబండరమ్ములందు
నాకుమారి చాటుగ నెంత యాహరించు
నప్పదార్థ మంతంతలై యాక్షణంబ
నిండుకొను సూక్ష్మముగఁ జూచునిపుణులకును. ౧౮౩

నిగమపథములఁ జరియించునిపుణులవలె
గుణయుతమ్ములును నిసర్గకోమలములు
నమలినమ్ములు బంతు లాయమ్మ కపుడు
మించుకౌతుకముం గలిగించె నహహా ! ౧౮౪

శ్రుతులపై సర్వవిద్యలు; శ్రుతులవెల్ల
శూలిపై; నాతఁ డంబపైఁ జూపు నిలుప
ఆమె చూపల్ల కందుకమందు నిలిచె
బళిర! యని యోగు లసమానభావు లైరి. ౧౮౫

కథలు పాటలు నెత్తనకాయలాట
కందుకక్రీడ నాడఁగాఁ గలిగె నంచు
సకలవిశ్వవిధానమాతృకయె యైన
కూఁతుపైఁ దండ్రి యెంతో మక్కువను జూపు. ౧౮౬

ఆటపాటలఁ జెలికత్తె లామెకనులు
మూసి యటు నిటు దాఁగఁబోఁబోవుచుండ
భువనములఁ జిమ్మచీకటుల్ కవిసి సఖులె
కన్నుఁ గానక మెదల రేకడకుఁ బోవ. ౧౮౭

అఖిలలోకైకమాతృక యైనబిడ్డ
కాచరింపుఁడు మాతృకాభ్యాస మనుచు
వినయవినమితగాత్రుఁ డై యనునయించి
కులగురుం డైనకుంభజుఁ గోరె ఱేఁడు. ౧౮౮

ప్రాణితతికి నొసళ్ల శుభాశుభాక్ష
రముల సర్వదా వ్రాసెడిరమణి నేఁడు
అపరిచితవోలె నొక్కొక్కయక్కరంబు
నేలపై వ్రేలితో వ్రాయ నేర్చుచుండె. ౧౮౯

అయ్యగస్త్యునియెదుటఁ దా నవనిమీఁద
అలతురీయాచ్ఛ దిద్దుచున్నట్టిబాల
భక్తియోగవినమ్రముఁ డాపరమమునికి
సకలకామకలారహస్యములఁ దెలిపె. ౧౯౦

పరమశివుచిత్స్వరూప మై పఱలునామె
కళలు నేర్వంగఁ దనదృష్టి నిలిపినంత
చెలిమికత్తెలపోలికఁ జేరవచ్చి
కళలె యుహామహామికలతో నిలిచె నెదుట. ౧౯౧

ముఖములే లేనియీశ్వరమూర్తి వలనఁ
దొలుత వెలయు జ్ఞాతాజ్ఞాతకళలనెల్ల
కలశభవుఁ డామెముఖముగఁ దెలిసికొనుచు
నదియె గురుదక్షిణగ హృదయమునఁ దలఁచె. ౧౯౨

అసిగదాశక్తి కులిశశరాసశూల
తోమరభ్రమరకములతో రహించి
సాముగరిడీలు నేర్చి యాచాన వీర
లక్ష్మి యన నొప్పె రణకౌశలమ్ము మెఱయ. ౧౯౩

ఏయమ 'మతంగజ' యటంచు నెన్నఁబడెనో
వేదశిఖలచే; నాధరావిభునిపుత్రి
మదమతంగజేంద్రముల నెమ్మదిగ వశము
చేసికొని సహజాతత వాసి కెక్క. ౧౯౪

భూభరము తీర్చుటకె తనపుట్టు వనెడి
భావము ధ్వనింప నుత్తమాశ్వంబు నెక్కి
ఖురపుటోద్ధపరాగ మంబరము గప్ప
స్వారి చేయు నిర్భరత నాసన్నుతాంగి. ౧౯౫

వేణి ముడివైచి బంధించి తూణయుగము
కవచమును దాల్చి ఖడ్గరేఖను ధరించి
దుమ్ము దోఁగిన యలకలతోడ వెడలు
నా మెరూపును ధన్యాత్ము లరసి రపుడు. ౧౯౬

చానకుఁ గుమారికాదశ జరిగినంత
నంగకములందు లావణ్య మంకురించి
భువనమంగళ మైనపూబోఁడితనువుఁ
దీర్చిదిద్దెను యౌవనదివ్యలక్ష్మి. ౧౯౭

మదనుఁ డామలయధ్వజాత్మజయెడందఁ
గదిసి మగ్నుఁ డైనంత బుద్బుదములట్లు
కులుకు లొలికెడివట్టువగుబ్బదోయి
యామె యెడఁద నున్మగ్నత నంది మెఱసె. ౧౯౮

కాంత నవయౌవనం బనుగాలిఁ దూలి
బాల్యలీలలు ప్రశిథిలభావ మంద
సిగ్గుదొంతర లటుపైని చిందులాడఁ
గడపె నైదాఱుదినము లిక్కరణి నంత. ౧౯౯

నడలఁ జూపుల మాటల నవ్వులందు
నొడలిపై క్షణక్షణము నాయుత్పలాక్షి
కబ్బురంబుగ మదనజిదంతరంగ
మునకె భావింపఁ దగుదశల్ మొలక లెత్తె. ౨౦౦

బాల్యదశ దాఁటి యౌవనప్రభలు మించి
యఖిలతత్త్వము లభివృద్ధి నందుకొనఁగఁ
దండ్రి కామె పరాత్మచింతనగురువుగ
రాజకార్యాల మంత్రిగా రహి వహించె. ౨౦౧

ఉభయలోకభరమ్ము నాయువిదయందె
నిలిపి భూపతి సురగణంబులను మించి
మోక్షమును మించి శివుఁడె గమ్యుం డటంచు
ఫుణ్యభావన దినములు పుచ్చుచుండె. ౨౦౨

అంత తేఁడు సార్థకనాముఁ డైనవాని
సుమతి యనుకులమంత్రిని జూడఁ బిలిచి
పత్నియును బుత్త్రికయుఁ దనపజ్జ నిలువఁ
బలికె నీరీతి హృద్గతభావములను. ౨౦3

మనకు సిరు లిచ్చునప్పు డస్మద్గురుండు
అనినమాటలు జ్ఞప్తి నున్నవియె నీకు ?
శత్రువులఁ బాఱఁద్రోలి యీసకలధరణి
నేలుకొను మనెఁ బదివేలయేండ్లదనుక. ౨౦౪

గురులయాశీర్బలమ్ముతో గురుతర మగు
నీమబుద్ధిబలమ్ముతో నీదినాఁడ
నంతకాలము; వారియత్యంతదయను
నాదువంశసముద్ధరణమ్ము జరిగె ౨౦౫

కడచె శైశవ మీమెకుఁ, బుడమి యేలఁ
గలవయస్సును శక్తియుఁ గలిగె నిపుడు;
కాని యీమెవివాహమంగళము నెఱపు
కోరికి యొకండె నేఁ దీర్చుకొనఁగనైతి. ౨౦౬

స్వర్గమర్త్యపాతాళముల్ చక్క వెదుక
నీమె కనువైనపతి తోఁచఁడే యొకండు;
ఈమనోరథ మొక్కఁడే యీశ్వరుండు
తీర్పకున్నాఁడు కరుణార్ద్రదృష్టిఁ బరపి. ౨౦౭

ఈమెహితచింత కే నెట్లొ యీవు నటులె
యంతకన్నను రాజకార్యములయందు
జరుగఁబోవువివాహదీక్షాప్రసక్తిఁ
దల్లియే నేఁడు సర్వస్వతంత్ర గాదె ? ౨౦౮

పాలకులఁ బొందుసకలసంపదలుఁ బొదలె;
నీమెచే వంశము తరించు నెఱిఁగికొంటి
నైన నాజగన్మాతృపాదారవింద
మెట్టు లందెదనో యన్నదే తపంబు. ౨౦౯

తే. డిటు వచింప రాణి యెఱింగి తత్త్వ
మతనిననుగమించుటకె యుద్యమ మొనర్పఁ
బుత్త్రికయు మంత్రియును శోకపూర్ణు లగుచు
మోహ మగ్గలింపఁగ సంభ్రమాధు లైరి. ౨౧౦

అపుడు శిశిరోపచారము లందికొనియు
వికలతను గొన్నయాతటాతకను దేర్పఁ
జలుకితమహాసముద్రుఁ డచ్చోటు దరిసి
పలికె నామెమాధ్యము పటాపంచలుగను. ౨౧౧

అంబ ! జయము, త్రిలోకవంద్యా ! జయమ్మ,
విగలితావరణాత్మచిద్విద్య ! జయము
మానవత నటించుచు నున్నమాత్ర నీకుఁ
దమము సోఁకుటయా పరధామమునకు. ౨౧౨

జనని ! నీమానవత యుపసంహరించి
త్వత్ప్రపన్నుఁడ నైననాపై సమస్త
కల్మషహరంబు నీయపాంగమ్ముఁ బఱపి
యాదరింపఁగదమ్మ మాయమ్మ వేగ. ౨౧౩

నీదు పెండిలికై బెంగతోఁ దపించు
మాత నోదార్పుమమ్మ నెమ్మదిగఁ జేరి
అమలగౌరీప్రదానపుణ్యమున నీమె
పతిఋణం బీగఁగా నెంచె భావమందు. ౨౧౪

పలుకఁగా నిట్లు కుంభసంభవుఁడు, లోక
మాత జనకుని మోక్షసామ్రాజ్యమందు
నిలుపఁగా నెంచెఁ గరుణ నింతలుగ నాశ్రి
తాళిపైఁ జూపు టాయమ్మ కబ్బురమ్మె? ౨౧౫

నాపదమ్ములు పట్టినవరులకెల్ల
మోక్ష మిచ్చువ్రతమును నే మఱయలేదు
చేరి నాతండ్రి కేమిచేసితి నటంచు
నెదను సిగ్గిలుచుందు నాయిగురుబోఁడి. ౨౧౬

పదపడి యామె కొంతవడి
ప్రాకృతభావము నూని, తండ్రి! బె
ట్టిద మగునీవియోగము క
డింది వెత న్ననుఁ దూల్చు నంచునున్
*దదను బరావరాత్మత మ
నంబున నెంచి కుమార! నీకు నే
కొదువయు లేదు నేఁ గలుగఁ,
గుందఁగ నేలని ధైర్య మిచ్చెడిన్. ౨౧౭

ఆత్మదేవతభుజములయందుఁ బుడమిఁ
గనుల లక్ష్మిని, చరణయుగంబునందు
జీవితమ్మును హృదయముం జేర్చి రాజు
ఆర్తి విడనాడి ధీరత నమరె నంత. ౨౧౮

*పరావరః = పరో ప్యవరో యస్మాత్సః = ఈ పరమాత్మకంటె హిరణ్యగర్భుఁడు కూడ దక్కువవాఁ డని యర్థము.

## ద్వితీయ తరంగము

పుత్రికానుగ్రహంబునఁ బుడమిఱేఁడు
అభవుగర్భాలయము పొందినంతలోన
మెల్లజనులును నచట మహేశలింగ
మొక్కఁడే చూడఁగలిగి రాచక్కి నిలిచి. ౨౧౯

చిరపరిచితుండు పతి గతించినకతాన
నాడలు తెలియనిబాధచే నుడుకునంబ
నంబిక కవుంగిలించి దుఃఖార్త యగుడు
కలశభవుఁ డామెతో నిట్లు పలికె నపుడు. ౨౨౦

అనుచితం బాచరింతువే యమ్మ ! నీవు ?
ఈవె దుఃఖింప జనని కిం కెంత యగునో ?
మనుజభూమికాభినయమ్ము మాని నీదు
తల్లి మోహము దీర్పఁగాఁ దలఁపుమమ్మ. ౨౨౧

అఖిలలోకశరణ్యా వీ వైనయెడల
నీనుడుల్ వేదవాదము లైనయెడల
నిన్ను దలఁచుచు నీలోనె నెలవు గొనిన
తండ్రికై దుఃఖమా యిది తగునె తల్లి ? ౨౨౨

అనుచు విదితపరావరుం డైనకలశ
భవునిసాంత్వన మంది యాపరమజనని
అఖిలకలుషప్రభంజనాపాంగకలన
నంబనున్ మంత్రిని ననుగ్రహమునఁ జేర్చె. ౨౨౩

తదను శుభకర మాముహూర్తమ్మునందు
హితులు ప్రజలాప్తులును బురోహితులు గొలువ
చంద్రమౌళిసన్నిధి జగజ్జనని నంత
మణిమయాసనమున నిల్పె మానివరుఁడు. ౨౨౪

పాండ్యకన్యక కాపశుపతియు వికచ
విచికిలసుపుష్పమాల నర్పించి యపుడు
లలన యొసఁగుమధూకమాలను గ్రహించి
హృదయమునఁ దాల్చెఁ బ్రేమసంపదలు పొదల. ౨౨౫

ఏయమకటాక్షలేశము నెలమి నంది
యవనిపతు లుర్విలోనఁ బరాక్రమింతు
రట్టియావీరలక్ష్మియే యవనిపతిప
దమ్మునను నిల్వ లొంగరే ధరణిపతులు ? ౨౨౬

ఇల సమస్తము సస్యసమృద్ధ మయ్యె
నంబుధు లొసంగె వివిధమహార్ఘమణుల
గహనములు మదగజములఁ గాన్కవెట్టె
నంతరిక్షము సమయము లరసి కురిసె. ౨౨౭

ప్రజలలో నొక్కరుం డైనఁ బరమదురిత
మొనరుపకయుంట యాయమ్మపున్నెమెగద;
కానిచో దయార్ద్రాక్షి లోకైకమాత
పాపరాధుల దండింపఁ జాలు టెటులు ? ౨౨౮

భూమి శాసించునాపువుబోఁడితండ్రి
నరులకలహమ్ములనుమాత్ర మరసి తీర్చెఁ
గాని నేఁ డీమె త్రిభువనప్రాణికోటి
కలహములఁ దీర్చుకర్తవ్య మెలమిఁ బూనె. ౨౨౯

ప్రభుత కేఁదగ్గపన్ను నర్పణ మొనర్చి
శివునిసేవలకై వేఱుచేసి యుంచు
ధనముఁ గూడ హరించి రోతల్లి! నీదు
నాయకు లటన్నప్రజఁ గాంచి నవ్వె నామె. ౨౩౦

అహమహమికలతో దిక్కు లధిగమించు
తద్యశస్సుల బహువిమర్దమ్ముకతన
బాటబాటలఁ గుప్పలై పడినరజము
కలన హిమగిరికైలాసములు జనించె. ౨౩౧

పన్నువడిపేర నాఱవపాల ధనము
నామె చేకొన, మిగిలినయట్టిధనము
నీశ్వరార్పణబుద్ధితో నెల్లజనము
లిచ్చుచుండఁ గోశసమృద్ధి కేమి లోటు? ౨౩౨

ధనగృహంబుల శ్రీని, విద్యాగృహంబు
నందు వాణిని, నట్టింట నన్నపూర్ణ,
వీరలక్ష్మిని గజహయాగారములను,
అధికృతులఁ జేసెఁ దనసఖు లౌట జనని. ౨౩౩

ఆ త్రిలోకైకజనని రాజ్యాధికార
మంద వేదండధనకనకాదిలక్ష్మ
లఖిలకళలును రూపము లంది వచ్చి
యామహారాజ్ఞికి సపర్య లాచరించు. ౧౩౪

తపనచంద్రస్వరూపదృక్ద్వయముకలన
పాండ్యకన్య నిమేషము పరిహరించి
సమయములఁబట్టి నిద్రింపఁజాలుఁ గాని
నిద్రలోనేని జాగ్రియనే వహించు. ౧౩౫

రాజ్య మేలెడియామహారాజ్ఞి చేత
దిగ్విజయమును జేయింపఁ దివిరి తాను
పంకిలస్థలులను గట్టిపఱచుకొనుచు
వచ్చిపడెను శరత్తు సంబరము గదుర. ౧౩౬

సింధుమరుగిరితరునిర్విశేష మైన
జగము భాసింపఁజేయుచు జలమయముగ
స్వచ్ఛమేఘబృందములు యశస్సుశరణి
నాక్రమించి వ్యాపించె నాహ్లాద మెసఁగ. ౧౩౭

విరలవారితటిన్నటీవిలసనములు
శాంతఘోషలుఁ గలవయ్యె జలధరములు
అమృతదాతలె యీరీతి ననుసరింప
స్థిర మనుచు నమ్మగా నగు దేని నింక? ౧౩౮

స్తనితజలమేఘమారుతచంచలాదు
లవనిజనులచే నెవి కొనియాడఁబడెనొ
అవి శరత్తున నింద్యము లయ్యె నహహా !
జనులగుణములు సమయానుగుణములెకద ! ౨౩౯

కాననము లలరెను, తటాకములు నిండెఁ
జల్లఁబడె సువిశాలవిశ్వంభరయును
వారిదము లాఁగినంత నెవ్వరికి హాని ?
కాని చాతకజాతికే కడుపు లెండె. ౨౪౦

నీటిచే భూతలంబెల్ల నిండఁ జేసి
వృక్షజాతి నెల్లెడఁ జిగురింపఁ జేసి
తత్ఫలం బందకయె మేఘతతి యడంగె
శరదృతువు దాని నంద నెచ్చరిక వచ్చె. ౨౪౧

జలదతిమిరాస్యముననుండి తొలఁచి చంద్ర
భాస్కరుల వెల్గఁజేయుటవలన నేమొ
రెల్లుఁబూలమిషమ్మున నెల్లదెసల
ధవళతద్యశస్సులను వ్యాప్త మ్మొనర్చె. ౨౪౨

ఎట్టెటో మేఘబంధము నెట్టి బలిమి
నమృతకిరణుఁడు మెల్లఁగ నంకురింప
వసుధ నుత్పలినీకుముద్వతులకెల్ల
భ్రమరమిషమున నీశుభవార్త తెలిసె. ౨౪౩

అబ్దములు నిల్పునతివిగతాంబుసత్ర
మాపివేసి నీశరదృతు వనెడి, దాని
నిర్మలయశస్సు జగమెల్ల నిండుకొనెను
*అతిని భంగించుకంటె సద్యశము గలదె? ౨౪౪

దుర్దినమ్ములు తొలఁగుట ద్యుమణి శశియు
దర్శన మొసంగఁ బ్రజలు సంతసము గనిరి;
గగనతలమును నిష్కలంకత వహింప
జీవు లెంతగ మురిసెనో చెప్పఁదరమె? ౨౪౫

తీయనౌ తేటనీరు మదించునళులు
పంటపొలములు మఱి గట్టిపడినదార్లు
చిగురుఁదోఁటలును సమోష్ణశీతలతయుఁ
గలిగి భువి దివికన్న భోగ్యతర మయ్యె. ౨౪౬

ఎన్నులను దిని బలిసి రహించునటులు
పలుకుపలుకులఁ దేనియ లొలుక, మింటఁ
గామసారితవాగురోత్కర మనంగ
బారులం దీర్చి చిలుకలపదుపు లెగిరె. ౨౪౭

జలజములు నవ్వె, జలములు కలకదేఱె
పలుకఁబాఱెను వెన్నెలల్, కులికె జగము
కాని విరహుల కీస్థితి ప్రాణకుట్ట
మయ్యె నీశరత్కాలమహాత్మ్యకలన. ౨౪౮

*అతి = ఎక్కువ (అతి సర్వత్ర వర్జయేత్.)

పండి పగిలినయిక్షుపర్వములనుండి
చెదరిపడుముత్తియములకు నదరి బెదరి
జొన్నలును కొఱ్ఱులును పండుచోట్ల కెలమి
వాలు, శుకశారికలు నేత్రపర్వముగను. ౨౮౯

కమలవనమందు వృద్ధభృంగములు హస్తి
కటతటమ్ముల యువకభృంగములు వ్రాలి
తెగలు రెండుగ నున్నను పగలు గొనక
చిత్తజునిపని నేకమై చేయుచుండె. ౨౯౦

ఆనవాల్ పట్టలేనట్టు లైనతొంటి
కొలఁకులను జేరి రాజహంసలు మదమున
తమతమనవారవిందకోశములఁ దెలిసి
తగులు రసగంధవర్ణభేదములకలన. ౨౯౧

నీరములు శీతలత నంది తేటుకొనియె
పద్మగంధాఢ్యముగ మందవాత మొలసె
రాణియు నకారణదయను రక్తిఁ జూపె
మహిని జనులకు శుభపరంపరలు నిండె. ౨౯౨

వివిధపాలకపాలనావిధి జనించు
మలినము తొలంగ భువియు నుజ్వలత నందె
దాని కీశాలమును దోహద మ్మొనర్చి
రాణిదయఁ గోరుచున్నట్లు రాణ మిగిలె. ౨౯౩

## తటాతకాజైత్రయాత్ర

అంత నొకనాఁడు పాండ్యునియాత్మజాత
మణిమయోజ్జ్వలరాట్ సభామధ్యనుండి
అమలపద్దర్శనములకే నందరాని
దర్శన మొసంగెఁ బ్రజల కాప్తత తోనంక. ౨౫౪

ధరణిపతులు బాపలు మునివరులు భటులు
పరిజనంబులు బంధుగుల్ పౌరవరులు
వందిజానపదుల్ మిత్రబృందములును
జేరి క్రిక్కిఱిసిరి తద్విచిత్రసభను. ౨౫౫

నవ్వి తలయూఁచి పలికి ప్రణామము లిడి
చూచి యందఱ నుపచరించుచుఁ గుమారి
మానవు లటన్నఁ గొండంతమత్సరంబు
గలుగఁజేసెను దేవతాగణమునకును. ౨౫౬

ఇరుగడల నిల్చి వీఁచెడియిగురుబోండ్ల
కరములందలి వెల్లచామరము లెన్న
సులభ, యత్యుత్తమయు, నాఁగ వెలయునట్టి
యుభయపరిశుద్ధకీర్తుల ట్లొప్పుచుండె. ౨౫౭

ఆతపత్త్ర మామెశిరంబునందుఁ బట్ట
సకలజగమును హాయిగఁ జల్లఁబడియె
నామె జగదేకమూర్తియై యవతరిల్లె
ననుట కిదియే నిదర్శనం బగునుగాదె. ౨౫౮

వందు లోకమెడ నామె నేర్పడ నుతింప
వేదశిఖ లొక్కయెడఁ జేరి వినుతి సేయు;
ఇందు మొదటిది సగుణ మూ టెటఁగికొనిరి
రెండవది నిర్గుణం బా టెటింగికొనరు. ౨౫౯

ఆమె యొకపు డందట విడనాడి తనదు
మాతఁ గాంచనమాల నమాత్యవరుని
బ్రియసఖీజనంబులను రప్పించి వారిఁ
గలిసి యేకాంతముగను హృద్గతము దెలిపె. ౨౬౦

అమ్మ నొక్కయాసనమ్మపై నిలిపి తా
నామెపాదపీఠి నధివసించి
మంత్రి సుమతితోడ మంత్రణ మొనరించె
బాల జయముఁ గోరి ప్రౌఢలీల. ౨౬౧

జయము వాంఛించి నీ వనుశరదమున నె
ప్రభుని బ్రోత్సహించుచు నుండువాఁడ వెపుడు
బాలిక యటన్నసందేహభావముననొ
నన్నుఁ బురిగొల్పకుంటి వాతెన్ను విడిచి. ౨౬౨

రణ మిటుంగనిదాన బాలను గరమ్మ
పదరి యటుపయి నవరోధబద్ధ నైతి
నైన నూయుంబదీవెన లంది నీదు
బుద్ధిబల మంది విజయము పొందఁ దలఁతు. ౨౬౩

అనఁగ నీ వటు లనవలదమ్మ వినుము
మంత్రితోడిదె విజయమ్ము మనకు నెపుడు
ఏది యెట్టుగనౌనొ యా యితవు సర్వ
మాతఁ డెఱుఁగు నటంచుఁ దన్మాత పలికె. ౨౬౪

తల్లిమెత్తనియెడఁద కాఁతనయ సర్వ
స్వర్గతుం డైనపాండ్యభూజానిగూర్చి
భక్తి నమ్రుండై సుమతి యాబాలతోడఁ
బాష్పగద్గదవచనుండై పలికె నిటులు. ౨౬౫

అమ్మ! నామాటలను వినవమ్మ నీవు
నన్ను మిన్నగ నెన్ని నీ వన్ననుడులు
నీయనుగ్రహమేసు మ్మనృతము లగునె?
బాల! నీపలుకులు వేదభాషితములు. ౨౬౬

అని సుమతి యామెతో నిట్టు లాడుచుండ
చయ్యన నగస్త్యమౌని సాక్షాత్కరించి
వివిధరీతుల వారి దీవించి పెరిమ
నాతటాతకతో నిట్టు లనుచుఁ జెప్పె. ౨౬౭

పసిఁ గరగ్రహణము సాధించుకొం దీవు
నీదువిజయయాత్ర నెగడుఁగాత
పావనత్వదీయపర్యటనమ్ముల
భూమియెల్లఁ బుణ్యభూమి యగుత. ౨౬౮

అని పలికి పుణ్యలగ్నమునందు నామె
నిలిపి గ్రామాంతమందున బలయుతముగ
తత్కరగ్రహమంగళోత్సవము నరయ
నయ్యగస్త్యుఁడు మలయాద్రి కరిగె నపుడు. ౨౯౯

సిద్ధముగ నుండె నిపుడు నీసేనలెల్ల
రాత్రి గడవంగఁ దెల్లవాఱఁగనె నీవు
మఱలుజనుల మఱల్చి నెమ్మదిగ రేపు
పయన మొనరింపు మని మంత్రివరుఁడు పలికె. ౨౭౦

అమరగిరి కుత్తరప్రదేశముల నీమె
జయముకొఱకుఁ బర్యటనము సలుపు ననుచు
ఆదిశను దాను ముందుగా నరయ నేమొ
అస్తమింపఁగ నుండె సహస్కరుండు. ౨౭౧

భాస్కరుం డస్తగిరిఁ గూలి పడినయేని
త న్ననుగమించుఘృణుల యుద్ధరణ సలుపు;
అట్టివ్యసనము లేనిదే యెట్టు లతని
లోకబాంధవుఁ డందురు లోకులెల్ల ? ౨౭౨

ఎన్నిసారులు మునుఁగలే దితఁడు నీట
నెన్నిసారులు తేలలే దితఁడు మరల
మునుఁగ నున్నట్టికారణంబున నె యిపుడు
ఇతవుగ జలాంజలులఁ బాప లిచ్చి రకట ! ౨౭౩

ఇందనుక యస్తమింపఁడేమే యటంచుఁ
గోపపరిపాటలోగ్రదృక్కోణములను
యువతు లుద్వీక్షణ మొనర్చుచుంట నేమొ
అంశుమంతుఁ డారుణ్యము నందె నపుడు. ౨౭౪

ఉపలకంటకదుర్గ మైయున్న బాట
నీడ్వఁగానేమొ శిథిలమై త్రుటితము లయి
సూర్యకిరణము లొకకొన్ని చొక్కి సోలి
చదికిలంబడె సంజకెంజాయమిషను. ౨౭౫

పశ్చిమాచలగుహాలలోపల నణంగు
చిమ్మచీకట్లు ప్రార్థన సేయనేమొ
సాంధ్యరాగచ్ఛలమున భాస్కరునికిరణ
జాలములు కొన్ని బాటలో వ్రేలుచుండె. ౨౭౬

అధ్వఖేదాన శిథిలము లైనసూర్య
జరఠకిరణముల్ దారిని జాఱె కొన్ని
అంతలోనె సాయంకాల మైనకతన
భవనదీపాగ్నుల కతిథిభావ మందె. ౨౭౭

ఏగభస్తులు సూర్యుతో నేటఁ బడెనొ
దూరదూరముగా నేవి తొలఁగి చనెనొ
అట్టియిరు తెగలందు నర్యమునిదృష్టి
సమమె ప్రభువులయవివేకసార మిట్లు. ౨౭౮

ముడుఁగురేకులతలుపులమూలలందు
మధుప మనునుపలమ్మును మాటుపెట్టి
అంబుజోదరకుటి మూసి యాదిలక్ష్మి
యచటు విడనాడనేమొ తనంత తానె. ౨౭౯

రాత్రి యను కాంత నృత్యము రహి నొనర్ప
దివి యనెడి రంగభవనమం దవతరించి
అమలతారక లనెడి ఘర్మమునఁ దాను
బూలదోసిళ్ల విరఁజిమ్మి పోయెనేమొ ? ౨౮౦

మునిఁగి మునుఁగన ట్లుండెను దినకరుండు
ఆతనిసహస్రకిరణము లణఁగలేదు
ఎచట నున్నవో? ప్రోగైన వెట్టొ కట్ట !
అంతలోపలఁ దిమిరము లలముకొనియె. ౨౮౧

ధనువు నెక్కిడి యేయ సిద్ధముగ నున్న
మారునకు మిత్రుఁ డగుచందమామ వచ్చి
ముకుళన మొనర్చి యాతని మొదటిబాణ
మగుజలజమును నిశితాగ్రముగ నొనర్చె. ౨౮౨

తల్లితో నామె రాత్రియంతయు నెవేవొ
యవిరలమ్ముగ మాటల నాడుచుండ
చనియె నీరేయి పంచపక్షణమితముగ
ననుచుఁ దలపోసె నాశఫరాక్షి యప్పుడు. ౨౮౩

మంత్రియాజ్ఞచే నాసైన్యమధ్యమందు
మించి విజయదుందుభిని మ్రోయించినారు;
జలదగర్జానుకారి నిస్వనము లంత
నాకసమును భూభాగము నాక్రమించె. ౨౮౪

ఆ ధ్వనుల్ జగదండము నలమికొనఁగ
హస్తములఁ గర్ణములు గప్పి రమరవరులు
కనులు మూసె చక్షుఃశ్రవోగణము బెదరి
కనులుఁ జెవులును మూసెను మనుజగణము. ౨౮౫

ధ్వజము లెత్తియుఁ దద్యోధవరులు గూడి
హయగజశతాంగవితతు లాయత్తపఱిచి
బలము లప్పుడు సన్నాహముల నొనర్చె
పటహభాంకృతుల్ వీనులఁ బడినయంత. ౨౮౬

జయము గోరుచు లోకైకజనని కపుడు
జనని మంగళరక్ష హస్తమునఁ గట్ట
నమలమణిమయశిబికఁ దా నధివసించి
బలముఁ గదలించి యా వెన్క పయన మయ్యె. ౨౮౭

పల్లకికి ముందు భటు లశ్వతల్లజములు
కుంజరమ్ములు రథము లెక్కుడుగ భృత్యు
లవల సావిదల్లకులు వెన్నంటి నడువ
క్రమనిబద్ధమై సేన దూరముగ సాగె. ౨౮౮

రాజచిహ్నముల్ రత్నవేత్రములు పట్టి
వేణుమర్దలడమరుకవీణ లూని
గద్యపద్యముల్ చదువుచుఁ గాంతలెల్ల
నామెముం దుండి సేవల నాచరింత్రు. ౨౫౯

హయఖురాగ్రసముద్ధూత మగుచు నెదుట
భూపరాగము భాస్కరుఁ బొదివికొనఁగ
దిక్తటమ్ము నసేని తదీయబలము
బాటను గ్రహించు ననుకూలపవనములను. ౨౬౦

దశదిశల్ చుట్ట గుజ్జుపుదళము చేత
చిమ్మఁబడినపాంసువుల విచిత్రముగను
దానశీకరవితతి వ్యాప్త మ్మొనర్చి
యణఁచు మత్తగజాళికర్ణానిలములు. ౨౬౧

శారదాగమయోగవిశ్లథము లైన
మొగిలుగములపైపై నడ్డముగను దోఁచు
క్రమశక్రశరాసనఖండ మపుడు
హస్తిపకులకుఁ జేఁజిక్కినట్టు లొప్పె. ౨౬౨

కవచము ధరించియును నిషంగమ్ము గట్టి
అమ్ములను బట్టి ధనువు సజ్యముగఁ జేసి
ఆప్తసైనికవరులు దన్ననుగమింప
సచివుఁ డామెకు వెనుకగ సాఁగుచుండె. ౨౬౩

తగినయుపహారములను హస్తములఁ బట్టి
గుములుగాఁ గూడి యాకుమారముగ జనులు
విజయయాత్ర సాగించు నావిశ్వజననిఁ
జూచు వేడుక నువ్వెత్తు చుట్టుకొనిరి. ౨౯౪

ముగ్ధసల్లాపకౌతుకభూమి యైన
పడఁతి శిబికను మెల్లఁగా నడువఁజేసి
గ్రామ్యభావసూచకము లై గ్రాలుజనుల
భాషణమ్ములు వినుచు సంబరము గొనును. ౨౯౫

కాళికా! మలయధ్వజుకన్నెఁ జూడు
కుబ్జికా! తండ్రిమోమె యీకువలయాక్షి
దీమె యైదాఱునెలలు పెద్దేమొ నాకొ
మరితకన్నను; శిశువె సుమ్మా తలంప. ౨౯౬

నాఁడు విసరినగాలివానలకు వెనుక
అశ్వమేధాన జేని కీయమ్మ పుట్టె,
ఇంతలో నెంత నేర్చె; నీయింతి కెవఁడు
మగఁడు కాఁగలఁడో వానిమనువె మనువు. ౨౯౭

అమ్మ! నీదయచేఁ బదియావు లుండె
మేఁకలును గేదెలును బెక్కు మాకుఁ గలవు
గోరువెచ్చనియీపాలఁ గొనుము తల్లి!
దప్పి గాకుండునే యింతదవ్వు రాఁగ. ౨౯౮

గంజియును చల్దియెంతేని గలదు తల్లి!
చల్లఁగా వెచ్చగాఁ ద్రావి సాఁగు మమ్మ!
కలవు దుంపలు వెదురుఁబ్రాల్ వలసినన్ని
తినుచు నీయాఁకలిని దీర్చుకొనఁగదమ్మ! ౨౯౯

పశుబలుల నిచ్చి కుక్కుటబలు లొసంగి
దేవి కర్చలు నీకునై దీర్పఁగలము;
అమ్మ! హాయిగ వెడలి రావమ్మ; యింట,
ముసలి దేరీతి నిను వీడి మసలఁగలదో? ౩౦౦

కోమలీ! మలయధ్వజుకూఁతు వీవ
అనుచు నొడలెల్ల నిమురుచు నాలపించి,
మెల్లమెల్లన దీవించు నెల్లజనుల
నల్లనల్లన మన్నించు చరిగె రాణి. ౩౦౧

దారిలో నదులను బర్వతములఁ దరుల
నామె పరిశీలన మొనర్చు, చాత్మబలము
లడుగుదప్పక మెలమెల్ల నడుచుచుండ
సాగెఁ దద్యాత్ర మిగులఁ బ్రశాంతముగను. ౩౦౨

చెఱుకులను పండ్లనేని స్పృశింపదయ్యో
చెప్పఁగావలెనే వరిచేలమాట?
గాలి తెచ్చినపుష్పసుగంధమేని
యాన వెఱచును సేన యాయమకు వెఱచి. ౩౦౩

ఊదివేతుము యుదధుల నఃఘ్ అటంచు
కొండతలల మీటుదుమోటు గోటికొనల
ననుచు నాయమ సర్వసేనాధిపతులు
దుర్జయులు వెలార్తురు రణఖర్జువులను. ౩౦౪

భానునిసుదుర్విషహతాపబాధ స్వీయ
సైన్యమునకు లేకుండ విశ్రాంతి నిడుచు
వివిధఫలవృక్షకీర్ణకావేరిదరిని
పటకుటీరము రాణి కేర్పఱిచె సుమతి. ౩౦౫

ముందుగాఁ జేరి యధికృతు లందు నందు
వేలువేల గుడారముల్ వేయ నచట
స్వీయవిజయధ్వజమ్ములే చిహ్నములుగ
మోదమునఁ జేరి రా భటముఖ్యు లపుడు. ౩౦౬

భవనములతోడ విపులవిపణులతోడఁ
బటనికేతమయం బయి భాసిలుచును
అల్లమధురాపురంబె యాయమ్మ ననుస
రించె నన్నట్లు మదిని భావించ నయ్యె. ౩౦౭

చెమటచిత్తడి నొసలిపైఁ జిందులాడ
ధూసరాలకలా చేరెడేసికనుల
మోమునకు నింపు నింపఁ దన్ముఖము చూడ
భువనమంగళమోహనస్ఫూర్తి నొప్పె. ౩౦౮

శిబిరమునకు మున్ముందుగ శిబిక డిగ్గి
సకలజనులఁ గటాక్షవీక్షణతఁ దనిపి
సుమతికల్పితకక్ష్యాభిసుందర మగు
స్వచ్ఛపటకుటీరమ్ము నాచాన చేరె. ౩౦౯

ఆవృతులు బావులును తోఁట లనఁటితరులు
మణికలశ లొప్పునాపటమందిరమును
సుమతి చూపుచునుండ నాయమయుఁ గనుచు
నగణితం బగునానంద మందుచుండె. ౩౧౦

ధూపసుమదామపరిమళతుందిలంబు
భవ్యచిత్రవితానవిభ్రాజితంబు
మణిమయాసనమంచసమంచితంబు
నైనశయనగృహంబు నాయమ్మ చేరె. ౩౧౧

వేయిరేకులతో వేదవేద్య మగుచు
విమలచిన్మయమూర్తి యాకమలము నట
తెచ్చి నిలిపిరో యనఁగ సందీప్త మగుచు
నామెపటకుటి స్వచ్ఛమై యందగించె. ౩౧౨

మృదులశయ్యను జేరి యాసదమలాంగి
సెల వొసంగి మంత్రికిని, భూషలు తొలంచి
తనదుసఖులకు మార్గఖేదమ్ము తొలఁగఁ
బిలిచి సల్లాపగోష్ఠిని సలిపె నపుడు. ౩౧౩

మెలఁగెడిబలమ్ము నట విశ్రమింపఁజేసి
యనుగమించుసేనల నట నాఁపివైచి
హాయిగా రే పిట వసించి యవలఁ బోవఁ
గల మటంచును మంత్రి కాజ్ఞల నొసంగె. ౩౧౪

అవల నామె దుకూలకుడ్యములతోడఁ
బరివృతం బైనకావేరిభాగజలము
నందు సఖులతోడుత స్నాన మాచరించి
పరిసరములందు నచ్చటఁ బర్యటించె. ౩౧౫

జీను లెడల విశ్రాంతిని బూనుహరులు
బంధముల నూడ్వఁగ సుఖించుగంధకరులు
స్నాతపీతసుప్తభటాళి చాల గలిగి
బలము సచివశాసనమున నిలిచె నపుడు. ౩౧౬

తీరములయందుఁ గలనాళికేరతరుల
హస్తలభ్యఫలోదక మాని యా, వి
బుధులు విధుకలామృతభాగములనుమాత్ర
మాపత్ప్రాయముగఁ గ్రోలి యలరుచుంద్రు. ౩౧౭

తజ్జలము తనలోనఁ గొంత వడుకతన
స్తబ్ధత వహించె నచ్చటిసాగరంబు,
ఇందుచే నట జలధికి నిక్షుసార
జలధి యనునామధేయము సార్థకంబు. ౩౧౮

వినుతసర్వపథీనకావేరి కెన్న
గంగ త్రిపథగ యర్ధభాగంబె గాన
నేతదర్థ మెఱింగిన యెల్లజనులు
అర్ధజహ్నుతనయ యని యందు రీమె. 3౧౯

ఈనదీలలామ మెన్నఁగ మనగురు
పత్ని యే యటంచుఁ బలికి దేవి
చెలిమిక త్రియలకుఁ గలిగినదృఢభక్తి
భావమును మఱింత ప్రబలఁ జేసె. 3౨౦

ఆతటాతక కావేరి నధికభక్తి
గంగకన్న మిన్నఁగఁ జూచు కారణ మది
గంగవలెఁ దనకు సపత్ని గాక యుంట
గాని, గురుపత్ని యనునది యౌనో కాదో? 3౨౧

స్నానమాడినఫల మిందు స్వర్గ మంద్రు
కాని యద్దాని నేను మోక్షంబె యందు;
నాకమునకంటె మధుర మీనదియె దీన
భక్తి మునిఁగెడివారికి స్వర్గ మేల? 3౨౨

ఆతటాతక యొకధవళాశ్వ మెక్కి
ఆత్మబల మొకకొంత తన్నునగమింపఁ
గలయఁజూచి తత్కటకభాగములనెల్లఁ
దనకుటికి సాయ మగునంతఁ దరలుచుండు. 3౨3

అటులు ప్రస్థాన మొనరించునట్టి దేవి
నెలమి ననుగమించుచు మంత్రి యెల్లవేళ
భటుఁడు యామికుఁడును మంత్రివరుఁడు నగుచు
నొక్కఁడే బహుధా వినియోగపడును. 3౨౫

దేవి దిగ్విజయమునకై తిరుగుచుండఁ
గోరి యొసఁగఁగ వివిధోపహారములను
వందలకొలందిభూపతుల్ వచ్చి యటకు
శరణమును వేఁడి రాయమ్మ చరణములను. 3౨౬

ఆయమకుఁ దమవినయవిధేయతలను
మంత్రిముఖముగ వారెల్ల మనవి సేయఁ
దల్లిదయ నంది తత్సన్నిధానమందు
మసలునర్హత గాంచి రామహీపతులును. 3౨౭

వాహనమ్ములు ధనము లవ్వారి గాఁగ
నొసఁగి రత్నసుమాంజలు లొప్పఁ జల్లి
సుమతి పరిచయముం జేయ సొరిది వార
లామెపాదములందు సాష్టాంగపడిరి. 3౨౮

భయము వలదు సుఖమ్ములఁ బడయుఁ డరుగుఁ
డనెడియాయమపలుకుల నాలకించి
లేచి యొక్కరి నొక్కరు చూచుకొనుచు
మనవు లొనరించి రంబ కీమాడ్కి వారు. 3౨౯

ఆ దయామయుఁ డగుమలయధ్వజుండు
మాదృశులయందుఁ జూపినమహితదయకు
వేయిరెట్లుగ మముఁ గాంతువే గదమ్మ
మనవి యొనరింతు నొక్కటి వినఁగదమ్మ! 3౨౯

ఆత్మ లర్పించి కులదాసు లైనమేము
భటుల మైయుండ నీపాటిభాగ్యమునకు
రాణి వై నీవె విజయయాత్రలకుఁ దరల
నింతకన్నను నడి మా కిఁ కేమి గలను? 330

కాన మీయమ్మకడ కీవు కదలిపొమ్ము;
మాకు మొనగాఁ డగునుగాక మంత్రి సుమతి;
భవదనుగ్రహలేశసంపర్కవశత
ఖేచరులనేని యవలీల గెలుతు మమ్మ! 33౧

సాహసులె మీర లనినట్లు జరుపువారె
పుడమిఁ జూడఁగ నే నిట్లు వెడలి యుంటి;
కుతుక మున్నచో మాతోడఁ గూడి రండ
టంచు నరపతులకు నామె యానతిచ్చె. 33౨

మంత్రిముఖముగ నారాజమాన్యుల నట
నమితవాహనముల భూషణావళులను
సత్కరించి యాయమ్మ వాత్సల్య మొప్ప
సైన్యములఁ జేర వారి కాజ్ఞలను వెట్టె. 333

ఆయమ మాటలోను నుచి
త్తానుచితజ్ఞత నాత్మశాంతినిన్
పాయనిసత్కృపాలుత న
పారయశఃపరిలుబ్ధదృష్టినిన్
వేయివిధాల మెచ్చుచు వి
వేక ధురీణుఁడు మంత్రి యామె కా
ప్యాయన మొప్ప దీవెనలు
పల్కెను బ్రమొక్క ముదప్రసుపూర్ణుఁడై. 33౮

నీసాచివ్యముచేత లోఁగిరి పరుల్
నీ విద్ధసద్విద్యచే
నీసాన్నిధ్యబలానఁ బల్కుదును కా
నీ, లోకరక్షార్థమై
యే సాధింపఁగ నేమియుండినను నీ
దే భార మంచాడుచున్
దా సేవాశ్రమ దీర్చె మంత్రికి సము
ద్యత్పూర్ణసంభావనన్. 33౯

ఇది:- శ్రీమదాత్రేయసగోత్ర, దువ్వూర్యుపనామకపవిత్ర,
పెదశేషయార్య శేషమాంబా ద్వితీయపుత్త్ర, మహా
గాయత్రీశరణ్య, గురువేంకటరమణకారుణ్య
సూర్యనారాయణశాస్త్రి ప్రణీతంబైన
ఆంధ్ర శివలీలార్ణవ
మహాకావ్యంబున
ద్వితీయతరంగము
సమాప్తము.



# శివలీలార్ణవము

## ౨౦

## తృతీయ తరంగము



తటాతకాదిగ్విజయము.

వేణునాదవీణాగానవిధులు నెఱపి
నెచ్చెలులు రేల నాదేవి నిదురపుచ్చ
వందిమాగధులట్లు ప్రభాతములను
లేమ లోకకొండ ఆమెను లేపుచుంద్రు. ౧

అంబ ! తాపకోదయపూర్వమందె నిఖిల
తమము తొలఁగఁగ నరుణసందర్శనంబు
కోడికూఁతల మేల్కొన్నకోకములకు
సుప్రభాతము దెలుపఁగాఁజువ్వో జనని ! ౨

తల్లి! ప్రాభాతవాతపోతములవలన
ప్రియుఁ డగుదివాకరునిరాక విని యెడంద
నలరి వాసకసజ్జికవలె సనాళ
కంజపద్మిని యుద్గ్రీవికత వహించు. 3

ఇనునితొలికిరణములు ధ్వాంతేర్ష్యకలన
మలినములనెల్ల వెంటాడి తొలఁగఁద్రోయ
నపుడు నీలోత్పలంబులం దణఁగియున్న
యళుల కుచ్చాటనం బైనయట్టు లెగురు. ౪

హంసకంచుకుల్ షట్చరణాతికుబ్జు
లామరుత్కింకరులు సేవ కచటు సేర;
*అచ్యుతాంతఃపురద్వార మధికృతులటు
ద్యుమణికిరణము లుద్ఘాటనము నొనర్చె. ౫

విచ్చెనో లేదొ యాయరవిందకోశ
మహామహామికలఁ జొచ్చి యం దలికులంబు
లొక్కచోఁ దావు లాన వేఱొక్కయిక్కఁ
బిల్లతెమ్మెరల్ వాసనల్ గొల్లగొనును. ౬

అల్లమం దేహహననార్థ మతులభక్తి
బ్రాహ్మణులొసంగుప్రాతరర్ఘ్యములఁ బుట్టు
వజ్రకాంతులు రవిఁ జుట్టివైచె ననఁగఁ
దూర్పు పరిపింజరిత మయి తోఁచె నపుడు. ౭

జలధినుండి లేచెడిసప్తసప్తిహరులు
మొదల జాడింపఁ దత్సటావళికిఁ జెదరి
యబ్ధివిద్రుమలతలె య ట్లలరెఁ గాని
ససిగఁ దూర్పున సంజకెంజాయ కాదు. ౮

తపనుఁ డదె నీకు జైత్రయాత్రాసమయముఁ
దెలుపఁ ద్వత్ప్రబోధమునకై తివిరి వేచి
యబ్ధిపైఁ దేలి తా నుదయాద్రిచివర
లీనుఁ డమ్యెనుగా కేడఁ గానఁబడఁడు. ౯

---

*అచ్యుతాంతఃపురము = పద్మము — లక్ష్మీనిలయము

పద్మకోశవికాస మేర్పడినయంతఁ
దానె మోదము సెందు నాతమ్మికొలఁకు
అమ్మ ! నీకనుదమ్ముల నట్టె తెఱచి
ముజ్జగమ్ము నామోదాన ముంపవమ్మ. ౧౦

పాండ్యరాజాత్మజా ! సుప్రభాత మస్తు
ప్రథితమధురేశ్వరీ ! సుప్రభాత మస్తు
రమ్యవిధుకులకేతు ! సుప్రాత మస్తు
మాత ! త్రిభువనములకు సుప్రాత మస్తు. ౧౧

మీనలోచన లీరీతి మేలుకొలుప
నవనిపతిపుత్త్రి లేచి కాల్యములఁ దీర్చి
సచివసజ్జితములు తనసైన్యములను
సకలసామంతులను గూడి సాఁగె యాత్ర. ౧౨

మగువవిజయదుందుభినాదమంత్ర మపుడు
భూపకులకర్ణములు సొచ్చిపోయి వారిఁ
గలఁచె, తూపడఁజేసె, బిట్టలయఁజేసె,
వశ మొనర్చెను, విఘటించె, వ్రక్కలించె. ౧౩

పటహరవము యోజనము తాఁ బర్వినంత
దానికిం బదింతలుగఁ బ్రతాప మరిగె
దానికిం బదింతలుగను దరలె కీర్తి
దానికిం బదిమడుఁగులు తారి రరులు. ౧౪

దిక్కులకుఁ బంపఁబడినసందేశహారులు
తిరిగి మంత్రికి వార్త లందికమున్నె
ధరణిపతులెల్ల సుతకళత్రములఁ గూడి
కానుకలు వెట్టి యామెగకటాక్షము గనిరి. ౧౫

క్రొక్కి యుపహారములను మున్ముందుఁ బెట్టి
నిలఁబడి ప్రియోక్తులను జక్కఁ బలుకుచున్న
భూపుల ననుగ్రహించుపూబోఁడి కప్పు
డనుపదము దారిని విలంబ మగుచు నుండె. ౧౬

నాఁడు మలయధ్వజునిపాలనమ్మునందు
దుందుడుకు మీఱఁ బెడదార్లు త్రొక్కికొనియు
నేఁడు నమ్రు లౌనృపుల ననేకగతులఁ
జూపుల ననుగ్రహించు నీసుందరాంగి. ౧౭

జనపదమ్ముల నటనట శరణు పొంది
భూపతు లొసంగుమణిహేమభూషణములు
జనని కందించి యాలోకజనని దెసల
విశదకీర్తులఁ దాను వ్యాపింపఁ జేసె. ౧౮

విజితకాందిశీకులచేత విడువఁబడిన
దుర్గనగరరాష్ట్రములయందునఁ గుమారి
యాప్తులఁ గులక్రమాగతు లైనవారి
నిలిపి తద్వశ మొనరించు మేలఁకువగను. ౧౯

పరువు లెత్తిరి శత్రువుల్ పట్టుబడిరి
అనెడిబీరముల్ తమయోధు లాడుచుండ
కన్య సంగ్రామదర్శనకౌతుకమున
వినియు విననటు తృప్తిని కనదు సుంత. ౨౦

తనదురణభేరిధంధణధ్వనులు వినుచు
నాలుబిడ్డల విడిచి పెల్లడలి తొలఁగు
ధరణిపతులను దెలిసి తత్పదములందు
తత్కుమారుల నిల్పు నాతలిరుబోఁడి. ౨౧

బ్రాహ్మణులయందు రత్నసువర్ణములను
రాజ్యలక్ష్మిని నమ్రులౌ రాజులందు
దశదిశలఁ దనకీర్తిప్రతాపములను
జిమ్ము చారాజతనయ వాసించె మిగుల. ౨౨

భీతపాదానతాకులారాతికాంత
లాత్మపతిపుత్రభిక్షల నడిగి వేఁడ
నామె కరుణాతరంగితాపాంగకలన
బుజ్జగించి యనుగ్రహంబును వెలార్చు. ౨౩

పరమపాషండసాగరాంభఃప్రమగ్న
వేదనిస్తరణార్థ మావిర్భవించి
యాజగన్మాత విజయధ్వజాంతరమునఁ
జెలఁగుచుండె మహామీనచిహ్న మొకఁడు. ౨౪

ఆత్మబలమున నిలిపికొన్నట్టిశత్రు
రాజ్యరమలఁ బోల్ సఖులతో రహిఁ వహించి
పితృపితామహపాలితోర్వీవిభాగ
చిహ్న మగుమంచుకొండ నాచెలియ సేరె. ౨౫

మంచుమలనుండి పుడమికి మలఁగి జాఱి
కనఖలాద్రిని జుట్టుగంగమను గాంచి
యాతటాతక స్వీయజన్మాంతరీయ
సోదరీప్రణయార్ద్రయై చొక్కె నంత. ౨౬

దిఙ్ముఖములు ముట్టినయానదీప్రవాహ
ములను, గని విని యెఱుఁగనిజలచరములఁ
బాండ్యకన్య గాంచుచుఁ జిత్రపటమునందు
బొమ్మ యైపోయె లోన నబ్బురముగొనుచు. ౨౭

పాండ్యరాజసుతాపాదపద్మసేవ
చేత మున్నె పావనము లౌ సేనలకును
తనజలము స్నానపానమాత్రమున కగుట
సిగ్గుపడి గంగ తలక్రిందు సేసికొనియె. ౨౮

అయ్యపారపూరము గలయమరనదిని
గాంచి తా నొకనదిగ సాగరము మాఱి
అంబికాసైన్యమిషమున నాక్షణంబ
గంగగట్టును జేసినకరణి నుండె. ౨౯

నెమ్మి మాయాపురీసమీపమ్మునందు
సచివుఁడు సమస్తసైన్యముఁ జక్క నిలిపి
వితతగంగాతరంగాపహృతసుదృక్త
రంగ యగుతటాతకకు నేర్పడఁగఁ బలికె. ౩౦

జనని! నిర్మలత్వద్దయాసార మనఁగ
భువనపావనత్వద్యశస్స్ఫూర్తి యనఁగ
సుమధురగభీరభవదీయసూక్తి యనఁగ
హరజటాభ్రష్ట నీగంగ నరయుమమ్మ. ౩౧

పాపసింధువు దాఁటించుభవ్యనౌక
త్రిదివపద మెక్క విపులనిశ్శ్రేణిక యిది
భవవిషజ్వాలనంబు నార్పంగ సుధయె
జనులహృత్తమ మణఁచుజ్యోత్స్నాస్రవంతి. ౩౨

కపిలశాపాగ్ని బుగ్గిని గలిసియున్న
సగరసుతులను ద్రిదివ మీజనని చేర్చె
అనవరతము కర్మావనియందె నిలక
మూఁడుపాయలై ముల్లోకములను దేల్చె. ౩౩

అలపురాణవాక్కులు నరహరి యొనర్చు
దేనిసేతుబంధనము నెంతేని చాటు
నాసముద్రము బలిసద్మ మంటుదీని
ప్రక్కల వసించుఁ గుల్యావిభాగమట్లు. ౩౪

అలహిమాద్రిశిలావలయాభిఘాత
విమలజలశీకరాసారవిలసితములు
కనకకేతులక్ష్యములు నై గ్రాలు దేవ
యానముల విరాజిల్లు నీయమృతగంగ. ౩౫

ఈయమయదృష్టమహిమల కేమిగాని
దృష్టములు గూడ కని విని యెఱుఁగనివియె,
ఎంత దెంతయ్యెనో నీవు నంతియెగద
ఇరువురుం గూడి రిచట నిం కేమివలయు ? ౩౬

ఇందనుక భారతావని యెఱుఁగు మమ్మ
త్యాత్మకులపరంపరాగతధరణి యిదియె
స్నాన మొనరించి పావనజలము గలుగు
గంగను మఱింత పూతముగా నొనర్పు. ౩౭

గంగమనుగూర్చి యనినసంగతు లవెల్ల
మంత్రిసత్తమ ! సత్యసమ్మతములె యగు
మనకుఁ గలకీర్తి పాలించికొనుచు నపయ
శమ్ము వారించుకొనుటె యశమ్ము మనకు. ౩౮

కలుషహార మగునీమహాగంగ మునిఁగి
ఆ బలముతోడ నీసాయ మంది నేను
గరుడగంధర్వసురసిద్ధగణనిషేవి
తములు లోకముల్ గెలుతు సైన్యముల వీడి. ౩౯

## తృతీయతరంగము

అంబ ! త్వత్పదభక్తుల కమరలోక
మే కరస్థము ధరణిమా టేల దడవ
సేన యనుజీవిని యటంచుఁ జేర్చినాఁడఁ
గాని యోధులు నీకు రక్షాబలమ్మ ? ౪౦

అటులె కాని మ్మటంచు నాయంబ సకల
బలము సిద్ధ మొనర్పుమం చెలమిఁ బలికి
భవశరీరపరీరంభపావన మగు
స్వర్ణదిని మున్గి పరమపావనత గూర్చె. ౪౧

*వారిరూపుగ బ్రహ్మాభిభవన, మల్ల
శంతనునిసంతు ముంచెత్తి చంపు టనెడి
ఘోరపాపములం దొలంగునటు సేసె
గంగ, కాయమ్మ తాను మునుంగు వెట్టి. ౪౨

ఆయమ సఖీపరీవృత యగుచుఁ దాన
మాచరింపఁగ దిగుచుండ నమరనాగ
కాంత లనుగమించుచు రాజకన్యతోడ
నమితసంతోషమున నోలలాడి రపుడు. ౪౩

ఆతటాతక చెలులు సయ్యాటలందు
మొనసి ఫణికన్యకలకనుల్ మూసినంత
*బధిరు లైరి, వారిని దేవవనిత లరసి
సఖులతో పాటు నగుదు రుత్సాహకలన. ౪౪

---

* వారిరూపముగా ప్రవహించి జహ్నుమునియాశ్రమమును ముంచుట.
* ఫణికాంతలు కన్నులే చెవులుగా కలవారు కాన.

సఖులతోఁ గూడి సంసారసాగరైక
తరణి రాట్సుత యీఁదె నిస్తరణి యగుచు
*మును వితరణిత్వకృత మైనపుణ్యకీర్తి
యామె కీనాఁడు ద్విగుణిత మయ్యె దీన. ౮౫

ఆమెనిశ్వాసపరిమళ మ్మానమఱఁగి
మునిఁగి లేచెడివఱ కట మూఁగికొనుచు
ముసరుభ్రమరావలి యనంగ మునిఁగియున్న
యామె విస్రస్తకబరి తేలాడుచుండె. ౮౬

సఖులతో నిట్లు జలకేళి సలిపి చిరము
నిత్యకర్మకలాపము నెఱపి తేమలి
నౌకలను బూన్చి సేతుబంధన మొనర్చి
భద్రముగ దాఁటె గంగను బాండ్యతనయ. ౮౭

స్నానపానముల్ జాహ్నవిఁ జలిపి సేన
తనకు నాధిక్య మబ్బె నన్ తలఁపు గొనదు
భానురథ మెక్కి యున్నట్టిమానవునకు
నల్పదీపపుఁగాంతి యేమంత ఘనము ? ౮౮

తొండములఁ బీల్చి చిమ్మినతోయ మెంత
తఱిఁగిపోయెనో గంగలోఁ; దిరిగి దాని
ద్విగుణితమ్ముగఁ దీర్చెడివిధము దోఁపఁ
దనగజావళి మదజలమ్మును స్రవించు. ౮౯

---

*వితరణిత్వము = దాతృత; తరణి లేకపోవుట.

హయశతాంగమాతంగయోధానుగమ్య
నూనమై సేతుపథములు మలయఁ దిరిగి
వాహినిం గూడి నక్తందివత్రయమున
అమలగంగానదీపార మందె నామె. ౫౦

బలముల సమాహరించి పర్వతము నెక్క
నిర్ణయ మొనర్చి యొక్క కర్ణీరథమును
సఖులు మోవంగఁ దానిని జక్క నెక్కి
తానునుం బర్వతము నెక్కఁ బూనుకొనియె. ౫౧

ఆమహత్తరవాహిని యనునెపమున
గంగయే కొండ నెక్కంగఁ గడఁగెనొక్కొ
తొల్లి ప్రాస్థానికత్వరతో వచింపఁ
మఱచినది యీశునకుఁ దెల్పుమురువు దోఁప. ౫౨

దేవినయనరశ్ములచే గ్రథింపఁబడుచు
బలము మీఁది కాకర్షింపఁబడుచు నుండ
మంచుమలయందుఁ గల్గునిమ్నములు నున్న
తములు లెక్కింపక రథాశ్వతతులు నడచె. ౫౩

అచటియోషధులను వెజ్జు లమలమణుల
వణిజులు గజమ్ములనుఁ భూపులును గ్రహింప
వైదికు లగుమాబోటిబాపలు గ్రహింతు
రమలగంగాతటోత్థకుశాంకురముల ౫౪

అచట నాముక్తకంచుకమై యధిజ్య
కార్ముకం బయి యున్నద్ధకబర మగుచు
ధూళిధూసరితమనోహరాలక మగు
పరమతత్త్వముఁ గాంచి రా గిరిజనులును. ౫౫

దుర్గమతలాధిరూఢకౌతూహలమున
ధ్వజిని యొనరించుకలకలధ్వనికిఁ బగిలి
కూలుహిమశృంగములు పూడుకొనుచు నుండె
వెంబడిఁ దటాతకాయశోవిభవకలన. ౫౬

యోధకృతభయంకరసింహనాదములకుఁ
గలఁతగొని గుహాశయసింహగణము పర్వ
గర్భశత్రునిరాసము గల్గె నన్న
లాభమున వన్యగజము లుల్లాస మందె. ౫౭

లేఁడిమాంసపుఁగూరలతోడఁ గూడి
వెదురుబియ్యపుఁగూటితో వెన్నతోడ
పుట్టతేనెలతో కొండబోయలిండ్ల
ఆతిథేయముల్ భటు లట నందుకొనిరి. ౫౮

మాకులాధినాథుని నొక్కమానవుండు
ఇచటనే తనధనువుచే నేసినాఁడు
ఇది సువర్ణరంభావనమే మదంబ!
జీర్ణకపి యొక్కఁ డిందు వసించెఁ దొల్లి. ౫౯

క్రూరసింహనిర్దారితకుంభికుంభ
గలితముక్తాఫలంబులఁ గాన్క వెట్టి
అచ్చటికిరాతవరు లందునందుఁ గల్గు
నెలవులం జూపుచుండ్ర దేవిఁ గొలుచుకొనిరి. ౬౦

పుట్టలనుండి పుట్టినవి
పువ్వులుఁ గాయలు గొమ్మ లాకులున్
బుట్టవు పల్క పుల్కవు క
నుంగొన నేరవు, మానవాకృతిన్
బుట్టియు నిశ్వసించని వ
పూర్వపువృక్షము లిందు నుండె నో
పట్టి! కనుంగొనన్ వలతు
వా ? నటకించుచుం దెత్తు మిప్పుడే. ౬౧

మాకులాధిదేవత పితామహియు ముందు
వెనుక లెఱిఁగినతల్లి యంబికయె మాకుఁ
గాంతిచే మాటచే లసత్కరుణచేతఁ
గనులచే నామెవే నీవు జనని! నమ్మ. ౬౨

ఏభుజము నీయెదుట స్పృశియింపఁబడెనో
తద్బలజితుండె నీపతి తప్పదమ్మ
శబరవాక్కులు సత్యాతిసత్యము లగు
జానపదులట్లు మ మ్మెన్నఁబూనకమ్మ. ౬3

# శివలీలార్ణవము

శబరదంపతు లీరీతి చదురు లాడ
సఖులు నగుచుండ నాజగజ్జనని పలికె
మీరు నరపాదపముల నెమ్మిని వహించి
కాంచుచుండు డెన్నఁడు నఱుకంగవలదు. ౬౪

ఆ తటాతకాసేన లత్యాతతముగ
గంగదరిఁ బట్టి నడచి, సింగములుఁ బులులుఁ
గొండచిలువలుఁ గలమంచుఁగొండఁ దాఁటి
కింపురుషవర్షముం జేరి కేరె నంత. ౬౫

వానలును బంట లాయముల్ వ్యయము లిచ్చి
పుచ్చుకొనుటలు లేక యబ్బురము గొలుపు
పురము కింపురుషాఖ్యముఁ బొంది వార
లట కరగ్రహణమున నిరాశు లైరి. ౬౬

కనివిననితరువులు విహంగములు దేవ
కాంతలను మించువనితలుఁ గలిగియున్న
నేని మిక్కిలి సత్వప్రధాన మైన
యచట సైనికుల్ లోభమోహములు గనరు. ౬౭

జడల గూఁడులు కట్టి ప్రశాంతవృత్తి
మెలఁగుఖగకులకలకలమ్ములను విని, ప్ర
పంచమే మఱచినయోగివరులదయను
జూచు చాజగదంబ మెచ్చుచును జరిగె. ౬౮

చిర మత్యుగ్రతపస్సుల న్నెఱపి గాసిం బొంది హంసేంద్రు లే
నిరతిం దత్త్వము నాత్మలందుఁ గనుచున్ నీవారశూకాకృతిన్
గుఱుతుం జెప్పిరొ యద్ది యిప్పుడిచటన్ గోదండముం బూని భా
స్కరకోటిప్రభ మాచు భామినిగ సాక్షాత్కార మయ్యెం దయన్.

మునులు సేనలకలకలమ్మునకు లేచి
దివ్యదృష్టుల సంగతి దెలిసి హరు
మధురఫలకందమూలముల్ మాత కప్పు
డొసఁగ భక్తి భుజించె నబ్బిసరుహాక్షి. ౭౦

వ. పిదప నామె హేమకూటంబును హరివర్షంబును దాని కుత్తరంబుగఁ బ్రాక్పశ్చిమార్ణవతరంగంబులచేఁ గృతాభిషేక యగు నిషధాద్రిని, అటనుండి పశ్చిమంబుగ మేరువును బ్రదక్షిణించి క్రతుస్వరూప మైనమహాకిటిమూర్తికి స్థాన మైనకేతుమాలవర్షంబును, అటనుండి నీలగిరిం జేరి తనకీర్తులచే దానిని ధవళం బొనర్చెను. పిదప హిరణ్యశృంగశ్వేతశృంగగిరులను దాఁటి యుత్తరకురుదేశంబులం గాలు వెట్టి యట నాదిమత్స్యావతారమూర్తికి మ్రొక్కిడెను. అటనుండి యుత్తరసముద్రముం జేరి తనప్రపితామహులయశోరాశులవలె నున్నయందలిఫేనరాశులను దర్శించె; నటనుండి దక్షిణోదధితీరంబులం జేరి యచటిజానపదులు శమధను లై పనసామ్రజంబూప్లక్షాశను లై యుండుకతన కరగ్రహణంబున నిరాశ చెంది యచ్చటిసముద్రమునుండి యుపదలు గ్రహింప నా తటాతకామతల్లి మనసునఁ గాంక్షించి; ౭౧

బాల యీయూహతో ధనుర్బాణములను
బట్టినంతలోపల సరిత్పతియు వణఁకి
తెచ్చి వివిధోపహారముల్ దేవి కొసఁగి
రక్ష వేఁడుచు ననె మహారాజ్ఞితోడ. ౭౨

తామ్రపర్ణి దక్షిణసముద్రమునఁ గలిసె
పూర్వజలనిధి సేరె జంబూనదియును;
రిక్తగర్భుఁడ నానుడుల్ రిత్త లనక
ఆమహామత్స్యమూర్తి నీ వడుగుమమ్మ. ౭౩

మైనాకగిరినుండి తేనయ్యె నీమహా
నాగముల్ వీని మన్ననను గొనుము
అర్యమద్వీపంబునందుండి తెచ్చితి
నీమహామణుల నీ వెంచికొనుము
పశ్చిమసింధుసంబంధంబు లీసంకు
లందుమీా పాంచజన్యమును మించు
క్షీరాబ్ధినుండి తెచ్చితిని క్షీరాశు లీ
యశ్వతల్లజముల నందుమమ్మ
దధిమధుఘృతేక్షుగుడసముద్రములనుండి
తెచ్చి తీమధురసము లందిచ్చుకొంటి
కొమ్మ! యీనవనీతము గొమ్మ జనని!
దీనిరుచి వెన్నదొంగకేఁ దెలియదమ్మ. ౭౪

జనని! చంద్రుఁడు వీఁడె, దాఁపను పనేమి?
యితనికళలలోపల నొక్కఁడే కదమ్మ
యెన్ని ప్రమథాధిపతి కిచ్చియున్న వాఁడ
నిడుదుఁ గానిక; వీని గ్రహింపుమమ్మ! ౭౫

అంద మైనకాంత లచ్చరలుం గలా
రకట! నీదుసఖుల నరసి యరసి
వార లేల యనుచు వదలి వచ్చితిఁ గాని
తప్పు గాఁగ దీనిఁ దలఁపకమ్మ. ౭౬

కామగవియుఁ గల్పకమ్ములు గలవమ్మ
నీకుఁ గానుకవెట్ట నేను బిలువఁ
దలలు వంచె సిగ్గు తలకొని; నీముందు
నిలువఁగలవె? లోకనిలయ! చెపుమ? ౭౭

విమలచింతామణీకౌస్తుభములు గలవు
తల్లి! వానిమించినది రత్నాలమాల
చక్కఁ జేకొమ్మ నీ పెండ్లిసమయమందు
దీని నీతండ్రికానుకఁగఁ బూనుమమ్మ! ౭౮

నీవు సత్యప్రియవు దయానిరత వనుచు
నాశ్రితావనదీక్షాపరాయణ వని
విని చిరాభిగుప్తమ్ములు వీని, నీదు
పాదసన్నిధిని నివాళి పట్టియుంటి. ౭౯

వ. అని వినతుండై పలుకునాతనినుడు లాలించి మంత్రియనుమతితో వానినెల్ల గ్రహించి యమృతాయమానవచనరచనలతో నాతని కాజనని యిట్లనియె. ఓయీ నీవు నాచెలియలికి జనకుండవగుట నాకునుం బితవే. నీ విడినయీహారంబును మజ్జనకుం డిచ్చినటుల పరిగ్రహించితి నని తననయనాంచలచంద్రికలచే నాతని నుపాంగం జేసి యటనుండి పూర్వవర్షంబు సొచ్చి సీతానదిని దాఁటి తత్తటమ్మున దీర్ఘతపం బొనరించునాద్యపురుషుం డైనహయగ్రీవు నమస్కరించి పిదప జంబూనదీప్రభవం బగునిలావృతముం జొచ్చె. సుమతియు నుత్తరకురుదేశసంభవంబులును, జంబూనదీప్రభవంబులును,, మేరుపర్వతోద్భవంబులు నగుచు వర్ణోత్తరంబు లైనబంగరు రాసులను నపూర్వంబులగుట వానిని వేత్వేఱం దెచ్చెను. ౨౦

అచ్చట సువర్ణజలమయు మైననేరె
టేటియందున జలచరకోటియెల్ల
ననవధారిత మగుట హేమాశకలన
రూపములఁబట్టి సేన యేరుకొనె వాని. ౨౧

బంగరుటేటిగట్లఁ బ్రభవం బగునేరెడుచెట్లఁ గాంచి సేనం గలయేనుఁగుల్ మదమునం బ్రతిపక్షగజంబు లంచుఁ దాఁకంగ, స్రవించుతద్రసము క్రమ్మట నానది పొంగి పొర్లి యాచెంగట నున్నసేనలకుఁ జెన్నుగ బంగరుపూత పెట్టెడిన్. ౨౨

తటాతక పరమేశ్వరుని జయించుట

అంతట దేవశైలశిఖరాగ్రచరిష్ణుదిగీశులన్ బలాక్రాంతిని లొంగఁదీయ సమకట్టి దివంబున కుద్యమించి ది

గ్రాభంతిని గొల్పుసేన లమరావతి గ్రక్కదలింప నామహా
కాంత యొనర్చె జన్యము పికాపికలై యరిసేన పర్వఁగన్. ౮౩

రాజు లందఱు యుద్ధపరాఙ్ముఖులుగఁ
జిరనిరుద్ధదోర్మదము రూపఱనికతన
దేవతలతోడియుద్ధ మెంతేని భాగ్య
ఫల మటంచును దనసేన తలఁచె నపుడు. ౮౪

*ఉన్ముఖచరమ్ము లగుచుఁ బరుండియున్న
సురగజమ్ములఁ జూచియుఁ జూడనట్టు
లాతటాతికామత్తమాతంగచయము
పురువులను నల్పినట్లు సల్పుచును నడచె. ౮౫

నాకరణభూమినుండి యానాఁడు భువికి
నోడికలు గట్టి జాఱినవేఁడినెత్తు
రొగి యిలావృతమున లోహితోద మనెడి
సరసుగాఁ బ్రవహించె నందురు జగాన. ౮౬

భువిలో యుద్ధములందుఁ జచ్చిపడుభూపుల్ త్రవ్వితండంబుగా
దివికిం జేరుచుఁ బూర్వవైరములు సందీపింప నీసేనలన్
గవియంగా దవవహ్నిఁ బడ్డమిడుతల్ గా నైరి; నాకౌకసుల్
సవనంపుంబలుతిండికాం డ్రణఁగి రాసల్ దక్కి రుద్వృత్తుగన్. ౮౭

---

*"ఉత్తానావై గావః" అని శ్రుతి.

ఉభయసేనలఁ జచ్చుచు నున్నభటులు
సురలుగా మాఱుచున్ బరస్పరము గూడి
తిరిగి తమతోనె యుద్ధము నెఱపుచుండఁ
జిత్ర మయ్యెఁ దటాతకాసేన కచట. ౮౮

దేవవీరులచేత మంత్రించి విడువఁ
బడినయస్త్రముల్ రథికులపైని బడక
పఱచెడిప్రయోక్తలను మించి పర్వు లిడఁగ
నబ్బురంపడి ప్రేక్షకు లాడుకొనిరి. ౮౯

కాలికి బుద్ధిచెప్పుచుఁ బికాపిక లౌస్వబలమ్ము నాఁపఁగాఁ
జాలక తా బయల్పడెను శక్రుఁడు, తోడనె వానిమీఁదికిన్
దేలికగా శతాంగమును ద్రిప్పెఁ దటాతక, మంత్రి వెంటనే
మూలబలమ్ముతోఁ గదలి మున్నుగఁ దా నయి నిల్చె నుద్ధతిన్.

అని మొనకు దనశతమన్యతను ద్యజించి
యద్భుతసహస్రమన్యత నాశ్రయించు
శక్రునిం గాంచి సుమతికి జయ మటంచు
నాతటాతక భావించె నాత్మలోన. ౯౧

వ. అంత నాసుమతియు తటాతకా జయతి యనుచు నస్త్రశస్త్రములం
బ్రయోగించుచుండ. ౯౨

జంభభేదులు నముచిభంజకము లల్ల
వృత్రబలఘాతుకము లైనయింద్రశరము
లకట! నడుమనె ముక్కలై యవనిఁ బడియె
సుమతి సారించుదివ్యబాణములకలన. ౬౩

హరిహయుఁడుం గ్రియారహితుఁడై నిలువన్ బరసేన లాతనిన్
గుఱిగొని వానిభూషల నకుంఠితతత్కులిశమ్ము లాగి ని
ల్పిరి పరదేవిముం దతఁడు పెల్కుఱి జూపడి యుండ దేవి సా
దరముగఁ గాంచె; నంతటఁ బదంబుల వ్రాలె నతండు దీనుఁడై.

జననీ! మీజనకుండు భీకరమహాసంగ్రామరంగంబులం
దున మాచిక్కుల నెన్నోసార్లు తొలఁచెన్ దోడ్తో ఋణం బీగఁగా
ననువుం గాదు క్షమింపు నాతనువును న్నాకమ్ము నాగమ్ము నం
దనమున్ నామణి ధేనువుల్ గను మివే నాతల్లి! కైకోఁగదే!

ఈవరసేన నీ దనిగ్రహింపక యీసొరవా టొనర్చితిం
గాన క్షమింపు మం చన, నిగారపుఁ బ్రీతిని దేవరాజ! మా
యాన తలం ధరించు శరణాగతరక్ష యె నావ్రతమ్ము నీ
కానుక లందితిన్ సుఖముగా విధినిర్వహణం బొనర్పుమా. ౬౬

సుందరేశ్వరునభిషేకశుభము దీర్పఁ
గామగవియుఁ దదర్చనల్ గడపుకొఱకుఁ
గల్పకములును నాకు నక్కఱకు వచ్చుఁ
బుచ్చు మని చెప్పి ముందుకుఁ బోయె నామె. ౬౭

పాండ్యరాజాత్మజప్రయాణపటహరవము
దుందుభిద్విరదాశ్వయోధులరవమ్ముఁ
దన్ను మండింపఁజేయుచు నున్న నేని
జ్వాలనుఁ దతిశాంతి నందె వాత్సల్యగరిమ. ౯౮

*ఇతఁడు నాతండ్రి తండ్రిపై కేల మంత్రి!
సేనల మఱల్పు మంచు నాచాన పలికి
యరదముం డిగి చాగిలునంతలోన
నచట స్వాహాగ్ను లెనుటఁ బ్రత్యక్షమైరి. ౯౯

పసుపుఁ గాటుక భూషణాంబరము లపుడు
బిడ్డ కందించి వారు నీపెండ్లినాఁడు
సాక్షులుగ మమ్ముఁ బిలుతువే సారసాక్షి!
యనఁ దటాతక నవ్వి ముందునకు నడచె. ౧౦౦

ఓరి! మధురలో నివసించి యుండువారి
కెపుడు గోచరుల్ గాకుఁ డం చెన్నొసార్లు
శమనుఁ డనుటచేఁ దద్భటుల్ జాఱె రెటకో
ఆమెచతురంగసైన్యము నరసినంత. ౧౦౧

మంత్రి సుమతి దర్శనభాగ్యమహిమవలన
నరకవాసులు తరియించినార లపుడె;
భక్తదర్శనభాగ్య మీపాటి దగుట
ఆజనని దైవచలువ యంచనఁగవలదె. ౧౦౨

*అగ్నిజ గాన- వైతానాగ్నినుండి పుట్టినది గాన నతఁడు తండ్రి.

వ. పిదప సపరివారంబుగా దూరదూరమున నిలిచి యాసమవర్తి-

భారత మెల్ల నీదువశవర్తి, తరించిరి నారకుల్ దురా
చారులుఁ బాపులుం గలుగఁజాలరు, నాపని లేదు నాపరీ
వారముతోడ నేనును భవద్బలమందునఁ జేరి సాయమూఁ
నేరుపుతో నొనర్తు జననీ! యనఁగాఁ గరుణించె నంతకున్. ౧౦౪

వ. సుమతియు నోయీ యుద్ధంబులందు మ మ్మెదిరించువారలే గాన
రారు. ఉన్నను వారు స్వర్గమునకే యతిథు లగుదురు. ఎట్లైనను
నీకు విశ్రాంతియేగదా యని నవ్వుచుఁ బలికె. ౧౦౫

వచ్చి నిర్ఋతియు సహపరివారముగను
నమ్ముఁడ నటంచు జననికి నతు లొనర్చె;
శంఖమూ క్తికవిద్రుమమజాలములను
గానుక లిడి వరుణుఁడుఁ దల్లికాళ్ల కెఱగె. ౧౦౬

వ. అట్లాయమ్మ వారిం దయదలంచి వాయువుపై దండెత్తి పోవ
మలయదేశాధిష్ఠితుం డగుసీతఁడు మనవాఁడే గాని పరుండు కాఁ
డని సుమతి వచింప నాతని వీడి ధనదజిగీష నరుగునంత. ౧౦౭

బేహారిరీతి దోఁపఁగఁ గుబేరుఁడు తా నవరత్నరాశుల
న్నోహారిసాహరిం గొని ముహుర్ముహు రానతుఁ డౌచు బత్తితో
నాహారశక్తి పాదముల నంటుచు సన్నిధిసేసి తన్నిధుల్
స్నేహముతో నొసంగె జననీ! శరణంచు రణంబు మానుచున్.

౧౦౮

వ. అమ్మా! శంఖపద్మమకరాద్యష్టనిధులను గొనివచ్చితి. ఉత్తమమైనవరనిధి ముందు నీకు లభింపంగలదు. నడువు మనియె. ౧౦౯

పిదప నీశానుదెస నడిపించి సేన
సింహనాద మొనర్చి గర్జించి యుద్ధ
భేరి పలికించినంతఁ గోపించె నంది
నాదవిదుఁ డౌట నభవుఁ డానంద మందె. ౧౧౦

అంత శిలాదనందనుఁ డహంకృతితో శివు మోకరిల్లి కాలాంతక! పాండ్యరాజసుతయంట తటాతకయంట యామె యావంతయు మమ్ము లెక్కఁగొన కార్భటితో నెదిరింప వచ్చె నాపంతము గింత మూర్ఖుఁ బరిపంధి నణంప ననుజ్ఞయా ప్రభూ!

మానవాధములం బోలి మనెడివారిఁ
దీర్చి నలువురఁ జిల్లర దేవతలను
తగుదునమ్మా యటంచు నీమగువ వచ్చె
సపరివారము దానిపీచ మ్మణంతు. ౧౧౨

అనినఁ దత్త్వ మెఱింగి యాయభవుఁ డంత
నవ్వుచును 'ఆమెపేరు' విన్నాము నీవు
నప్రమత్తతతో నామె నధిగమించి
క్షేమముగ ర మ్మటంచు వచించి యనిపె. ౧౧౩

వ. అతండు వివిధవికృతాకారవికారంబుల భీతింగొలుపుకోటానంగోట్ల ప్రమథులతో మహాట్టహాసం బొనర్చుచుఁ దటాతకాసేనల నెదిరించిన.

వారిని గాంచి యేనుఁగులు వాహనముల్ భటయోధముఖ్యులున్
పాఱఁగఁ గొందఱిం దఱిమిపట్టి చపేటములం బడాహతిన్
బూరితపూత్కృతమ్ముల గుభుల్ గుభు లన్ పిడిగ్రుద్దులన్ హరా
చాహులు గూల్చి నొంచి పెలుచన్ బలుతిప్పలు పెట్టి రుద్ధతిన్.

ధావదశ్వము నవఘూర్ణితద్విపమ్ముఁ
జటులయోధము నవసన్నసైన్యము నయి
మానవబలమ్ము ప్రమథులమర్దనమున
నడలిదిక్కు మొగంబుగ నార్చి పఱచె. ౧౧౬

అడరి సుడిగాలి దీపము నార్పినటులు
ఎండుపొదల దావాగ్ని దహించినటులు
భాస్కరుఁడు ధ్వాంతపటలిని బాపినటులు
హరబలము నరబలమును నణఁచివైచె. ౧౧౭

ఆప్రమథగణదర్శనం బడలు గొలుప
యుద్ధముం జూడ వచ్చినసిద్ధసాధ్య
చారణసుపర్వకిన్నరాప్సరలు భీతిఁ
గలఁగి పర్వెత్తి రెవరి తెన్నులను వారు. ౧౧౮

వ. నరసేన నట్లు తఱిమి గణములతో నంది యెదురు రాఁగా, ౧౧౯

అంత సఖీజనుల్ వ్యచలదాత్తసుకార్ముకబాణహస్తు ల
త్యంత వికుంచితభ్రుకుటు లాదృతకంచుకు లాస్యసుందరుల్
ప్రాంతనిబద్ధకక్ష్యలును నై సనుదేరఁగఁ దద్బలమ్ము తా
సంతస మిచ్చె నాదిమరసద్వయ మీగతి వచ్చెనో యనన్. ౧౨౦

తనను దీటగు నరిసేన పౌనరకునికి
నాహవకుతూహలము వీడినట్టి జనని
తనసఖీసేన చూపునుత్సాహము గని
యపుడు మెలమెల్ల ధనువు సజ్యముగఁ జేసె. ౧౨౧

తమమును భాస్కరాంశులు వితాకొనరించినరీతిఁ దద్విము
క్తము లగునమ్ము లాయరులఁ దార్కొని, పూర్వమె వైకృతస్వరూ
పము లగువారి కబ్బురపువైకృతి గూర్పఁగఁ బర్వి వారలుం
దమప్రభు వైననందికి విధం బెఱిఁగించిరి రక్ష వేఁడుచున్. ౧౨౨

నంది విని మందిపడి యరి
సందోహముపైకి నమ్మసమ్మనఁ గవియన్
మందముగ రాణి, సఖులు న
మందముగా నమ్ము లేసి మార్కొని రతనిన్. ౧౨౩

వ. అంత పాండుసుత ప్రయోగించునమ్ములు నందికిం బ్రాణభయంబుం
గూర్పనివయ్యె. ౧౨౪

ఆతఁడు తటాతకం గనినంత జిహ్వ
అమ్మ! స్వామిని! యంచునే యాడుచుండెఁ
బాణియుగలము నమ్ములఁ బట్టెఁ గాని
యంజలించుటకే సిద్ధమయ్యె నదియు. ౧౨౫

ఎంచి వచించు వేదచయ మిక్షుశరాసన మంచు మించి వా
సించెడిపువ్వుబాణములె చిన్మయి వంచు, న వెంత లాగి సా

రించిన నేమి? యెన్నిటి గణించిన నే మగు? లోకమాత తా
సంచితమాతృహస్తగలితాంబకముల్ పరిపీడ గూర్చునే? ౧౨౬

అంత సర్వజ్ఞుఁ డగునంది యబ్బురపడి
శివుని కెఱిఁగించి యుద్ధవైచిత్రి నెల్ల
సంధియే గాని యుద్ధము సాగ దనిన
చెంగలించెను జిఱునవ్వు శివుని కపుడు. ౧౨౭

వ. అంత వారిరువురుం డటాతకను సమీపింప. ౧౨౮

దక్షిణబాహుస్పందము
సాక్షిగ యుద్ధమును గూర్చి జననికిఁ గలిగెన్
వీక్షింప వృషధ్వజము న
దక్షిణహస్తమ్ము శుభపదమ్ముగ నదరెన్. ౧౨౯

మూర్తి గొన్నయాదిమరసమ్మో యనంగ
నుగ్రతలు లేనియర్యముఁడో యనంగ
నమలశరదిందుసుందరుఁ డై సనంది
యైనశంకరమూర్తి నాయమ్మ చూడ. ౧౩౦

పాణినుండి ధనుస్సు చెప్పకయె జాఱె
మనసు తదుపగూహనమున మగ్నమయ్యె
దేహ మెల్లెడఁ బులకలుఁ దేజరిల్లె
మూఁడవకనుచ మ్మురమ్మున ముడిఁగి యడఁగె. ౧౩౧

ఎవరి నిర్జింపనై ధను వెత్తినదియొ
యతనిఁ జూచినంతనె ధను వట్టి జాటె
దానిఁ జేకొనెఁ దత్కటాక్షానురక్తుఁ
డనరునభిమాని మీనకేతనుఁడు కెరలి. ౧౩౨

తద్విలోకనవివశీకృతతను శివుఁడు,
బాణసంపాతచకితభావమున నంది
యుండ, నాసందు గొని మన్మథుండు గుఱిగఁ
దనశరమ్ములఁ గసి దీర్పఁదలఁచి వైచె. ౧౩౩

ఇయ్యది యమోఘబాణ మం చెఱిఁగి గిరిజ
నీశుచేఁ దొల్లి మరుఁడు జయింపఁబడెను
ఇప్పు డాయమ్మ చేతఁ బెం పెసఁగె యశము,
కాలమే విజయమునకుఁ గారణమ్ము. ౧౩౪

ఆవల యుద్ధమందు ప్రమథాళికి మోహము గూర్చె, సాధ్వసం
బావహిలంగఁ జేసెఁ, బెనుభంగులఁ గంపము గూర్చెఁ గానఁ దా
నేవి యొనర్చెనో యవి నహింపక యిప్పుడు తప్ప వయ్యె హా!
శైవజనాపచారము నిజమ్ముగఁ జేటు ఘటింపకుండునే! ౧౩౫

శంభుఁ గాంచి మన్మథుగాథ చారివలెనె
యధికరుచ మెప్డు లోనికి నణఁగినదియొ
తెలిసి యది మంత్రియున్ ప్రబోధించుకతన
భవుఁడును దటాతకాసమీపమ్ముఁ జేరె. ౧౩౬

అంతట శంభుఁ డత్తరుణియాననపద్మము నెత్తి సిగ్గచే
కాంత ! యదేటికే ? రణముఖమ్మున మమ్ము జయించి తీవనన్
సంతస మంది సిద్ధులును జారణులున్ విబుధుల్ సుమంబులన్
సంతతధారగాఁ గురిసి బాగు బళీ యని యాడి రెంతయున్. ౧౩౭

సకలమును గూడ నీభావసరణి దెలిసె
నైన నేనుగా మీయమ్మ నడుగవలదె !
యనుచు నగుమొగమ్మునఁ బురహరుఁడు నుడువఁ
జతురముగ నట్లె చేయుఁ డం చతివ పలికె. ౧౩౮

రాఁగలదు పుణ్యతిథివాసరమ్ము, నాఁడు
నేను మధురలో నుండెద నీవుఁ గూడ
సిద్ధపడు మఱలు మటంచుఁ జెప్పి శివుఁడు
అంతలోఁ దా నగోచరుం డయ్యె నపుడు. ౧౩౯

అల్లనాఁ డగస్త్యుఁ డన్నాఁడు నీక్షేత్ర
యాత్ర సత్కరగ్రహణఫల మని
తారకాణ యయ్యెఁ దరలుద మన మంత్రి
లోన నవ్వుకొనుచు చాన గదలె. ౧౪౦

శివుఁడు మధురకు చేరుట

సుదతి సఖీసమేతయగుచున్ వరపుష్పక మెక్కి వెంబడిం
గదలెఁ జమూసమూహము లెగంబడి కాల్నడ నేఁగు దేరఁగా
సదనము చేరి తల్లిపదసన్నిధి నంది నితాంతమోదగ
ద్గదవచనోపరుద్ధ యయి కన్నులు చెమ్మగిలంగ మ్రొక్కుచున్.

రాణియు నాతటాతక బిరానఁ గవుంగిటఁ జేర్చి మస్తకా
ఘ్రాణ మొనర్చి తత్సఖులఁ గ్రమతరోక్తుల గారవించి సూ
యాణపువార్త లాసుమతి యల్లనఁ బల్కఁగ నాదరించుచున్
బ్రాణము లిచ్చి యుండఱకు నాయమ మోహము నందియుండఁగన్.

అమ్మ వినవమ్మ సుమతిసాహాయ్యమునను
జయము మన కయ్యె నీసఖీజనులు నన్ను
గనులఁగప్పి పోషించి రీకాన్కలెల్ల
విబుధు లంబుధుల్ సామంతవిభు లొసఁగిరి. ౧౮౩

అనఁగ సుమతియు వాని నాయమకుఁ జూపి
వీని కేమిలే తల్లి! నీబిడ్డ సకల
సురలకున్ భువనములకు వరుఁడు నైన
పరు సమార్జించికొనియె నిబ్బరముతోడ. ౧౮౪

ఫలదీశానవివాహమంగళశుభప్రాంచన్ముఖాంభోజ, ను
త్పలనేత్రాభఁ, గుమారికం గని మహోత్సాహంబు రెట్టింప, నూ
హలకున్ దజ్జనకుండు దోఁచె నపు డాయానందమే దుఃఖమై
కలఁచెం దల్లిమనంబు; సౌఖ్య మది దుఃఖప్రాప్తికే యన్నటుల్.

ఎట్టకేలకు దిట వూని హేమవస్త్ర
క్రమమణులచే నారాత్రికమ్ము జరిపి
ఫాలతలమందు నీశ్వరభస్మచేత
రక్ష నిడెఁ గూఁతునకు శుభారంభముగను. ౧౮౬

సుమతి వలసినసకలవస్తువులు గూర్చి
నిలిపె విడిదెల పెండ్లివారలకు నెలమి
పౌరు లానందమున స్వీయభవనములను
వీథుల నలంకరించిరి వివిధగతుల. ౧౪౭

ప్రమథసురమాతృగణములు బలసి కొలువఁ
దత్పురీసీమ నున్నయుద్యానమందు
కలితసుందరనాథలింగంబునుండి
పరమశివుఁడు మనుష్యరూపమునఁ బుట్టె. ౧౪౮

అంత సుముహూర్త మాసన్న మగుడు సుమతి
యెదురుసన్నాహము లొనర్పఁ గదియునంతఁ
బెండ్లి కగు వేషమును జక్కఁ బెట్టికొనుచు
మధురముగ శంకరుం డేఁగె మధురకపుడు. ౧౪౯

వాసుకి బహూకరించినపాటలమణి
ఘనతరకిరీటకోటిసంఘటిత మగుచు
బాలచంద్రునిచంద్రికాప్రభల నణఁచి
యేఁచి బాలారుణప్రభ లీనుచుండె. ౧౫౦

మారు జగదేకవీరుని మట్టుపెట్టి
భవ్యయశ మందియున్నత్ర్యంబకునికన్ను
అతఁడు చెలరేఁగినంత నాయక్షి సిగ్గు
సోఁకియో యేమొ నేఁడు దించుకొనిపోయె. ౧౫౧

నిర్మలతలోఁ గళంకము నెగడెనేని
దానిఁ దొలఁగింప హరునికిం దరము గాదు
అభవుముఖశశి మృగహీనుఁ డయ్యె ఫాల
తలము మృగనాభిచే లాంఛితమ్ము నయ్యె. ౧౫౨

శివుని చెక్కిళ్ల సొబగు వీక్షించుచున్న
జనులకన్నులకాంతు లచ్చటనె పడుచు
ఆదరోత్కలితమ్ములై యపుడె పుట్టు
నూతనశ్మశ్రుసందోహరీతి నొప్పె. ౧౫౩

అమలముక్తాఫలసుకుండలాంకితమ్ము
అతులమందస్మితమనోహరాధరమ్ము
ముగ్ధసుందరాక్షము హరుమోము గనఁగ
శక్త్రరా లోకక మీనలోచనయె జగతి. ౧౫౪

పసిఁడిచాయలఁ గుంకుమపంకిల మయి
విశ్వమంగళ మగుజగద్విభునిమేన
సొగసు లొలికించుసగాత్మకంచుకము మిగుల
వెలిఁగెఁ దలనెలలోని వెన్నెలవిధాన. ౧౫౫

క్షణవిలంబనమే సైఁపఁజాల ననుచు
పై కుబికివచ్చుమదనతాపంబు లోన
మండి మండి దేహమును గమర్చ ననఁగ
శంభునురమందుఁ గస్తురిచర్చ మెఱసె. ౧౫౬

## తృతీయ తరంగము

వివిధమణిహారచిత్ర మై వెలయుచున్న
చంద్రశేఖరుతను వింద్రచాపయుక్త
సాంధ్యరాగపాటలమేఘశకలమటులు
చూచువారలదృష్టులు చూఱలుగొనె. ౧౫౭

కుతలము వహించుఫణులను గోరి దాల్చు
లాఘవము గన్న శంకరులలితభుజము
మణిమయాంగదకంకణమండనములఁ
బూన వెనుదీయు నని చెప్పఁబోలునొక్కొ ? ౧౫౮

అక్కట ! దిగంబరుఁడు కాంచనాంబరుం డ
దెట్లు లగు నన్నవిస్మయ మేల మనకు ?
తనతనుద్యుతి దశదిశలను సువర్ణ
పూర్ణకాంతులచేఁ బూతపూయుచుండ. ౧౫౯

సేవకవృత్తి నందెలను జేరి వసించి తరించియున్నము
క్త్రావళు లో స్వయంవరమహంబును గాంచెద మన్నయాశ లో
నావహిలంగ శంకర ! దయామయ ! సంసృతి నొక్కసారి మా
కీవె యటంచుఁ గోరినటులే జగదీశుపదంబు లందెడిన్. ౧౬౦

అద్భుతానందమయతను హాద్యమాన
విద్యచేఁ గప్పఁబడియె నీవిమలరూప
మిప్పుడు మణిగణకాంతి నావృతము నయ్యె
ననుచును విషణ్ణులైరి మహర్షులెల్ల. ౧౬౧

ఇట్లలంకృతుఁడైన మహేశు నెదుట
విమలదర్పణమును నిల్పె విబుధరాజు
తత్సములు లేరటన్న వేదములపలుకు
బింబమును జూపి తప్పించు సంబరమున. ౧౬౨

అంత నందియు శివునిపదాబ్జములకు
నతులమణిమయపాదుక లంటి దొడిగె;
ధాత్రు కేశవు లవలఁ జేయూఁత లిడఁగ
భవుఁడు పయనించెను విలాసభాసురముగ. ౧౬౩

అంత మదాలసంపుఁగను లల్లన మూయుచు, నార్చుచుం జెవుల్
దంతములుం గరమ్ముఁ గదలంగను మందగతుల్ పొసంగఁ, గొం
డం తగుకుంజరంబుగ గజాస్యునియాన వృషంబు మారి, యా
పొంతకు రాఁగఁ దూర్పుమలఁ బూషునిరీతి గిరీశుఁ డెక్కెనన్. ౧౬౪

కుంజరము లెక్కి యిరుదలఁ గూడి రపుడు
విధియుఁ గేశవుఁడును మహావిభవ మెసఁగ
ప్రమథులను నందియున్, దేవరాజు సురల,
మొనసి సేవింప మించి మున్ముందు నడువ. ౧౬౫

వందిమాగధులై యోగివరులు శ్రుతులు
స్మృతులు నితిహాసములు సదాశివు భజింపఁ
బ్రమథగణములు విబుధులు బలసి కొలువ
విజయభేరులు ధ్వజములు వెంట నడిచె. ౧౬౬

వ. అంత శచీప్రభృతులతోఁడను మాతృగణములతోఁడను లక్ష్మీసరస్వ
తులు పల్లకుల నెక్కి యనుసరించిరి. ౧౬౭

అతనిశిరస్థుఁడై నతనయర్భకుఁ జూడఁగఁ బూర్ణచంద్రుఁ డా
హితముగ వచ్చెనో యనఁగ వెల్లనిఛత్రముఁ బట్టి; రందు సు
స్థితి గనుతచ్ఛిరమ్ముఁ గనఁ జేరు విధాతృనిహంసమట్లు సు
స్మిత మగుచామరద్వయము నిర్మలమై చలియించె నత్తఱిన్. ౧౬౮

మారాజ్ఞీపతి వచ్చెఁ జూత మని సమ్మానంబుతోఁ బౌరు లే
పారం జిల్కలు కోకిలమ్మలటు పర్వన్ దత్పురంధ్రీమణుల్
దారం జూడఁగ; మన్మథాస్త్రములచందంబై రహించెం; గసిన్
మారుం డీశునిపైకి మూలబలముం బంపించె నా నత్తఱిన్. ౧౬౯

తరుణు లట మేడ లెక్కి క్రిక్కిఱిసి, చేరఁ
జేసికన్నుల నభవు నిరీక్ష సేసి
లాజమౌక్తికములను మెల్లఁగను జల్లు
చుండఁ జనుచుండెఁ బురశాసనుండు శివి. ౧౭౦

శివునిముదలను గుంభసంభవుఁడు శచియు
నమరసుందరులను గూడి యాదిలక్ష్మి
వాణియును రాజమందిరాభ్యంతరమ్ము
చేరఁగాఁ దొత్త రాణి పూజించె వారి. ౧౭౧

వ. అంత నాలక్ష్మీసరస్వతులు కాంచనమాలను జూచి, ౧౭౨

*మాతామహి! మాయంబిక
యేతావున? లోకజనని యెచ్చట? నని వా
రాతురత నడుగఁ బెండిలి
కూఁతుఁ దటాతకను జూపి కొనె నందఱికిన్. ౧౭౩

సీసమాలిక.

లాక్షారసాపూర్ణలలితపదాబ్జముల్
సహజారుణిమకు ముచ్చటలు గొలుప
మణిపాదుకాంచలంబున మౌక్తికావలి
వేదాక్షరములట్లు వ్రేలుచుండ
అరుణకౌసుంభవస్త్రాంతభాస్వత్తను
ద్యుతులు విద్యుత్కాంతి నతకరింప
శింజానమాణిక్యమంజీరశోభలు
మణిమేఖలను గూడియాడుచుండ
కనకకేయూరికాంగదరత్నకమనీయ
భుజలతాద్వయము మెప్పులు తొలంక
స్తనభారనమితమధ్యస్థలీపటబంధ
మైనవళిత్రయి యందగింప
అష్టమీచంద్రరూపాతిశాయిక మైన
యలికస్థలం బొప్పు లొలుకుచుండ
తాటంకయుగల మై గగనోడుపతిమండ
లములు కర్ణముల మేలంబులాడ

*మాతామహి=కాంచనమాల. (తల్లితల్లిగాన ఆసంబోధనము)

కాదంబమంజరీకర్ణపూరమనోహ
రాకారరేఖ యాహ్లాద మెసఁగ
తారకాద్యుతితిరస్కారినాసాభూష
భాసురకిరణసంపదలు పొదల
వదనపద్మసరఃప్రవాసంబు నెఱపుచు
నేత్రమీనములవన్నెలు తొలంక
కుందకుట్మలదంతకోమలస్మితరుచుల్
బింబాధరాన బింబించి వెలుఁగ
పద్మరాగమణిప్రభాపరిభావిక
పోలదర్పణకాంతిజాల మొప్ప
నొప్పుచున్నజగన్మాత నోహొ యనుచు
వాణిలక్ష్ములు తత్పదపద్మములను
క్షణము కన్నులు తెఱచి తత్క్షణము మూసి
ధ్యాన మొనరించి రాత్మచిత్తముల నిలిపి. ౧౭౪

హాగునిశ్శృంగారపూర్ణరసాధిదేవ
తయె యనందగునాతటాతకను గాంచి
లక్ష్మి జగదేకసుందరి లజ్జపడియె
లజ్జపడుట కచ్చర లెంతో లజ్జపడిరి. ౧౭౫

ప్రాకృతపదార్థవాచనప్రవణ మైన
యీమలీమసపదజాల మేర్చి కూర్చి
వర్ణనం జేల యీవరవర్ణిని కని
వాణి తన వైదుషిని మౌనపరతఁ దెలిపె. ౧౭౬

శివలీలార్ణవము

తన కౌకసారి వేగనలు దాఁపుర మైనఁ దదద్భుతాకృతిం
గనఁ దర మౌ నటంచు శచి కాంక్ష యొనర్చియు గౌతమర్షిపై
చన విడఁగా నహల్య యిడు శాపము నన్నును సోఁకేనేని నా
జని తరియించు నంచును నిజంబుగఁ గాంక్ష యొనర్చె నత్తఱిన్.

పారిషదులు సురల్ చుట్టు బలిసి కొలువ
బ్రహ్మ హరియుఁ గరావలంబన మొసంగ
ద్విరదమునునుండి దిగుచు నా పెండ్లికొడుకు
దివ్యసౌధము రాజమందిరము సేరె. ౧౭౮

సద్యోజాతు నగస్త్యుఁడు
పాద్యాదులఁ బూజ సలిపి పరశివకరుణా
విద్యోతితార్ద్రదృష్టుల
సద్యఃపావనత నంది సంతోషించెఁ. ౧౭౯

అపుడు శుద్ధాంతకాంత లత్యాదరమున
కలిసి లాజల దోసిళ్ల కొలఁదిఁ జల్ల
వరునితలపయిఁ గలయభ్రవాహినీత
రంగశీకరోత్కరమట్లు రహి వహించె. ౧౮౦

అంతఃప్రతిహారభూమియం దడుగు నిడిన
యిందుశేఖరునకుఁ బాద్య మిమ్మటంచుఁ
జేరి కాంచనమాల లక్ష్మికిని జెప్పి
పంపఁగఁ బయస్సుచే నామె పాద్య మిడియె. ౧౮౧

శచియు సురవనితలుఁ దోడ సాఁగుచుండ
వాణియుఁ బ్రదీపహస్తయై వామదేవుఁ
జుట్టి ముందుండి మార్గము సూపుచుండ
హరుఁడు మెల్లఁగఁ బెండ్లిపందిరిని జేరె. ౧౮౨

నలుదెసలఁ బవడపుఁగంబముల వహించి
గరుడపచ్చల పటువిటంకముల నొప్పి
వేలుముత్యాలపసతోరణాల నొప్పు
క్రమకల్యాణవేది శంకరుఁడు చేరె. ౧౮౩

భేరీభాంకరణమ్ము దిక్కరుల స్తంభింపంగఁ జేయన్ జయ
ప్రారంభంబుగఁ దూర్యశబ్దములు మిన్నంటన్ మహోహ్లాద మే
పారన్ బెండిలిచుట్టపక్కములు నాయల్లుం బ్రశంసింప, వే
దారంభంబుల మౌను లార్వ నట నాదబ్రహ్మ మయ్యెం గడున్.

తటాతకాశంకరుల వివాహము

నేమంబొప్ప నగస్త్యమౌనియు 'మమాజ్ఞే' సెప్ప యోగుల్ మునుల్
తామై సత్క్రమవృత్తి వెన్కన నుదాత్తప్రక్రియన్ శంకర
స్వామిన్ సుస్థితుఁ జేసి పీఠమున బాపల్ సేసలన్ జల్ల నా
శ్రీ మించెన్ గనుపండువై కుసుమవృష్టింబోలె నప్పట్టునన్. ౧౮౪

పిదప లక్ష్మీసరస్వతుల్ పెండ్లికూఁతుఁ
దెచ్చి వరుచెంతఁ జేర్చిరి; తేజ మొలుక
బ్రహ్మయు 'ఫలం మనోరథఫల' మటంచు
నాడుచు ఫలప్రదానము లందుకొనియె. ౧౮౬

కాళ్లు గడిగి కన్యకన్ ధారవోయంగ
హరి విరించియాన ననుసరించి
యట రమాసమేతుఁడై కన్నెదరి చేరెఁ
గాంచనాంబికయును గలిసి మెలఁగ. ౧౫౭

బ్రహ్మ యధ్వర్యువై మంత్రపఠన సలుప
శ్రీకరావర్జితజలమ్ము చేత శివుని
యంఘ్రులను క్షాలన మొనర్చి యర్ఘ్య చేసెఁ
బుండరీకాక్షుఁ డానందపూర్ణుఁ డగుచు. ౧౫౮

పరమపద మైనయామె నాహరి సమస్త
రాజ్యలక్ష్మి దక్షిణగ నిర్ణయ మొనర్చి
పరుఁడు కవిశేఖరుం డగువరునికొఱకు
ధారవోసెను భక్తితాత్పర్యగరిమ. ౧౫౯

ఇచ్చి పుచ్చుకొనెడివారి కెట్టిగోత్ర
మేపితృపితామహుండు లేక యొసఁగుకతన
"సుందరేశాయ తుభ్య మిమాం దదామి"
అనెడి యద్భుతమంత్రమే యయ్యె నచట. ౧౬౦

పాలకులనుండి యష్టదిక్పతులనుండి
కరము చేకొనినట్టి యాకన్నెకరము
కొంటి; చతురుఁడవయ్య ముక్కంటి యనుచు
దేవుఁ గని మేలమాడె వాగ్దేవి యపుడు. ౧౬౧

## తృతీయతరంగము

ఆవధూలాజహోమాంజలి నాదృతి
నాశ్రయించువిధాన హరుఁడు పట్టె
అశ్మరోపణవిధానార్థమై తత్పద
మనునయించువిధాన హరుఁడు పట్టె
తొడరి బ్రహ్మగ్రంధితో, నంగుళులు కూర్చి
వధువుతో నగ్ని నావరుఁడు సుట్టె
కర్మబద్ధుల మన్నకరణి మెలంగనై
శేషహోమాది నాశివుఁడు కడపె

మునులు బ్రహ్మర్షులును యోగిపుంగవులును
ససిగఁ జెప్పిరి ఋగ్యజుస్సామములను
విప్రసత్కారములను గావించి లోని
భవనముం జేర్చె రాసతీపతుల నెలమి. ౧౯౨

అట పరార్ధ్యమంచమ్ముపై నధివసించి
సిగ్గుచేఁ దల వంచినచిగురుబోఁడి
ననునయించుచు నామెతామ్రాధరోష్ఠ
తరలనేత్రాననము నెత్తి హరుఁడు పలికె. ౧౯౩

ఈస్వర్ణవలయమ్ము లెంతసొంపును నింపు
నెవరు కాన్కలు వెట్టిరే మృగాక్షి !
ఈతారహారమ్ము లెన్నినిగ్గులు చిమ్ము
నెవరు కాన్కలు వెట్టిరే వధూటి !

౧౯౪

ఈకర్ణభూష లవెంతయందము చిందు
నెవరు కాన్కలు వెట్టిరే చిరంటి !
ఈయంగదము లెంతయింపు నొల్కించునే
యెవరు కాన్కలు వెట్టిరే సుగాత్రి !

యనుచు జిజ్ఞాసతోడఁ దా నాడునటులు
దరికి జరిగి ప్రత్యంగముఁ దాఁకుచున్న
గిరిశునకుఁ జిఱునవ్వె యుత్తరము గాఁగ
సాతటాతక మోమెత్తి యాడ దయ్యె. ౧౯౪

పాణిగృహీతి యానొక్కో నిబద్ధిగ మీయమ నీదుతండ్రికిన్
పాణిగృహీతయా ? యని కపర్దియుఁ గోపము పుట్ట నాడఁ బూ
బోణియు భ్రూకుటిన్ విఱిచి మోమును వంచి కలంగి మానని
ద్రాణదృగంచలంబుననె దానికి నుత్తర మిచ్చె గోముఁగన్. ౧౯౫

ఆమెహాసమానాదుల కలరి శివుఁడు
నర్మపరుఁ డయి యుండ నానందవశత;
వంటలును వార్పు లైన వన్ వార్త దెలుపఁ
బిలువవచ్చిరి పెండ్లివారలును సఖులు. ౧౯౬

శంకరాజ్ఞను బెండ్లిభోజన మొనర్ప
వచ్చిన మహర్షి బాడబప్రకరములను
ఎక్కడెక్కడివారల నెన్ని సుమతి
భక్తితోఁ బిల్చి సన్నాహపఱుచుచుండె. ౧౯౭

పతంజలికై రజతసభలో శివుని నాట్యము

శివునినాట్యముఁ జూడ కంబువులనేని
ముట్ట నొల్లనివ్యాఘ్రపాన్మునియు నాప
తంజలియును దద్దర్శనతత్పరు లయి
హేమసభఁ జేరుకొనుట కూహించికొనిరి. ౧౯౯

వ. ఆమహర్షివరులనిర్ణయం బెఱింగి సుందరపాండ్యదేవుఁ డా మహా
యోగుల రావించి వారిపాదము లంటి సవినయంబుగ నిట్లనియె.

కాంచనసదస్సులో సిద్ధగణనిషేవ్య
మానుఁ డగునాసభానటుమాదరిగనె
రూఢిహాలాస్యనాథుఁ డీరూప్యసభను
బొంది ముచ్చటగా నృత్యమును వెలార్చు. ౨౦౦

వ. కానఁ దాము చిదంబరమున కిపుడు వేఁగం బనిలేదు. తరుణేందుశేఖ
రుని మధ్యాహ్నకాలనృత్య మిచటనే దర్శించి శీఘ్రముగఁ బ్రాణా
హుతులకు విచ్చేయవలయు ననిన నావాశుపతులు సంతసించి
యచటి కనకపుష్కరిణియందు మునిఁగి కర్మకలాపంబులు నెఱపి
రౌప్యసభ కేఁగినంతనే. ౨౦౧

అంతర్హితమ్ముగా నమరించికొన్నట్టి
మహితబ్రహ్మకపాలమాలతోడ
అవతంసమాణిక్య మై వెల్గుచంద్రక
లాబద్ధపృథుకపర్దమ్ముతోడ

శ్రీరాబ్ధితరఁగవాసిని మించి డాకాల
    శేషాహిశటకపుఁజెలువుతోడ
సర్వోపనిషదర్థసారధ్వనులు నింపు
    కమ్రమృగాంకితకరముతోడ
భసితసర్వాంగరాగసంవాసితముగ
అలికనేత్ర మఱ కస్తురితిలక మొప్ప
హారకంకణసర్పవిహారి యగుచు
నానటేశుఁడు సభలోని కడుగు వెట్టె. ౨౦౨

ఎంచి మురదానవుని సంహరించినట్టి
దేవుఁడే నేఁడు మురజముఁ దివిరి పట్టె;
తాలము నిషిద్ధ మన్నవిధాత నేఁడు
తాలముం బట్టి నిలిచె నుత్సాహ మొలయ. ౨౦౩

పాండ్యసుత లభించిన దన్నపరవశతను
దా నటింప నుత్సుకతను దాల్చియున్న
భవుఁడు భక్తానుకంపనెపమ్ము వెట్టి
యచట నర్తించె లోకమోహనము గాఁగ. ౨౦౪

కోమలాతోద్యగీతానుగుణము గాఁగ
రమ్యభావపూర్ణరసోత్తరంగముగను
రాజితావర్తగలితాంగరాగముగను
అంగహారనృత్తమ్ము నాహరుఁ డొనర్చె. ౨౦౫

అభవుపదము స్థితావర్తకాఖ్యనృత్త
మం దుదంచితమై చిర మమరు టరయ
లక్క వలెఁ గరఁగినమునీంద్రహృదయముల
లగ్న మైనట్లుగాఁ గదలక యెసంగ. ౨౦౬

శివనాట్యచలితమంజీరనాదమ్ములే
ప్రణవోపదేశమై పరిఢవిల్లె
శర్వనాట్యాంతనిశ్వాసజాలమ్ములే
ఆగమకోటియై యవతరించె
భూషాభుజంగేశుఫూత్కారములె మహా
వ్యాహృతు లగుచు నుర్వరను మించె
తననృత్యమున రమ్యతరచేష్టలే నాట్య
శాస్త్రప్రభేదప్రశస్తి గాంచె
కలితనృత్తావసానఢక్కానినాద
చయమె శివసూత్రజాలవిస్తార మయ్యె
నలికలోచను సర్వాంగగలితభస్మ
చయమె విబుధులకు శివప్రసాద మయ్యె. ౨౦౭

శర్వానందనృత్తావసానమందు
నశ్రురోమాంచవృత్తితో నఖిలజగము
చకితమై మూఢమై మహాశ్చర్యవశత
బొమ్మలో వ్రాసిపెట్టినపోల్కి నుండె. ౨౦౮

కొమరుగఁ బార్వతీకుచదుకూలముచేఁ బరిమృష్టఘర్మమై
యమలినమూర్ధచంద్రకళ లావనశోభను దీర్చి దిద్దఁగా
నమరుమహేశునర్తనసమాప్తమనోహరదివ్యదేహమున్
దమిని మహామునుల్ సురలు ధ్యాన మొనర్చి నుతించి రత్తఱిన్.

చంద్రశేఖర ! నమ్ములయందు సతము
వెన్నవంటిది నీచిత్త; మెన్న దాని
కన్న మెత్తనినీపదకంజములను
గష్టపెట్టితి మాకొఱకై మహేశ ! ౨౧౦

అభవ ! నీదునృత్త మాఁపివై చినఁగాని
త్వద్గతములు మాదుస్వాంతములును
నపసి యిప్పటికిని నర్తింప మానవు
స్వీయప్రతిభ లెల్లఁ జెడెను సామి ! ౨౧౧

వ. పరమేశా! లోకహితార్థం బీ విట్లు హేమసభలోవలె నీరాప్యసభ యందును నిత్యము నృత్తం బొనర్పు మనఁగా నాతఁ డట్ల యని యనుగ్రహించి యనన్యలభ్యశివజ్ఞానంబు వారల కొసంగె. ౨౧౨

తదను, మునులను బ్రాహ్మణోత్తములనెల్ల
నర్ఘ్యపాద్యాసనాదుల నాదరించి
భోజనంబులు పెట్టె రబ్బురము గొలుప
భక్ష్యభోజ్యలేహ్యాదిసంభరితముగను. ౨౧౩

అచటివిందున వివిధపదార్థజాల
మరసి విస్మయమంది సుధాశులెల్ల
దైవవంచితజాతిగాఁ దలఁచి, తమ్ముఁ
దామె నిందించుకొనిరి చిత్తమ్ములందు. ౨౧౪

దీనిపే రేమి? దీనిని దినుట యెటులు?
దీనిరుచి యెట్టి? దిటు లున్న దే యిదేమి?
యనుచు నప్పదార్థముల వ్రేలంటి యడుగు
నాకులను గాంచి మానవుల్ నవ్వుకొనిరి. ౨౧౫

తమతపఃఫల మైనసుధాశనతను
అమరులే తిట్ట వినుచు; వాతాంబుపర్ణ
భక్షు లగుమౌను లావ్రతప్రతతి నుడిగి
విందుభోజనములను గావించి రపుడు. ౨౧౬

అమితజిహ్వోదరాస్యహస్తములు గలుగు
ప్రమథులను గాంచి యచటిసర్వప్రజలును
అమితమధురపదార్థమ్ము లారగింప
వారిరూపములను దాము గోరి రపుడు. ౨౧౭

అన్నభుక్తిచే నపుడు సమస్తజగము
తృప్తి నొందుట గాంచి గిరీశుఁ డెలమి
మంగళధ్వను లెసఁగ నెమ్మదిగ భుక్తి
వేదికను జేరె వధువుతో విశ్వమూర్తి. ౨౧౮

వ. వాణీహిరణ్యగర్భులును లక్ష్మీనారాయణులును, శచీపురందరులును మహాదేవుముందుగను, హేరంబతండు శక్తిధరులు పార్శ్వములందును గూర్చుండి రప్పాడు. ౨౧౯

బహువిధములైన శుచియైన పక్వమైన
పూర్ణరుచిరాన్నముల నన్నపూర్ణ యిడఁగ
నర్మభాషల నవ్వించి నవ్వుకొనుచుఁ
బత్నితోఁ గూడి భవుఁడు సాపడఁ దలంచి. ౨౨౦

భుక్తశేషకబలమున్ శివుఁడామెకు
మొదట మంత్రపూర్వముగ నొసంగె
వసుధ నాఁటినుండి పతిభుక్తశేషము
తినుట గలిగెనేమొ జనులకెల్ల. ౨౨౧

*పక్వమైనయీమాన్మథఫలము నేఁడు
క్రొత్తయల్లునికే తగుఁ గొనఁగ ననుచు
హరి పలుక; మాధవానుగ్రహమ్ము కతనఁ
బొందితి నటంచుఁ బలికెఁ దా నిందుమౌళి. ౨౨౨

బింబఫల మిష్ట మయ్యది పెట్టకుండఁ
బెరఫలంబు లివేల యీవరుని కిడితి;
దీనిచే శంకరునిదప్పి తీఱునోటు?
అనుచు వాణియు వధువుతో ననె మృదూక్తి. ౨౨౩

* మాన్మథఫలము = మారేడుపండు; స్తనము- మాధవ = వసంతుఁడు; విష్ణుఁడు.

నర్మకథలతోఁ దద్భోజన మ్మొనర్చి
స్నేహితుల వీడి విశ్రాంతి చెందఁ దలఁచి
యాతటాతకాశయ్యాగృహంబు సేరెఁ
బాదచారియై సుందరపాండ్యవిభుఁడు. ౨౨౪

అప్పుడు పాచకోత్తము లనంతపదార్థము లన్నరాశులున్
బప్పులు పిండివంటలు నపారముగా మిగులంగఁ గాంచి యీ
కుప్పల నేమి సేయు టని కొంచక కాంచనమాలతోడ నా
యొప్పులు చెప్పి వీనివినియోగము సెప్పు మనంగ నా మెయున్.

వ. తనముద్దుఁగూఁతుం గాంచి యి ట్లనియె. ౨౨౬

కోట్లకొలఁది దేవతలును గోట్లకొలఁది
ప్రమథగణము లటన్నప్రవాదము గద !
తిన్నవారలు తిన, వండియున్న దెల్ల
వండిన ట్లుండెను బదార్థభార మెల్ల. ౨౨౭

దానిని గ్రహించి యాతటాతకయు శివుని
చెవిని వేయంగ; నే నేమిచేయఁగలను ?
నీవె ముల్లోకములకు రాణివి, త్వదీయ
చిత్త మెట్టులో యట్టులే చేయవచ్చు. ౨౨౮

కుండోదరభోజనము

ఐన నొకమాట; నా సేవలందుఁ దగిలి
తినుటకే వీలు కుదురక తిరిగ నితఁడు
పేరు కుండోదరుండు మప్పిదముతోడ
వీనికిన్ భుక్తి కడుపారఁ బెట్టవలయు. ౨౨౯

అనుచు నన్నసమృద్ధిగర్వాతిశయము
రాజపత్ని కణంప ధూర్జటి దలంచి
పూని త్రిజగచ్ఛరీరవైశ్వానరాత్ముఁ
డగుచుఁ గుండోదరునికుక్షి నధివసించె. ౨౩౦

ఆదర మొప్ప భోజనగృహంబున విస్తరి వెట్టి వారు కుం
డోదరు నొద్దపాద్యులకు నొప్పుగ వడ్డన సేయ నాతఁడా
యోదనభక్ష్యభోజ్యముల నొక్కఁడె యాహుతిగాఁగ మ్రింగి వే
లూది మొగందిగం గనుచునుండెను రెండవయాహుతిం గొనన్.

వానివైఖరి పసిపట్టి వంటవారు
వండినపదార్థములను గంపలకు నెత్తి
వానిముం దిడ నన్నిటి వడిగఁ గలిపి
తీర్చెను ద్వితీయప్రాణాహుతిని నతండు. ౨౩౧

వ. వానిం గాంచి మంత్రియుం గాంచనమాలయు వంటవారి నుద్బో
ధింప వారందఱును, ౨౩౩

నడుములు గట్టి వడ్డనజనంబులు చేటలఁ బల్లియంబులన్
గుడుములు బూరె లావడలుఁ గూరలు బజ్జులు నోదనంబులున్
బడిబడి గుమ్మరింపఁ బరిపాటిగ నాహుతిపంచకంబుగాఁ
గుడిచి సమస్తమున్ క్షుధ రగుల్కొనెఁ బెట్టుఁడు పెట్టుఁడం చొగిన్.

ఆఁకలి కాఁగలేక యతఁడన్నగృహంబును జేరి యచ్చటన్
బోకలఁ బోసియున్న మధుపూర్ణము లైనపదార్థజాలముల్
జేకొని యొక్కముద్దగ రచించి గుటుక్కున మ్రింగి యయ్యయో
యాఁకలి దాహమంచును మహార్తిని దూలెను ద్రుళ్లిపాడుచున్.

వానిచర్యలు గాంచి యావంటవారు
పర్వు లెత్తిరి కాంచనాంబయు సుమతియు
"విస్తు" వోవుచుఁ గామగవిఁ సుకల్ప
కమ్ములను గోరి రతనియాఁకలిని దీర్ప. ౨౩౭

కల్పకకామధేనువులు గ్రక్కున వచ్చి సమస్తధాన్యముల్
పొల్పగుసత్పదార్థములు ప్రోవులు ప్రోవులుగా సృజింప న
త్యల్పము లంచు వీడియమునట్టులు చర్వణ చేసి యయ్యెడన్
దల్పులు భాండకుడ్యవివిధార్థములన్ దిగమ్రింగుచుండఁగన్.

దేవియుం జేటికలు భయోద్రిక్త లగుచు
వానిచేష్టల కడలెత్తి వడిగఁ బర్వ
దానిఁ గడకంటఁ జూచుచుఁ దనకుఁ దానె
నవ్వుకొనె దేవదేవుఁడు నర్మగతిని. ౨౩౮

వ. అప్పుడాసంగతి తటాతక విని యటకుఁ జివాలున వాలి. ౨౩౯

కడఁక నక్షయ మగునన్నగర్త మపుడు
రక్తితో నిడె నాపాండ్యరాజతనయ
మూఁడుముద్దలలో దానిఁ బూర్తి చేసి
యాఁడ్చి వేయుచుఁ బదరి కుండోదరుండు. ౨౪౦

కడుపు సగసగమే నిండెఁ గన్నతల్లి !
మిగిలినసగమ్ము నీట నింపఁగలవాఁడ
జలము పోయింపు మని పాండ్యజాత నడుగ
నామె చిత్తమ్ములోన గంగమును దలఁచె. ౨౪౧

అంతఁ బరవళ్లు ద్రొక్కుచు నరుగుదెంచు
మేటిమిన్నేటి నిసుములే మిగులునట్లు
లల్లగంగాధరుండు పెల్లదరిపడఁగ
నుదరి యాపోశనించెఁ గుండోదరుండు. ౨౮౨

గౌరి సిగ్గిలి యంత శంకరుని దరిసి
యెఱుఁగఁజాలక మీశక్తి యెగ్గులంటి
వీనిదప్పిని దీర్చి పంపించి యిపుడు
మాకులప్రతిష్ఠల నిల్పుమా మహాత్మ! ౨౮౩

దేవి! నీమాట చెల్లింపఁ దివిరి లోన
నెంచి యీవ్యాజ మొకఁడు కల్పించినాఁడ
వట్టి దదియెల్ల; నీప్రభావంబుకతన
నావియద్గంగ తొంటియ ట్లమరుఁగాక. ౨౮౪

వేగముగ వచ్చి యిచ్చట నెలయుకతన
వేగవతి యగుఁ గాక యావిమలగంగ
యని యనునయించి తద్రాజ్య మంది మధురఁ
బాలన మొనర్చె సుందరపాండ్యవిభుఁడు. ౨౮౫

వ. పిమ్మట దేవర్షిగణములచేఁ బాండ్యరాజ్యాభిషిక్తుఁడై యాపరమ
శివుఁడు రాజ్ఞితోఁ గలిసి ప్రజానురంజకంబుగఁ బరిపాలించె. ౨౮౬

# తృతీయతరంగము

## సప్తసాగరానయనము - స్వర్గస్థకులశేఖరదర్శనము

అవల ననంతనై భవసమన్వితుఁ డౌచుఁ దటాతకాసతిన్
దవిలియుఁ బాండ్యరాజ్యము ముదంబున నేలుచు సుందరేశుఁ డా
ర్జవమున శత్రుభూపతిసిరాస మొనర్చుచు నాహిమాచలం
బవధిగ నేలె మాట కెదు రన్నది లేక మహీతలంబునున్. ౨౪౭

అంబుధిద్వీపదుర్గశైలాటవులను
వర్తిలు ననంత, తనభుజకీర్తి కొనను
రత్న మైయుండ నాభూమి రహి వహింప
నతనిబాహువునకు భార మగుట కల్ల. ౨౪౮

వేనవేలభూపతుల వేవేల తెల్ల
గొడుగునీడల సంతాపపడినపుడమి
ప్రీతి సుందరేశ్వరుని యేకాతపత్ర
మందు నెలకొని నేఁడు ప్రహృష్ట యయ్యె. ౨౪౯

బాల్యమున విద్య లేనియర్భకులుమాత్ర
మతనిరాజ్యాన నివసింప నయ్యెఁ గాని
లే రయజ్వ లధార్మికుల్ లే రనాత్మ
విదు లదాతలు నైనట్టివిప్రవరులు. ౨౫౦

నాలు గాశ్రమధర్మముల్ నాల్గు వర్ణ
ములును నాలుగు పురుషార్థములును నాల్గు
వేదములు సుస్థిరమ్ములై వెలయుకతన
నాల్గుపాదాల ధర్మము నడుచు నచట. ౨౫౧

శివలీలార్ణవము

వెండిబంగారములు వస్త్రవితతి నగలు
ధాన్యములు గోవు లీమహాస్థానమందు
మొదటిసామిని విప్రలబ్ధునిగఁ జేసి
విప్రలబ్ధము లై తాము వెలసె నచట. ౨౫౨

లక్షలయుగాలనుండి కైలాసశిఖరి
నేలుచున్నను భిక్షాకపాలములనె
యెవనికోశము సూచించు నిప్పు డతఁడు
పాండ్యరాజుగ సిరుల సంపదలఁ బొదలె. ౨౫౩

శైవవైష్ణవశాక్తేయసాంఖ్యవిదులు
తత్త్వపరులు యోగులు పెడదార్లఁ బట్టి
చివరి కాశివతత్త్వముం జేరినటులు
వివిధవిస్తృతకీర్తు లావిభుని గలిసె. ౨౫౪

స్వానవవినిర్గతపవిత్రశబ్దచయమె
వేదములు గాఁగ; నందు వైవిధ్య మొదవి
శాఖలు ననంత మగు ననుజంకువలన
నతఁడు మితభాషి యగుచు జాగృతి వహించు. ౨౫౫

పంచకోశములతోఁ బ్రబలుజగన్నేత
చాల రత్నాదికోశముల నిలిపె
జ్యోతి, ఆత్మ యనుశ్రుత్యుక్తభాషలకంటె
పాండ్యరా జల్లుఁ డఁ ప్రతిభ కలరె

ఆత్మేశ్వరుం డనునాఖ్య నందినవాఁడు
మీనాక్షిప్రియుఁ డన మిగిలి వెలిఁగెఁ
దివిరి కట్టడల కతీతుఁ డన్ పురుషుండు
తొలి తటాతకకట్టడలను నిలిచె
నమ్రము లగువారు ద్వేషించి నవయువార
లెల్లఁ దనలోనఁ గలియఁగా నెల్లప్రజలు
ద్రమిడపాలకుఁ డితఁడు పాండ్యాధినేత
యితఁడు మీనాక్షిపతి యన నెసఁగు నిపుడు. ౨౪౬

స్ఫాటికాద్రిసానువుల విస్తరిలినట్టి
సూర్యకిరణాళివోలె నీసుందరేశు
లోన మీనాక్షిపరిపాలనానిదాన
శక్తి విస్తరిల్లుచు సదా సంక్రమించె. ౨౪౭

అతఁడు పరిపాలకుం డయి యనవరతము
ధర్మమార్గము నావంత దప్పఁబోక
ప్రజలనెల్ల స్వధర్మతత్పరులఁ జేసి
యంతకు స్వధర్మశూన్యుఁగా నలవరించె. ౨౪౮

ఇట్లు ద్రమిడదేశ మేలుచు నుండఁగాఁ
దల్లివాంఛ దెలుపఁ దలఁచి రాణి
సకలతీర్థయాత్ర సలిపెడికోర్కి మా
యమ్మ కిపుడు గలిగె ననియెఁ బతికి. ౨౪౯

వాంఛ విని సుందరేశ్వరస్వామి యపుడు
సప్తసాగరములను సచ్చటికిఁ బిలువ
మూర్తిమంతము లగుచు నప్పుడె యవెల్ల
వెల్లిగొలుపుచు నెదుట నావిర్భవించె. ౨౬౦

వ్యోమమునం దదాటుగను జొంగి చెలంగు ప్రవాహపంక్తిపై
దీమముతోడ మేఘములతీరులు నాఁచుగఁ దోఁప విద్యు
ద్దామలతావితానము లుదగ్రత విద్రుమవల్లులట్లుగా
నామహితాబ్ధులెల్లఁ గలయన్ బరవళ్లులు ద్రొక్కె నయ్యెడన్.

తూర్పుదెసను దటాకమందునను వీరు
కలిసి యుండఁ డటంచు నాజ్ఞలను బెట్ట
నంత సంక్షిప్తరూపము లంది జలధు
లాతటాకములో లీన మయ్యె నపుడు. ౨౬౨

వ్యోమకేశుఁడు తొలియుగంబునను నభ
గంగగంగనె యభిషేకకలన మందె
క్షీరదధ్యాదికముల విశేషముగను
నేఁడు రెండవయభిషేక మాడఁగలిగె. ౨౬౩

ఆకసమునం దలభ్యము లైనపాలు
పెరుగు నేయియుఁ దేనెయుఁ గలవుతీఱఁ
ద్రావవచ్చినవిబుధవర్గమ్ము లాప్ర
వాహములఁ గీటకములట్లు పడి మునిఁగిరి. ౨౬౪

## తృతీయతరంగము

శౌర్యధైర్యగాంభీర్యాదిసద్గుణముల
నడఁప మాధ్య మొకండె పాల్పడినయట్లు
లేదుసంద్రము లొక్కచోఁ గూడినప్పు
డడఁచె క్షారోదకమ్ము క్షీరాదిగుణము. ౨౬౫

సర్వరసగంధసంపర్కసహిత మైన
జలమునం దిట స్నానము సలిపినంత
బ్రహ్మభావము గనఁగ "యంబ్రహ్మ" లగుచు
న్యాయవిదు లాగమోపాస్తి చేయ నేల ? ౨౬౬

ఎల్లరసంబులు కలిసిన
వెల్లగునాతీర్థమును విభేదింపఁగ లే
కల్లన నంచలు సిగ్గిలి
మెల్లఁగఁ గూర్మాదులట్లు మెలఁగెడి నచటన్. ౨౬౭

పతికాని సుతుఁడుకాని
స్మృతివకు లేకున్న నట్టియామె సుతీర్థ
ప్రతతిని గ్రుంకిడ రాదని
శ్రుతిధర్మ మటంచు నత్త చూచుచు నుండన్. ౨౬౮

పునరావృత్తి నొసంగఁగఁ
జనుపదములనెల్ల దాఁటి శాశ్వతికం బై
మనుశివపద మందినశ్వాశు
రుని ప్రతిమను జూపె శివుఁ డురుప్రియ మందన్. ౨౬౯

పరమానందము నంది యావసిత సంభావించి యాత్మేశ్వరున్
గిరముం బట్టియు సప్తవార్ధిధుల మున్గం దోడనే త్ర్యంబకం
బరుదాహాసము చంద్రశేఖరము నై యారూపు మాఱ జనుల్
సరవిం గాంచిరి యీశురూపముగ నాశ్చర్యం బుదగ్రంబుగన్.

సకలసౌభాగ్యశాశ్వతస్థాన మైన
శివునిధామము పతితోడఁ జేరికొనుచుఁ
గొమరితను వీడుబాధ మేకొనఁగ జనని
యల్లునకుఁ గూఁతునకు నిట్టు లనియె నపుడు. ౨౭౧

అగణితపూర్ణతత్త్వమయు లంచును మిమ్ము గ్రహించి మించితిన్
దెగను మదీయబంధములు తెల్వియుఁ గల్గెను గాని మీర లొ
ప్పఁగఁ దగు కాఁపురంబు సలుపన్ గనుభాగ్యము నేఁటితోడనే
తెగ ననిమాత్ర మిప్పుడు మదిన్ దురపిల్లుట తప్ప దమ్మరో!

క్షమతో ధైర్యముతో నిరంతరము విశ్వాసమ్ముతో భక్తితో
కొమ రొప్పం బతిసేవల న్నెఱపుచుం గొమ్మా! చిరంజీవి నూ
కొమరుం గాంచియు రాజ్యమందు నభిషిక్తుం జేసి తొల్లింటిరూ
పమర న్నీ, కపుడేను నిన్గనెదనమ్మా! సమ్ము ముమ్మాటికిన్.

అనెడితల్లిమోము నాలోకన మొనర్చు
మీననేత్ర మోము మిగిలి వెలిఁగె
నలముదశ్రువుల ననంతదుఃఖాశ్రుల
భూషితముగ దుఃఖదూషితముగ. ౨౭౪

మానసికి క్లేశముఁ దా
మానుపఁగాఁ దలఁచి యాయుమాపతి యంతన్
నానాప్రసంగసంగతిఁ
దానై మీనాక్షిఁ దేల్చెఁ దఱుగనిదయతో. ౨౭౫

దానధర్మములతో దీనులఁ గాపాడు
వర్ణవ్యవస్థలు వఱలుకొఱకు
యజ్ఞభాగములతో నమరవర్యులఁ దన్పి
పాఁడిపంటల వృద్ధిపఱుచుకొఱకు
జిజ్ఞాసువులకు నాత్మజ్ఞాన మర్పించు
నజ్ఞానతిమిరము నణఁచుకొఱకు
తెలిసి యార్తులకు నార్తిచ్ఛేద మొనరించు
నానందసందోహ మందుకొఱకు
అతఁడు సామాన్యపాలకుఁడా! చరాచ
రాఖిలానంతకోటిబ్రహ్మాండనాయ
కత్వవిఖ్యాతదశదిశాకలితలలిత
భవ్యయశుఁ డలసుందరేశ్వరవిభుండు. ౨౭౬

వ. ఇట్లు కొంతకాలము గడచినంత. ౨౭౭

వారిదముఁ గాంచి పొంగుమయూరమట్లు
విరియఁదమ్మిని గనిసబంభరమునట్లు
గర్భవతి యైనతన కాంతఁ గన మహేశుఁ
డమితసంతోషజలధి నోలాడుచుండె. ౨౭౮

దౌహృదముచేత యౌవనదశకతాన
అల్లమీనాక్షియక్షులం దవతరిలిన
కాతరత, తద్దృగబ్జసంజాతుఁ డైన
యతనుప్రాగల్భ్యహేతు వౌ టద్భుతమ్మె? ౨౭౯

ఆమెమసృణాంగకములు కార్శ్యమును బొంద
నిత్యకార్శ్యము విడనాడె నెలఁతనడుము
కాలభేదాన వృద్ధిక్షయాలు గలుగు
ననెడియాచార మామె మేనున నెసంగ. ౨౮౦

యౌవనావధినుండి యేయమకుచములు
బలుపులోనఁ బరస్పరస్పర్థ గనెనొ,
గుఱిగ నీదశ నొండొంటి నొఱసికొనుచు
ననుభవించె ముఖ్యస్పర్థ నబ్బురముగ. ౨౮౧

ఆమెకుం గల్గినప్రసిద్ధమైనశక్తి
యంతయును నామెగర్భము నధివసించె
లేనిచో స్నానపానాలకేని యువిదఁ
గదలలేనియశక్తి యెక్కరణిఁ గవిసె. ౨౮౨

ఉగ్రపాండ్యజననము - శక్త్యాద్యాయుధదానము

గురుచంద్రుల్ వరకేంద్రమందు నిలువన్ గోణంబులందు న్శుభుల్
పరగన్ రౌద్రభమందు రౌద్రత యెలర్పన్ దారకారాతియే
వరపాండ్యాభ్యుదయంబుఁ గోరి తమగర్భంబందు జన్మింపఁగా
మురిసెన్ సుందరపాండ్యదేవుఁడును సమ్మోదించె మీనాక్షియున్.

## తృతీయతరంగము

ఆత్మజుఁడు మేరుమూలమునందునుండి
తేగలసువర్ణరాశి నెంతేని దాఁపఁ
గోశమందవకాశము కూర్పలేఁడు
స్వర్ణదానము లెన్నొ బాపలకొనర్చె. ౨౮౪

రాజులు రాజ్యతంత్రములరాజిలుచుఁదురు బాహుముఖ్యవి
భ్రాజితు లౌచు దోషము లపారముగాఁ బొనరింప నౌచు, నీ
రాజు సమస్తరాజులకు రాజగుఁ గావున షణ్ముఖుండు నై
మోజుగ నైకముఖ్యమును బొందె నిటీవలిజన్మమందునన్. ౨౮౫

ఉగ్రనక్షత్రజాతుఁ డుదగ్రతేజుఁ
డుగ్రభావుఁడు సంపదత్యుగ్రుఁడగుట
పుత్రుని కగస్త్యునాజ్ఞచేఁ బుడమిఱేఁడు
ఉగ్రుఁ డనునామధేయము నుంచె నపుడు. ౨౮౬

యుక్తవయసు వచ్చియున్నంత నతనిని
సకలవేదములు స్వశాఖ లంటి
శాస్త్రములు షడంగసహితము లగుచును
గురుముఖముగఁ బొంది కునుగుకొనియె. ౨౮౭

విష్ణువునకు ఖడ్గవిద్య శిక్షణ మిచ్చి
వింటిమొఱుక పరశువిభున కిడ్డ
మేరుధన్వయే యమేయశస్త్రాస్త్రవి
ద్యారహస్య మితని కలవరించె. ౨౮౮

ఉగ్రజ్వాలామాలా
త్యుగ్రము లగు శక్తి దండ తోమర చక్రా
ద్యుగ్రాయుధముల జనకుం
డుగ్రకుమారున కొసంగియుం దీవించెన్. ౨౮౯

సూర్యవంశసంజాతయు సోమచూడు
కొమరితయుఁ గాంతిమతి యనుకొమ్మ నపుడు
పుత్త్రునికిఁ బెండ్లి సేసి మెప్పుగను సుంద
రేశ్వరుఁడు పాండ్యరాజ్యము నేల నొసఁగె. ౨౯౦

దేవసేనానియై తొల్లి తివురు నతఁడు
పాండ్యసేనాని యగుచు నిప్పట్టు కుదిరె
వెనుకఁ దారకు నణఁచినవీరవరుఁడె
తండ్రియే తారకుఁడు గాఁగఁ దనరె నేఁడు. ౨౯౧

ఏలుబడి యిట్టి దరుల జయించు టెటులు
వర్తనం బిట్టు లుండఁగావలె నటంచు
పెక్కువేలేండ్లు పాలించి పితరు లప్పు
డాసదాశివులందు నైక్యమ్ము గనిరి. ౨౯౨

తల్లి మీనాక్షి యందును; దండ్రి యచటి
మూలలింగమునం దైక్యమును గొనంగ
వారె జనకు లటంచు నుగ్రపాండ్యుఁ డపుడు
నిత్యసేవ లాశివులకె నెఱపుచుండె. ౨౯౩

అతఁడు హయమేధశతముతో నభవుఁ గొలిచెఁ
బొందె భువినుండియే స్వర్గభోగములను
దానితో నింద్రుఁ డోర్వక దాడి వెడలెఁ
బామరులదుస్స్వభావ మిప్పటిదెగద! ౨౯3

అసమానబుద్ధి దేవవిభుఁ డంత గనుంగొని దక్షిణోదధిన్
విసువక నీవు రేఁగి యతిభీకరవృత్తి మహోర్మిమాలతోఁ
గసిగొని యుగ్రపాండ్యపురఘాత మొనర్పు నిశీథమం దటం
చుసిగొలుపం దథాస్తని మహోదధి నింగిఁ బొంగు లెత్తఁగన్.

పరవళ్ళు ద్రొక్కు నభంగోర్మిమాలచే
నమితభూభాగము నాక్రమించి
భీషణఘోషణాభీలమై చెలరేఁగి
చేతనంబులకెల్ల భీతి గొలిపి
ఊర్మిహస్తములతో నుద్ధాడఁగాఁ జేసి
బండరాలను గిరవాట్లువెట్టి
ఇసుము పెల్లుగఁ జల్లి యెసరేఁగి శిఖరుల
మానాభిమానముల్ మట్టువెట్టి
మకరతిమితిమింగిలము లుమ్మసున్నతోడ
మిట్టిపడుచు జంతువులను మ్రింగుచుండ
గ్రామములనెల్లఁ దనపొట్టఁ గలుపుకొనుచు
జలధి మధురాపురీప్రాంతములకు వచ్చె. ౨౯౫

## సముద్రశోషణము

శివసూక్తి నుగ్రపాండ్యుఁడు
శివసూక్తుల లేచి యుదధిచేష్టితములఁ దా
నవగతము చేసికొని పర
శివుఁ డిచ్చినశక్తి నెదుర సిద్ధం బగుడున్. ౨౯౬

పఱతెంచుచున్న కజ్జల
గిరివలెఁ, బర్విడఁగఁ గ్రిందికిం దిగి తా ను
ద్ధురతన్ జరచర వచ్చెడి
సురవర్త్మం బనఁగ ఱేఁడు చూచెన్ జలధిన్. ౨౯౭

దీని నుపేక్షింతునె యీ
నానావిధజీవరాశి నలుగఁగ ననుచున్
బూనినశివశక్తిని సం
ధానించుచు దానిపై నుదగ్రత విడిచెన్. ౨౯౮

బుగబుగమటంచు నామహాభూత మెదిరి
యుదధిలోఁ జొచ్చి సజలజంతూత్కరంబు
నొక్కయుచ్ఛ్వాసమునఁ బీల్చి యక్కజముగ
నిలకుఁ బ్రథమార్ద్రితనుగూడఁ దొలఁగఁ బెట్టె. ౨౯౯

ఆసరిత్పతి మర్యాద లంతరింప
రాదటం చెంచి శక్తి మఱల్చి ఱేఁడు
అపుడు కరగత మైనట్టియవని నెల్లఁ
గడఁగి సుందరేశ్వరునకుఁ గానుక వెట్టె. 300

వ. ఇటులు కొంతకాలము జరుగ నొకప్పుడు. 301

సింహాలమునుండి కైలాసశిఖరివఱకుఁ
బెల్లుగా సంభవిల ననావృష్టిభయము
అవనిపతులనెల్లను సమూయుత్తపఱచి
యయ్యగస్త్యుని గర్తవ్య మడిగె ఱేఁడు. 302

పార్థివోత్తముల్ గుంభసంభవునియాన
నర్చనాదులతో నింద్రు నభినుతించి
వర్షమునుగూర్చి యాచింప; వారిదైన్య
ముగ్రునకు నచ్చదయ్యె నుదగ్రుఁ డగుట. 303

ఇంద్రమౌళిభేదనము,

వ. అంత నొక్కనాఁ డారాజు వేఁటతమకమున దక్షిణదిశ కేఁగి, 304

చందనగిరిశిఖరమ్ముల
యందున శయనించుపుష్కరావర్తములన్
గ్రందుకొని చూచి వీనిని
డిందుపఱిచి వర్షమును గడింతునటంచున్. 305

విక్రమింప భటుల వేవేల నంపిన
వారు వాని నిగలబద్ధములుగఁ
బట్టితెచ్చి చెఱల బంధించివైచిరి,
విక్రమమునఁ గానివిధియుఁ గలదె? 306

సప్తపాతాళములనుండి సప్తఋషుల
లోకములనెల్ల నీటఁ జీకాకుపఱుచు
పుష్కలావర్తకమ్ము లప్పులకుఁ జెలఁగ
బడుట విని యింద్రుఁ డుగ్రుఁడై బడగ లెత్తె. ౩౦౭

శాలిని. జ్యానిర్ఘోషాచ్ఛాదితాశాంతమౌచున్
బాణోద్వేగధ్వస్తహస్త్యశ్వమౌచున్
రక్తజ్వాలారక్తభూభాగమౌచ
త్యుగ్రం బయ్యెన్ యుద్ధమారాజధానిన్. ౩౦౮

నింగినిం గప్పి వర్షము నిగ్రహించి
పిట్టలు పిపీలికలవోలె నిట్టు నట్టు
పాఱువిబుధులఁ గుప్పకుప్పలుగఁ గూల్చి
డేఁగవేఁటాడె ఱేఁడు కడిందిచేవ. ౩౦౯

గరుడగంధర్వసాధ్యసంఘమ్ము లపుడు
భీతి హాహారవములు గావించుచుండఁ
బతితపాదాతిమదగజాశ్వముగ దేవ
సేన స్తంభించిపోయె విచిత్రలీల. ౩౧౦

అస్త్రములు నస్త్రములచేత శస్త్రచయము
శస్త్రములచేత నుగ్గునూచముగఁ జేసి
భైరవం బగుచక్రము పట్టి యుగ్రుఁ
డింద్రువజ్రకిరీటము డిందుపఱిచె. ౩౧౧

భగ్నమాళికుఁడై భంగపడినవజ్రి
ముక్తకేశుఁడై పర్వెత్తి పోవుచుండఁ
జదల విబుధగణమ్ము లాశ్చర్యముగను
దూదిపింజలవలెఁ దూలి తూలి చనియె. 3౧౨

చెదరుగజాశ్వసంఘములచేఁ బరువెత్తుపదాతిసేనచేఁ
జెదరెడిపౌరదేవతలచే బెగడొందువధూగణమ్ముచే
గుదిగొని యేడ్చుబాలల దిగుల్గొని నిర్జరలోకమెల్ల నా
పదనున జర్జరం బగుచు భంగుర మయ్యె భయప్రకంపమై. 3౧3

ఇది:- శ్రీమదాత్రేయసగోత్ర, దువ్వూర్యువనామకపవిత్ర,
పెదశేషయార్య శేషమాంబా ద్వితీయపుత్త్రి, మహా
గాయత్రీశరణ్య, గురువేంకటరమణకారుణ్య
సూర్యనారాయణశాస్త్రి ప్రణీతం బైన
ఆంధ్ర శివలీలార్ణవ
మహాకావ్యంబున
తృతీయతరంగము
సమాప్తము.



# శివలీలార్ణవము

ఓం

## చతుర్థ తరంగము



### ఉగ్రపాండ్యుఁడు మేరువును భేదించుట

మీనలోచనసుతుఁడు భూమిని సమస్త
సంపదలు మీఱఁ బాలించుసమయమందుఁ
బంచతారాగ్రహములు వక్రించి వృష్టి
ఘాత మొనరించి ప్రజల కిక్కట్లు తెచ్చె. ౧

పంటలు లేవు భూమిపయిఁ బట్టుగఁ జిన్కొకఁడేని లేదు, మి
న్నంట మొగిళ్లు లేవు, మునుపే వడగాడ్పులు, నీరు లేదు, మి
న్నంటినవస్తుమూల్యములు నల్లల నార్చి విచిత్రరోగముల్
గెంటఁగ జీవులన్ విలయకేలి యొనర్చెను క్షామ మయ్యెడన్. ౨

వ. ఆసేతుశీతాచలం బట్లు సంభవించినగొప్పయవగ్రహంబున. ౩

గురుఁ డగస్త్యునియాన నుగ్రుఁడు గ్రహించి
సోమవాసరమున సోమసుందరేశు
జలక మాడించి వివిధపూజలను దీర్చి
తిరుగ మహేశుచేఁ బ్రబోధింపఁబడియె. ౪

వ. ఈకాటక మొక్కహాయనంబుమాత్ర ముండుఁ బిమ్మట నాగ్రహము లాగ్రహంబు వీడి నీకుం గింకరులు కాఁగలవు. ౫

చండాయుధ మను నస్త్ర
ద్దండము నీకొసఁగితినిగదా ము న్నిట నా
దండమున మేరుశైలము
ఖండించి సువర్ణరాశి కడఁకం దెమ్మా! ౬

మేరువర్ణనము

అనెడిసుందరబోధల నాలకించి
భైరవమహాయుధంబుఁ జేపట్టి వెడలి
పుడమితామరదుద్దుగఁ బొదలుచున్న
కాంచనాచల మామహాఘనుఁడు గాంచె. ౭

అలపరమేష్ఠి విష్ణుపద మన్నికషోపలమందు, జిడ్డుకై
యలఁదుచు మబ్బుమైనమును, నాకయి మేరువు గీచి వర్ణముల్
దెలియఁ దటిన్మిషంబునను నేఁటికిఁ దానిఁ బరీక్ష సేయుచున్
మెలఁగెడిరీతి మేరుగిరినిం గని భావన నిల్పె నుగ్రుఁడుల్. ౮

శివునివిల్లైనయాగిరిశిఖరమందుఁ
బొంగి పొరలెడియాకాశగంగ చూడ
వలయముగ దిగవిడిచిన వాసుకి యను
నల్లెత్రాడుగ భావింప నయ్యె నపుడు. ౯

కలితరత్నాకరంబు బంగారుకొండ
మెలఁకువను నోము గలుగుసామికులపగిది
సూర్యచంద్రులు రేపవల్ చుట్టి ముట్టి
విడువక చరింతు రంచు భావింపవలయు. ౧౦

అందలిరాలు మానికము లందలిమన్ను పసిండిముద్దయే
యందలిమేలు గంగమమె యందలిబోయఁడు శంకరుండె పొ
ల్పొందఁగ యజ్ఞయాగము లనూనతపంబు లొనర్చి పొందు నా
నందమయప్రదేశ మదె నైగమసారము గూడ నయ్యదే. ౧౧

పసిగ ద్విపదచతుష్పదషట్పదమ్ము
లచట అష్టాపదమ్ములై యలరి తిరుగు
నచటిమట్టి బంగర మాట నమరకాంత
లరిగి కుమ్మర్ల నగలకై యాశ్రయింత్రు. ౨౨

అది గంగాధర మాట నాకము శిరస్సైన భూమి మధ్యంబు నై
కుదురన్, బాదము నాగలోక మయి దిక్కుల్ కప్పి తా నుండి,య
భ్యుదితం బై శశిశేఖరం బగుట నొప్పంగాదె త్రైలోక్యరూ
పధరత్వంబునఁ జెల్లునీశ్వరునిరూపం బౌచు మున్మాటికిన్. ౧౩

ఉరుతరదవాగ్నిచే నా
గిరికొమ్ములు కరఁగి నీటిక్రియను స్రవింపన్
సురలోక మశాశ్వత మను
పరవాదము చక్కఁ దోఁచుఁ బ్రత్యక్షముగన్. ౧౪

అచటిబంగరుమామిళ్లయందుఁ బండు
టాకులఁ జివుళ్లు గుర్తింపలేక పికము;
లచటిపూలు సువర్ణత నందుకతన
గంధమును బొంద నళులు; నిక్కముగ వనరు. ౧౫

అఖిలదేవతలకు నిలయమ్మ వగుచుఁ
దనరునాగిరి కతఁడు ప్రదక్షిణించి
మనమున నుతించి దానిమన్ననలు పడయ
ముకులితకరాగ్రుఁడై లేచి ముందు నిలిచె. ౧౬

ఆనగ ముగ్రపాండ్యునెడ నానతభావము చూపకే యుదా
సీనత నుండ రామునెడ సింధువు రీతి జడత్వ మూని; త
న్మాన మడంప నుగ్రుఁడు సనాతన మైనమహేశుదండమున్
బూనికఁ ద్రిప్పి వైవఁగఁ బ్రభూతపుఁగంపన మందె గ్రక్కునన్.

కాంచనగిరీంద్ర మాదండఘాతమునకుఁ
గంప మంద, దశాననుకరబలమున
క్లైబ్య మంది కంపించుకైలాసగిరికి
సిగ్గు తోఁచఁగినరీతి భాసించె నంత. ౧౮

అసిఘాతంబున ద వ్వటు
పస చెడి యామేరుగిరి సపాదంబుగఁ దా
దుసికిలఁబడె నాదెబ్బకు
పసిగా శతశస్సహస్రశకఖండములై. ౧౯

అపుడు జడభావమును వీడి యగ్గిరీంద్రుఁ
డతనిహాలాస్యపుత్త్రిగా నవధరించి
కాఁక చెందకుమయ్య యీలోకసత్య
మెఱిఁగియుఁ జలింతురే ధీరవగులు భువిని. ౨౦

సీతం(డిధనువు నగున
నీనలతో భంగించియున్ననేనియు నష్టం
బాతనిన చెందు నాకే
(బాంతి యగున్? వలసినంత బంగరు కొమ్మా! ౨౧

అని వచింపంగ తేడు చండాయుధమున
దానిగనలందుం గలుగుపుత్తడిని (దవ్వి
తండముగం గంచరముల మత్తద్విపోష్ట్ర
నివహముల కెత్తి రాజధానికిం దరల్చె. ౨౨

కలకాల మిట్టిక్షామమె
యలమిన మా కేమికొదువ యని (పజ లాడన్
గొలుచుల బంగరువర్షము
నెలమిని గురియించె నృ(గుం డే డ్లెుం (బజకున్. ౨౩

సుందరేశ్వరుం డాగమతత్త్వము దెలుపుట.

చిరముగ నృగపాండ్యుండు రుచింపంగ రాజ్య మొనర్చి యిందుశే
ఖరునిదయావిశేషమునం గాంతిమతీసతియందుం బుత్త్రినిన్
బొరసియు వీరపాండ్య; వసుపూర్ణముగా ధరయెల్లం దద్వశీ
కరణమొనర్చి నాకము సుఖంబుగం జేరె సతీయుతంబుగన్. ౨౪

భక్తిపూజాతపస్సులం బరశివునకుం
బుత్త్రినందునకంటె నాపౌత్త్రునందు
నధికవాత్సల్యసద్భావ మంకురింపం
బుడమిం బాలించె వీరపాండ్యుండు చిరము. ౨౫

## చతుర్థతరంగము

వేదార్థంబు తెలుపంగఁగోరి యభవున్ వేదాంతవేద్యున్ జగ
న్నాథున్ సుందరనాథుఁ గొల్వఁగను గణ్యప్రఖ్యమౌనీంద్రు లా
శ్రీదం బైనకదంబవాటికకు వేంచేయన్ దదర్చాతప
స్సాధుత్వమ్మెచ్చుచు బాపఁడై శివుఁడు ప్రత్యక్షంబుగాఁ దోఁచుచున్.

సుందరేశుసమీపంబునం దతండు
వ్యాఘ్రచర్మాసనాసీనుఁడై సమస్త
మునులు వినుచుండ వ్యాఖ్యానమును బొనర్చె
వేదవేదాంగశాస్త్రార్థవిధులనెల్ల. ౨౭

అఖిలసృష్టికిఁ గారణ మైన దగుచుఁ
గలదు వాగ్బ్రహ్మ మనఁగ నొక్కటి జగాన
ప్రణవ మోంకారమును దార మనెడిపేర్ల
వ్యవహరింతురు దానినే వివిధగతుల. ౨౮

అగు నొకటిగ మూఁడుగ నా
ల్గుగ నైదుగ నదియె, యదియె కొనసాగం బంద్రెం
డగువిధములఁ దగు నంచును
నొగి నాగమములు వచించుచుండుం జుండీ! ౨౯

అవతరించెను దానియందుండి వ్యాహృతుల్
వ్యాహృతుల్ గాయత్రి వఱలఁజేసె
వేదోపవేదముల్ విశ్వపావని యగు
గాయత్రినుండి చక్కఁగ జనించె

ఆవేదములనుండి యఖిలవాఙ్మయములు
నేర్పడి వ్యాపించె నీధరిత్రి
నెల్ల పల్కులకును దల్లి యాప్రణవము
తత్ప్రభావము నుడుల్ దఱమె పలుక?

వ్యాపకం బది పల్కులు వ్యాప్యము లగు
నేకమాతృప్రసూతము లైకమత్య
గమ్యములు శాస్త్రములు; వానిగతు లెఱుఁగక
మూర్ఖులు పరస్పరవిరుద్ధము లని యంద్రు. 3౦

అంగములు మంత్రతంత్రము లఖిలనిగమ
శాస్త్రములు లౌకికపురాణజాలమెల్ల
సోమసుందరమూర్తిలోఁ జొచ్చియున్న
యామహాజ్యోతియందె విశ్రామ మందు. 3౧

అఖిలవాక్కులు స్థిరధన్వుఁ డైనరుద్రు
వాఁ డనుట కంచు నకుతోభవంపునుడులు
చాటె, సకలార్థసిద్ధిదశక్తిఁ గొలువ
కభవుతత్త్వముఁ బలుక శేషాహితరమె? 3౨

ఆమె పలుకును, బలికించు, నామె చూచుఁ
దానె చైతన్య మగుటఁ జైతన్య మొసఁగు
నామె గతి యామె సుగతిఁ దా నందఁ జేయు
నామె యీమీనలోచన యమ్మె నిచట. 33

తపముల దానాధ్వరముల
సపర్యల నొనర్చి యాదిశక్తిఁ రక్తిఁ
అపవర్గ మందుటకునై
యుపాసనము సేయఁగడఁగుఁడో మునులారా! 34

అనుచు బాపఁడు మస్తకన్యస్తహస్తుఁ
డగుచు బోధించి తల్లింగమందుఁ గలిసె;
సుందరేశ్వరుబోధల నంది వారా
లపరిమిత మగునానంద మంది చనిరి. 35

ఏఁగఁగఁ గొంతకాల మటులే వ్యసనార్తిని వీరపాండ్యుఁడున్
భోగపుఁగాంతలందునఁ గుపుత్త్రులఁ బల్వురఁ గాంచి యాగతా
నాగతవేది యాచు ప్రమథాధిపుసత్కృప సత్సుతున్ మహా
భాగుని రాణియందు గనెఁ బ్రాగ్జనిపుణ్యదశావశమ్మునన్. 36

రాజశార్దూలుఁ డొకనాఁడు రహిని వేట
లాడఁగాఁ బోయి శార్దూలహతుఁడు గాఁగ
భోగకాంతాకుపుత్త్రులు పొదివి వాని
సంపదలనెల్ల హరియించి సాఁగి రెటకో. 37

నాఁటికైదేండ్లపుత్త్రుఁ డున్నాఁడు గాని
మకుటమే లేదు, రత్నసంపాద్య మద్ది
యితని మహిపతిగాఁ జేయు టెట్టు లనుచు
నగరవృద్ధులు శంకించి వగచుచుండ. 38

వ. వారియెదుట నొకవైశ్యరూపధారియై సుందరేశ్వరుం డావిర్భవించి భృత్యగణపరివృతుండై రత్నపర్త్తకుండ నని రత్నపేటికం దెఱచి ౩౯
పేరుపేరున వానిం జూపుచు,

అందఱును రత్నములఁ జూచి యాదరింతు
రందఱు ధరించి కులుకుదు రంతె గాని
బ్రహ్మతత్త్వంబుపోల్కి నారత్నతత్త్వ
మెఱుఁగువారలుమాత్రము దొరక రెందు. ౪౦

పాకశాసనుయజ్ఞపశు వైనబలుని ధా
    తువుల జన్మించినయవియు నెవ్వి
అలమహాదేవువీర్యమునుండి పుట్టిన
    సద్రత్నమణు లనఁ జాలు నెవ్వి
యజ్ఞమహావరాహము ఫేనకణజాల
    ముల జనించినరత్నము లన నెవ్వి
తొలిమహేంద్రునినేత్రమలమునుండి, దధీచి
    నెమ్ముల జనియించె నెట్టిమణులు
నాకభూతలపాతాలలోకములను
వివిధజనుల నుద్భవ మందినవి యెవేవి
వానికాంతులు గుణదోషవర్ణములును
వానివిలువలు మహిమ లెవ్వారి కెఱుక ? ౪౧

అఖిలజాతులును జాత్యాభాసములు, రాగ
వర్ణకృత్రిమములై వజ్రలు నెవ్వి
ఎప్పుడె వ్వైవరెవ రేరీతిఁ దాల్చుటో
యధిదేవతలు వాని కమరు టెటులో
వర్ణవ్యవస్థ జీవాజీవభేదముల్
స్త్రీపుంసభేదవైచిత్రి యెటులో
రక్షణోపాయపరీక్షావిధానముల్
పరదేవధార్యముల్ గుఱిగ నెఱియు
ఔషధోపయోగితకునై యమరు నెవియొ
అయ్యవి పరశ్శతాభిధ లందు టేలొ
సర్వదేవరత్నము, రత్నసానుధన్వి
యగుశివుఁడు దప్ప నితరుల కగునె తెలియ? ౪౨

మధురదేవపాండ్యునికి ముమ్మనుమఁ డైన
రాజపుత్త్రుండె వీనిఁ దాల్పంగ వలఁతి
మీరు మకుట మీమణుల నిర్మింపఁ జేసి
రాజుగాఁ జేసి పిదప మూల్యమ్ము నిండు. ౪౩

అని వచించి దివ్యమణులు వారి కొసంగి
చూచుచుండ మాయ మాచుఁ దొలఁగఁ
గలఁగి వారు బాష్పగద్గదముల రాజ
పుత్త్రభాగ్యదశలఁ బొగడికొనిరి. ౪౪

అభిషేకపాండ్యుని పట్టాభిషేకము

రత్నమకుటము నిర్మించి రాకుమారు
విధివిధానత రాజ్యానఁ గుమరుకొలుప
సుందరేశుదయాదృష్టి నంది మొదటఁ,
జివర మంత్రులచే నభిషిక్తుఁ డయ్యె. ౪౫

తీరుగ బాలరాజు గడిదేరినచేష్టలు పల్కు లాటలున్
గూరిమి నీశ్వరుండు దనకుం దగుసేవలుగా గ్రహించుచున్
సారెకు మెచ్చ చాతనిఁ బ్రసన్నతతో నభిషేకపాండ్యుఁ డన్
పేరునఁ బిల్వఁ జేసి నిలిపెన్ స్వకులైకవిభూషణుండుగన్. ౪౬

అతఁడు ధరియించువస్త్రము లాభరణము
లతఁడు భుజియించుమధురభక్ష్యాదు లతఁడు
పూసికొనుపూత లఖిలసద్భోగములును
సుందరేశార్పణమనీషఁ జూచుకొనును. ౪౭

పరశివదిదృక్ష, తన్నామవరపిపాస
భర్గపూజాచికీర్ష, సేవారిరంస
తత్ప్రసాదబుభుక్ష, తద్వైభవాత్త
సకలశుశ్రూష లతనివేడుకలు సతము. ౪౮

మకుటమున కమలరత్న
ప్రకరము లొసఁగినమహాకపర్దిఋణంబున్
సకలమ్ము దీర్ప మణిగణ
నికరముచేఁ జిరము తేఁడు నెఱి నర్పించెన్. ౪౯

అచలశిలలందుఁ గలర
త్నచయంబు లొసంగ శివుఁడు తా నాతనికిన్
అచలితభక్తి సకలవ
స్తుచయంబుల రతనములను దో నర్పించెన్. ౫౦

అస్త్రాపాస్తసమస్తదుఃఖనివహుం డా రాజు పల్మాఱు తాఁ
గస్తూరీఘనసారకుంకుమములన్ గంధాక్షతాదిన్ మహో
పాస్తిం బూజలు సుందరేశునకుఁ జల్పన్ భక్తి, నానాఁటితో
కస్తూరీఘనసారసుందరుఁ డనుఖ్యాతిన్ గదంబించెడిన్. ౫౧

సముద్రశోషణము

వ. అంత నొక్కనాఁ డింద్రుండు సుందరేశ్వరునకు వార్షికకమలార్చన మొనర్పం గోరి మధుర కేఁగి, యభిషేకపాండ్యునిపూజావిధానం బరసి సిగ్గిలి వరుణునితో నాతేనిభక్తిని శివునిభక్తవత్సలతను ముచ్చటింప నాతండు ప్రత్యక్షంబుగ దానిం గాంచి మత్సరగ్రస్తుండై మధురానగరాక్రమణంబునకై సముద్రుం బురికొల్ప, ౫౨

వరుణప్రేరితుఁడై యొక
పరి యోడినయుదధి మధురపైఁ దిరిగి మహో
ద్ధురతం బడ నంకించెను
బోరి జడులకు నిట్టిబుద్ధి పుట్టుట యరుదే? ౫౩

జడిసి ప్రజలెల్లఁ బాండ్యుని శరణు వేఁడ
తేఁడు సుందరేశ్వరుని బ్రార్థించి కొలువఁ
దనజటాకేశ మొక్కఁ దుద్ధతిని బెఱికి
వ్యోమకేశుండు విసరె గవ్యూతిమేర. ౫౪

## వలీలార్ణవము

అది యభ్రస్పృగనంతమేఘముల నంతంతన్ సృజింపన్ దదం
బుదముల్ గర్త జలంబు నొక్కత్రుటి నాపోశించువస్త్రంబు నా
నుదధిస్థాఖిలవారిఁ బీల్చ వరుణుం డోడందు దండెత్త నా
త్రిదశుల్ భిన్నత నిట్లు లంకె నరు లుద్రేకింపరే తీంద్రులన్, ౫౫

వరుణు చేతఁ బంపఁబడిన వారిదములు
మొదటివైరభావమును దొలంగఁ
బ్రళయఘోషలను నభంబు బ్రమింగెడిరీతి
నవనితలము నెల్ల నాక్రమించె. ౫౬

పొలయలుక నున్న కాంత లుత్తలము గొనుచుఁ
బ్రియులఁ గౌఁగిలించుచును మెప్పించికొనఁగఁ
గారణము లైన తద్ఘనగర్జనములు
ప్రియులయపరాధశంకను బ్రిదులఁ జేసె. ౫౭

మునుకొను గాలితో గడిమిపుప్పొడితో ఘనముక్తవారితో
మొనయుతటిత్తుతో మొగలిపువ్వులలోపలియాకసంబుతో
వినిహతవృత్తి వేసవుల వేఁగి నశించిన కామదేవునిన్
పనివడి పంచభూతమయపద్ధతి ధాత సృజించె నత్తఱిన్. ౫౮

ఆఁకొనియున్న చాతకము లభ్రగలజ్జలబిందుజాలముల్
ఆకసమందె నోళ్ళఁ గొని యాఁకలికూనల నోటఁ బెట్టఁగా
లేకను ద్రాగలేకను జలించెడిమానసవృత్తి నంది య
ట్లాఁకల గుందుచుండెను విహాయసవీథులఁ బిండుపిండుగన్.

## చతుర్థ తరంగము

అంచలు కోసలన్ విడిచి యవ్వల కేఁగినయంత వానిలో
కొంచక సంచరించుటకుఁ గోరినవై యళు లంత వర్షముల్
ముంచఁగఁ దమ్ములెల్లఁ జెడిపోవ నిరాశ్రయవృత్తిఁ గుందె నౌ
నొంచఁగ హాని యన్యులకు నేర్పడవే తమకున్ మహాపదల్. ౬౦

తమ్ములు నశించినను గైతకమ్ము లెసఁగె
నంచలు తొలంగినను నెమళ్లలరుచుండె
విధుఁడు లేకున్న నేమి మన్మథుఁడు గలఁడు
ఏది లేకున్న నీసృష్టి కేది లోటు ? ౬౧

రమ్య కేకాధ్వనుల్ మయూరము లొనర్ప
భేకములు కటుధ్వనుల నిర్భీతిఁ జేయు
కలకవిత్వము కవులు చక్కఁగ నొనర్ప
కాకవులు మూకత వహింపఁగడఁగుమరఁచె ? ౬౨

యువతిదుకూలాంచలముల
సవరించి కదల్చి కురులు సరిదిద్దుచు నా
యువకుల క్రియ మారుతములు
కవిసి రతిశ్రమల తొలఁచె కాంతల కంతన్. ౬౩

చాతకచిరార్జితం బగుజఠరవహ్ని
నార్పుటను గల్గుపొగలు పెల్లలమినట్లు
లాకసమ్మును మేఘము లావరించి
సూచిభేద్యములై తల సూపుచుండె. ౬౪

అతిథిభాగ్యముఁ బట్టియే యాకుటుంబి
భవన మభివృద్ధిఁ గాంచి సంపదలఁ బొదలు;
కలితకలహంససంఘము తొలఁగి పోవ
చెలుఁగవే కమలాకరశ్రీలు కూడ. ౬౫

లోనిపద్మోత్పలశ్రీలు లుప్త మంద
దరిని బుష్పించు కైతకతరువు లొప్ప
లోసిరి తొలంగి పైని పెల్లుగ గజాశ్వ
బలము గలకోటలటు సరోవరము లొప్పె. ౬౬

కమలశోభ లడఁగెఁ గలహంసములు తారెఁ
గానరాఁడు తత్కలానిధియును
అలకలాపి విడిచి యావానకాలున
శని కకారమునకె చక్కఁ బట్టె. ౬౭

అంధకారబంధుర మైనయర్ధరాత్రి
మెలమి నడచెడియభిసారికలకు మెఱపు
లాలయ మదనునికరదీపికలవిధాన
దారిఁ జూపించు సంకేతతలములకును. ౬౮

అగ్నిసఖుఁ డైనవాయు వయ్యవసరమునఁ
బరమసఖుఁ డయి మెలఁగె నవ్వరుణునకును;
శత్రుమిత్రత్వములు దేవజాతికేని
తలఁప సమయానుగుణముగ నిలుచుచుండు. ౬౯

## చతుర్థతరంగము

వికటావర్తతరంగసంకులచలద్వేలాతిగోద్యద్భయా
నకలీలన్ బ్రవహించుచున్ విపిననానావృక్షషండంబులన్
సకలగ్రామవనస్థజంతుతతి నుత్సారించు చుద్యన్నదుల్
బ్రకటగ్రామపురాశ్రమాలయములన్ భంగించె నుప్పొంగుచున్.

పర్వతనదీసముద్రదిగ్భాగములును
పాదపంబులు రేయుంబవళ్లు, మిట్టుఁ
బల్లములతో సమస్తప్రపంచ మపుడు
కానఁబడదయ్యె మేఘాంధకారవశత. ౨౧

పాండ్యసుతుఁ డంత జనులతో పాటు చంద్ర
శేఖరుని శర ణంచు నర్చించి వేఁడ
వారజటాజూటజనితమహాఘనంబు
లాతపత్రములై వాన నాఁపివైచె. ౨౨

వారుణాభ్రముల్ కురిసెడివర్షజలము
శాంకరాంబుదజాలముల్ చక్కఁ బీల్చి
మధురపై పటమంటపవిధిని నెఱపి
యాజలోపద్రవంబుఁ దా మఱచివైచె. ౨౩

ప్రలయమున్న వర్షింపఁగ
నిలువఁగ తమదాచుకొన్న నీరము నంతన్
జలదములు కురిసి యిండ్లను
వెలువడుపొగలట్లు దివిని వెలవెలపోయెన్. ౨౪

వరుణుఁడుఁ దనవారిదములఁ
బరస్పరము సిగ్గుచెంది పఱచినయంతన్
హరుఁడుర్ దఱిలిచి మొగిళులఁ
దిరిగి జగమ్మును యథాస్థితిగఁ జూపించెన్. ౭౫

నలుదిక్కులఁ గూటము లన
నిలిపి మొయిళ్లను బురంబు నిలిపినకతనన్
కలితచతుష్కూటం బను
పిలు పామధురాపురికి లభింపఁగ నయ్యెన్. ౭౬

తనయపరాధగాథకు యథాయథలై వరుణుండు తత్పురం
బునఁ గలస్వర్ణపుష్కరిణి మున్గి తదంబుజపాళి శంకరుర్
దనివిగఁ బూజ చేసియుఁ బ్రదక్షిణవందనముల్ ఘటించి యా
యనఘుఁ డరోగుఁ డయ్యెఁ దనకై నజలోదరపీడ పాయఁగన్. ౭౭

నతుల నుతుల బహుస్తోత్రవితతికలన
అల్లమీనాక్షిశివుల దయర్ గణించి
పాండ్యవిభుతోడిసన్మైత్రి పడసి పిదప
నాత్మపురి చేరి సుఖలీల నలరె పాశి. ౭౮

శిలాగజ మిక్షుఖండమును దినుట

పరమధార్మికుఁ డభిషేకపాండ్యుఁ డట్టు
లేలుకొనుచుండ, నాసుందరేశ్వరుండు
సిద్ధవేషధరుం డయి శిష్యకోటి
తన్ను వెంటాడ మధురలోఁ దారసిల్లె. ౭౯

పాలు పొంచురుదురాకపూసలజపమాల
హస్తాంగుళులను దారాడుచుండ
తిరికతై రాగిరం గుఱికినజడలమొ
త్తము జఘనము దాఁటి యమరియుండ
బసుమంబుపూఁత కుప్పసముగా నొడలెల్లఁ
గలయంగ తెల్లఁబూవులను బూవ
చకచకరుచులఁ గాంచనవేత్ర మొకచేత
నూఁతగా నట్టుని ట్టూఁగులాడ
మోము కరుణారసమ్మున మునిఁగి తేల
నాకృతి కళానిధిత్వవిఖ్యాతి నెఱప
సులభసుందరుఁడై తాను జూపరులమ
నమ్ములను దోఁచుకొనుచును నెమ్మి దిరుగు. ౨౦

కుకరపాదులు మూఁగలు గూనివారు
బధిరషండజడాంధులు పంగువులును
దీర్ఘరోగులు మొద లగు దీనజనులు
ధన్యులై రామహోసిద్ధదర్శనమున. ౨౧

తనపాదోదకములచే
వనితావంధ్యాత్వదశలు వాపుచు బసుమా
బున వృద్ధులఁ దరుణులుగా
నొనరించుఁ బ్రజలు తన్నహో యని పొగడన్. ౨౨

శివలీలార్ణవము

జిహ్వాపై బూది పిసరంత చిమ్మెనేని
జడులు కవిపండితులుగఁ బాల్పడుదు రపుడె;
మలినహృదయులు విషయైకమతులుగూడఁ
దత్క్షణంబ విరాగులై తనరుచుంద్రు. ౮౩

పంచపంచలఁ దిరుగునకించనులను
మాటతో ధనికులు గాఁగ మార్చివైచె
సర్పహాతుల జలోక్షణచర్యకతనఁ
జిటకెలో సజీవులు గాఁగఁ జేయు నతఁడు. ౮౪

ఆదిసిద్ధునినామాక్షరాలి పలుక
యక్షిణీగ్రహభూతకూశ్మాండజాతి
ఆభిచారిక పైశాచికాదిబాధ
లెల్ల మటుమాయ మగుఁ ద్రుప్పు డుల్లినటులు. ౮౫

కానరాకుండ మాటాడఁగలఁ డతండు
మాటలాడుచునే మటుమాయ మగును
జటిలుగా ముండిగా యువజనునిగాఁగ
దశమిగాఁ జూచుచుందు రావశిని జనులు. ౮౬

ప్రజలయెదుట మహోన్నతపర్వతముల
జలనిధుల వనములఁ జూపఁజాలు నతఁడు
నవ్వుచు నటించి జనము లానందపడఁగఁ
జిటికెలో వానినెల్ల నశింపఁజేయు. ౮౭

ఈమహిమ లోకాలోకతతిగ
నేమని వర్ణింతు మేమునేనియు నిపు డా
స్వామివలె విశ్వరూపుల
నై మునినన్ జూపనగుదు మాసువిభూతుల్. ౫౯

అతఁ డారీతి వినోదముల్ నెఱప నయ్యోవార్త లల్లల్ల న
ద్భుతరీతిన్ బ్రజ లాడ జేని కవి యెంతో భక్తి కల్గించె, నా
పతియున్ సుందరనాథుఁ గొల్వఁ జని భాస్వత్తేజు సిద్ధున్ దృణీ
కృతదేవేంద్రుని నిస్పృహున్ గనుచుఁ గోరెన్ గోత్రనామంబులన్.

అతఁడు జపమాల కర్ణమునందుఁ జెటివి
లీలఁ బద్మాసనము సడలించి జేని
గాంచి యమృతాయమానవాక్యలన నిట్లు
పలికెను బరానువర్తనభావ ముడిగి. ౬౦

నా యనువారు లేరు సరనాథ కులంబు హుళక్కి యిల్లు లే
దే యవధూత నాకుఁ గలదే యొకవర్ణము నాశ్రమంబునున్
గో యనఁ గోటిసత్కళలకున్ నెల వౌదును సిద్ధు డందు రా
ప్యాయన మున్నచోఁ గనఁగదయ్య మదద్భుతసిద్ధిసంపదన్. ౬౧

వ. అనిన విని జేఁడు నీ వట్టిమహాసిద్ధుండ వేని యీపుండ్రేక్షుఖండంబు
నీయాలయమండపంబు వహించు జాతిగజంబుచేఁ దినిపింపుము
చూత మన నాతండును దాని కట్టిశక్తి నొసంగె నంత. ౬౨

ఘనఘనాఘనగర్జ నా గజము పవరి
యొక్క ఘీంకృతి దిక్కులు పిక్కటిల్లఁ
జేసి రారాజునుం జేత చెఱకుగడను
దొండమున లాగి నమలె దుందుడుకు మీఱ. ౯౩

వ. అంతలో నాఁగక యాగజము జేని మెడలోనికంఠమాలికామణి నాక ౯౪
ర్షింపఁ దదనుచరులు మిగుల భీతులై రంత నారాజు,

అవమానింపఁగఁ గాని యియ్యది పరీక్షార్థంబు గానీ మదో
ద్యవలేపంబునఁ గాని చేసినదికా దయ్యా, మనఃకౌతుకం
బివతాలింప నొనర్చితిన్ నతులు సామీ యంచు రాజాడ, నా
నవు నీయింగిత మే నెఱుంగుదునుగాదా యంచు నాసిద్ధుఁడున్.

వ. అతనిఁ బ్రసన్నదృష్టి నీక్షించి యనుగ్రహింపందలంచి నీకు వంశకరుం
డగుకుమారుండు గలుగుఁగాత మని వరం బిచ్చి యంతర్ధాన మయ్యె.

భర్గువరమున నభిషేకపాండ్యునకును
భావనకులోద్వహుఁడు శివభక్తుఁ డైన
కొమరుఁ డుదయించె నాతనికొమరు గాంచి
యనిరి విక్రమపాండ్యుఁ డం చతనిగురులు. ౯౫

తండ్రినిర్యాణకాలానఁ దనకు నిడిన
పరమబోధల విక్రమపాండ్యుఁ డెపుడుఁ
బరమశివునందు నిర్వ్యాజభక్తి నెఱపి
యీశ్వరమయమ్ముగా రాజ్య మేలుకొనియె. ౯౬

అతఁడు శివనామపరుఁడు శివాశ్రితుండు
చంద్రశేఖరవిన్యస్తసకలభారుఁ
డాతఁడు ప్రణష్ట శివుప కాయుయ్య యనిన
రాజులకుఁ బుత్రిభావ మేర్పడక యున్నె ? ౯౯

సోముని శరద్విన్నిర్మలుఁ జూచి దొంగ
తనపనికి నడ్డ మని సహింపనివిధానఁ
జోళరాజీమహాప్రభుఁ జూచి కనుల
కారముం జల్లుకొనును నిష్కారణంబ. ౧౦౦

బౌద్ధప్రేషితహస్తిహననము

అతఁ డుగ్రపాండ్యు నోర్వఁగ
గతిమాలుచు నాభిచారికక్రియ నతనిన్
సతమత మొనర్ప క్షపణక
తతిఁ బ్రోత్సాహించె దుష్టతత్త్వముతోడన్. ౧౦౧

ఆభిచారికహోమాగ్నియందునుండి
వెడలె నడకొండనా మదద్విప మొకండు
అది కరమ్మున ముద్గర మమరఁ బట్టి
మించి మధురమీఁదికిని లంఘించె నపుడు. ౧౦౨

ఉగ్రపాండ్యుఁడు మీఁది కత్యుగ్రవృత్తిఁ
బరువులెత్తుచు వచ్చుద్విపమ్ముఁ గాంచి
యుగ్రు శరణంబు వేఁడ మహోగ్రవృత్తి
నాతఁడు కిరాతుఁడయి యవతరించె. ౧౦౩

పలురంగుచివురు లేర్పఱిచి కట్టినశేఖ
రంబు శిరంబున డంబుమీఱ
గురివెందపూసలు గ్రుచ్చి ముప్పేటల
కుతికఁట్టు మెడయందు గునుకులాడ
కజ్జలమయదేహకాంతిలో పిక్కటి
ల్లినకండరంబు లల్లన చలింప
చుంగులు వ్రేలాడుచున్ ఫుట్టగోచి తన్
వనచరుఁ డనుచుఁ జెప్పకయె చెప్ప
నెక్కుపెట్టినధనువుఁ దాఁ జిక్కఁబట్టి
యెఱ్ఱజీఱలకనులు కెంపెక్కి చింత
నిప్పుకలవలెఁ దోఁప నేనికను జంప
గుఱి కనుంగొనుచుండె మిక్కుటపుఁదమిని. ౧౦౪

అచలధనువున నచ్యుతం బైననిషువు
తొడిగి లోకైకధన్వి తా విడిచినంత
నాభిచారికగజరాజ మవనిఁ గూలె
తత్తథాగతు లెల్లఁ దథాగతులుగ. ౧౦౫

ప్రణతుఁడై యున్నవిక్రమపాండ్యు నపుడు
తనదయామయదృష్టి నీక్షణము సేసి
వంశకరుఁ డగుకొమరుఁ దుద్భవము కాఁగ
వర మొసంగి యదృశ్యభావంబు నందె. ౧౦౬

అతఁడు రాజశేఖరుఁడు రాజ్యము సమస్త
మూర్జితబలుండునై చక్క నోముచుండి
సుందరేశ్వరుసేవలఁ జొక్కుచుండ
శివునిసన్నిధి జనకుఁడు చేరుకొనియె. ౧౦౭

ద్విజకన్యను రక్షింప శివుఁ డవతరించుట

రాజశేఖరుఁ డటులు పాలన మొనర్చు
కాలమున విరూపాక్షుఁ డన్ మేలివిప్రుఁ
డభవునింగూర్చి చిరతప మాచరించి
గౌరి యనుకూఁతుఁ గాంచె ముక్కంటిదయను. ౧౦౮

వచ్చెనో లేదొ యైదేండ్లవయసు జనకుఁ
డంబికామంత్రదీక్ష నాయమ కొసంగ
తీవ్రతరతపశ్చర్య నాతీవబోఁడి
దాని సాధించె జపయజ్ఞధర్మనిష్ఠ. ౧౦౯

అఖిలసిద్ధిప్రదంబు నేకాక్షరంబు
జగదధిష్ఠానమంత్రరాజము జపించి
బాల యయ్యు జన్మాంతరవాసనా బ
లమ్ముకతనఁ దాదృక్సిద్ధి నెమ్మిఁ బడసె. ౧౧౦

గురుకులవాస మొనర్చుచుఁ
జిరభిక్షాటనము చేసి జీవించువటుం
డిరవునకుఁ జేరి యొకనాఁ
డఱచెను 'భిక్షాం ప్రదేహి' యని బిగ్గరగన్. ౧౧౧

వహ్నిరూపు రేకలు వానివాలకంబు
నవ్విరూపాక్షుఁ డరసి గోత్రాదికమ్ము
నూరు పేరడుగక, వానిఁ గోరి పిలిచి
పెండిలి యొనర్చెఁ దనముద్దుబిడ్డ నొసఁగి. ౧౧౨

దుష్టాగమాభ్యాసదుర్విదగ్ధం బైన
భూదేవకులమునఁ బుట్టె ననియు
దివ్యమహేశ్వరద్వేషమలీమస
భూదేవకులమునఁ బుట్టె ననియు
సన్మహర్షి దధీచిశాపోపహత మైన
భూదేవకులమునఁ బుట్టె ననియు
శివభక్తశివదాసశివకర్మతులఁ దిట్టు
భూదేవకులమునఁ బుట్టె ననియు
నావటువుఁ గూర్చి విషయ మంతంతఁ దెలిసి
దానికర్మ మట్లున్న దన్ తలఁపులోఁడ
నత్తవారింటి కాపుత్త్రి నంపెఁ దండ్రి
యభవువిధి దాఁట నౌనె బ్రహ్మాదులకును ? ౧౧౩

భస్మలాంఛితసువిశాలఫాల యగుచుఁ
గోడుకు వెన్నాడి వచ్చెడికోడలిఁ గని
స్మరహరద్వేషు లాయత్తమామ లపుడు
కనలి పెట్టిరి వేఱింటికాఁపురంబు. ౧౧౪

## చతుర్థతరంగము

పరశివకథార్చనధ్యానవర్జ్య మగుట
వల్లకాదుగ నన్నయావనతియందె
గౌరి సర్వదా సర్వమంగళనె నమ్మి
గడ్డుదినముల నెట్టెట్టొ కడపుచుండె. ౧౧౫

ఇట్టు లుండఁగ నొక్కనాఁ డింమధరుఁడు
శ్వశురు లెచటికొ వేఁగినసమయమందు
గౌరి నెచ్చరించఁగను డగ్గఱకుఁ జేరె
ముసలిబాపనిరూపము ముసరికొనఁగ. ౧౧౬

ఆవృద్ధద్విజవర్యుని
కావనిత సపర్య లిచ్చి యాదృతి నుండం
గా వచ్చె మామ యింటికి
నావిప్రుఁడు యువకుఁ డౌచు నంతటఁ దోఁచె౯. ౧౧౭

తనకు శివనామమననము దక్క యప్పు
డన్యగతి లేక వణఁకుచు నామె నిలువ
యువకుఁడు స్తనంధయుండుగా నొప్పి యామె
చెంతఁ దారాడుచుండె విచిత్రలీల. ౧౧౮

ఎవ్వాఁ డీబాలుఁ డని మామ యేఁచి పలుక
నిరుగుపొరుగులవాఁ డనియెను లతాంగి
మంచిపడి నీవు నితఁడు నస్మద్గృహంబు
వీడి పొం డని గెంటె వివేక ముడిగి. ౧౧౯

అశ్రుసిక్తముఖాబ్జయై యామె బాలు
నెత్తి, భవపరాఙ్ముఖుఁడు మహేశుఁ డీతఁ
డనుచు ధ్యానించు చారాత్రి యాడ నాడఁ
గడిపి తెలవార్చెఁ దప్పునే కర్మగతులు ? ౧౨౦

శివకుమారుఁడు గౌరిసచ్చిత్తవృత్తి
కలరి వృషభాధిరూఢుఁడై యచట నిల్చి
యరయువారెల్ల రచ్చెరు వంద నామెఁ
దోకొనుచు నెడలెను దనలోకమునకు. ౧౨౧

గౌరియు స్తనంధయుండు శంకరుని గొలిచి
సకలజన్మపరంపరాసంచితస్త
నంధయత్వము విడిచెఁ; బినాకియెడలఁ
దప్పవే క్రతున్యాయవేత్తలపలుకులు ? ౧౨౨

జనుల సృష్టించుమనువు ద్వ్యక్షుఁ డటంచుఁ
జెప్పుదురు పెద్ద; లీమె పూజించియున్న
మనువుమాత్రమే కాకర మనఁగఁ దగుచు
సృష్టిసుస్థితిలయములఁ జేయ వలఁతి. ౧౨౩

వ. ఇట్టు లుండ నొకానొకప్పుడు, ౧౨౪

నృత్తవిద్యానభిజ్ఞుఁ డీనృపతి యనుచుఁ
దన్నుఁ గరికాలచోళరా జెన్నినంత
రాజశేఖరుఁ డావిద్య నోజ నేర్చె
నాదినటవంశజుల కది యబ్రమగునె ? ౧౨౫

ఒకశివరాత్రిపర్వమున నొప్పుగ నాతఁడు శంకరార్చనల్
సకలము దీర్చి తద్వ్రతము చక్క నొనర్చి ప్రసన్నుఁడైనయం
ధకరిపు సుప్రసన్నుని నొనర్పఁగ నెంచి తదాలయాన రం
జకముగఁ దన్మయత్వమున నర్తనముం బొనరించె భక్తిమైన్.

అమితానందముతో నటించి, నటరాజాకారముం బూని యు
న్నమితాకుంచితదక్షిణాంఘ్రి కలముద్రన్ నిల్చి ఖిన్నాత్ముఁడై
ప్రమథాధీశుఁడు సర్వదా యిటులు నిల్వన్ గుందఁడే యంచు, వా
మము మోవన్ నిలుమంచుఁ దన్నువలె సంభావించి ప్రార్థించుచున్,

శివుఁ డానందమయుం డటం చెఱుఁగఁడో చిన్మూర్తి యారూపముల్
భవలింగంబులు నిశ్చలమ్ము లని సంభావింపఁడో గాక న
న్నవమానింతువె పల్కవే కదలవే హాలాస్యనాథా! భవ
త్సవిధన్ నాతల ద్రుంచి యిత్తు నని యుత్సాహింప సర్వేశుఁడున్.

అతనినిశ్చయ మది యభేద్య మ్మటంచు
నరసి యారాజుకోరినయట్లు గాఁగ
శివుఁడు నర్తింపఁజొచ్చె విచిత్ర మేమి?
అవిచలితభక్తి భక్తుల కమరెనేని. ౧౨౯

శివునివ్యత్యస్తనృత్యము

రాజశేఖరునభిమతార్థమ్ము దీర్ప
నటు విపర్యాసముగ నాట్య మాడెఁగాని
తనపనుల కెప్పు డన్యథాత్వమ్ము పొసఁగె?
భక్తపరిపాలనాపరిపాటిఁ దప్ప. ౧౩౦

అతఁడు సర్గస్థితిలయార్థ మైనభార
నిరతి యేవామపదమున నిలిపికొనెనొ
ఇపుడు తనదేహభారము నెల్లఁ దత్ప
దమ్మునను నిల్పె సహజ మాతనికి నదియె. ౧౩౧

అపుడు విపరీతతాండవ మాత్మహితము
నెంచి నటరాజు తాఁ బ్రదర్శించినంత
భూపతి సహస్రమణిగణభూషణములు
స్వాపరాధము నీఁగ నీశ్వరున కొసఁగె. ౧౩౨

ఇందుకళాశేఖరు సా
నందమహాతాండవము జనంబులు గని మి
న్నంది శివభక్తి యెడ దలఁ
గ్రందుకొన గణాధిపతులుగా నై రంతన్. ౧౩౩

పరశివభక్తితోఁ బరమభాగవతుం డలరాజశేఖరుం
డురుతరశంకరార్చన లహో యనఁజేయుచుఁ దత్కృపాత్తస
ద్వరమునఁ దత్కులమ్మున కుదారత తుంగత గూర్చుపుత్త్రునిన్
జిరమునఁ గాంచి రాజ్యమున నిల్పి శివైక్యము తాను బొందఁగన్.

ఆకులోత్తుంగపాండ్యుఁ డత్యంతమహిమ
రాజ్య మేలుచు నుండ రారాజు లెల్ల
రత్నములతోఁ గుమారికారత్నములను
గానుకల నెట్టి రయుతసంఖ్యలకొలంది. ౧౩౪

సమరూపవంశశీలలు
సమవర్తనలైనపుణ్యసతులం దతఁడున్,
దమదాంత్యౌదార్యవివే
కము లొప్పెడిసుతులఁ బడసె కాలగళుకృపన్. ౧౩౬

ఆదరగౌరవాదుల ననంతసపర్యలఁ దమ్ములెల్లఁ ద
త్పాదసమర్పితాత్ములును దద్గతజీవనులై ప్రవర్తిలన్
సాదరుఁడై యనంతగుణుఁ డగ్రజుఁడై మధురాధినాథుఁడై
మేదురకీర్తి కాంచెఁ బరమేశ్వరసత్కృపచేఁ గుటుంబియై.

తనకు పత్నీసమృద్ధి సంతానవృద్ధి
కులము తామరతంపరమై కుదురుకొనుట
పశుపతిప్రసాదలేశసంపద్విలాస
మని కులోత్తుంగుఁ డాత్మలో నలరుచుండు. ౧౩౮

శివునిదేహమునందుండి యవతరిలిన
వీరభద్రునిపోల్కి నీవిభుఁడు సుతులఁ
బూని శివశాసనద్వేషపూరితుల; న
శింపఁ జేయుచుఁ బుడమి శాసించుచుండె. ౧౩౯

వ్యాధుని మన్నించుట.

అప్పుడు బిడ్డతల్లి యగునట్టిసతీమణిఁ గూడి యాఁకటన్
దుప్పున దూలి దూపటిలి దుర్దశతో నొకబాపనయ్య తా
నప్పురి చేరి యచ్చటిమహావటవృక్షమునీడ నుండె, గా
డ్పప్పటికష్టనిష్ఠురల నంతటఁ జిమ్మఁగ సేవ దేరుచున్. ౧౪౦

అప్పుడు వికర్తనుండు మధ్యాహ్నవర్తి
యగుడు జగమెల్లఁ దప్తహేమాభ మయ్యె
పాంథసంచారము లడంగె బంభరమ్ము
లబ్జకోశాంతరములందు నణఁగి యుండె. ౧౪౧

అగ్ని లేకుండఁ దప్తమైనట్టిభూప
రాగములు వడగాలిచే రేఁగి యేఁచి
ప్రాణికోటిదృగ్బంధమై పరిఢవిల్లెఁ
గనులఁ గారము చల్లినకరణి నపుడు. ౧౪౨

బాహువు తలాడఁగా నీడఁ బండియున్న
పతిని గాంచి దాహపుఁజిచ్చు బాధ వెట్టఁ
బిడుచలుం గట్టునాల్కతోఁ బిలిచి పిలిచి
బిడ్డ చన్నుఁదావ నిట్లను బిసరుహాక్షి. ౧౪౩

వ. అయ్యా! ముప్పిరి గొన్నదప్పిచే నోరెండిపోయె. కొంచెము పానీ
యము సంపాదింపవే యనిన నాతఁడు, ౧౪౪

చని యొకసరోవరంబును
గని తామరపాకుదొప్ప గంగను గొని రాఁ
గను, నంతన శరవిద్ధతఁ
దను వుడిగినపత్ని నేడ్చుతనయునిఁ గనియెన్. ౧౪౫

అంతఁ బ్రియావియోగజనితాధికదుఃఖపరీతమూర్తి యై
యింతి! యి దేటికర్మబలమే? నను వీడఁగ న్యాయమే! ననున్
వంతలపా లొనర్తె? పసివానిని జూడవె యంచు నేడ్చి యా
ప్రాంతమునన్ ధనుర్ధరుఁ డునై చరియించె డిలుబ్ధకుం గనెన్. ౧౮౬

ముప్పిరిం గొన్న కోప మప్పుడె జనింప
నువిదయసువుల నీతఁడే యూడ్చియుండు
నని తలఁచి కేశములఁ బట్టి యతని నీడ్చి
కొనుచు రాజసన్నిధి సేర్చి వినిచె నంత. ౧౮౭

నేరము నారోపించిన
పారుని, నిర్దోషి ననుచుఁ బలుకుకిరాతున్
వేఱుఁ గులోత్తుంగుఁడు గని
యెవని దోషి యని నిర్ణయింపక యుండెన్. ౧౮౮

పరశివుకృపావిశేష మేర్పడక యున్న
సత్యనిర్ణయముం జేయఁజాల ననుచు
వేటకానిని బంధించి విప్రవరుని
శాంతపఱుచుచు శంకరు శరణ మడిగె. ౧౮౯

వ. పిదప "నీ వీబాపనిం గూడి యీరాత్రి నగరమందు సంచరించినచో
సర్వము నవగతం బగు" ననునీశ్వరప్రేరణ మాటని చెవిం బడినంత
నా జేఁడ ట్లొనర్చుచు నొకపెండ్లివారింటికడ నిలువ, ౧౯౦

"ఒకపక్షిం గుఱిసేసి యేసినశరం బుగ్రంబుగా స్ఫుటశా
ఖను నాటం దాలి బోయ; గాలి కది చక్కం గూలితచ్ఛాయలో
నొకచో నిద్రిలు బ్రాహ్మణాంగనకు నత్యుగ్రంబుగాఁ గాఁడ నా
యక చెల్లెంగద యట్ల యీపరుఁ డపాయం బంమఁ జూపం డిఁకన్.

పెండ్లి వాద్యాలసందడి బెదరి పక్షి
యొక్కయాఁబెయ్య యీవరుఁ ద్రొక్కి చంపుఁ
బదరి కొంపోద మనుయమభటులపలుకు
లాలకించెను తేఁడు బ్రాహ్మణుని గూడి. ౧౫౨

సంశయచ్ఛేద మైతేఁడు చక్క వచ్చి
వ్యాధుచెఱలను విడిచి బ్రాహ్మణుని కధిక
విత్త మొసఁగి సంతుష్టు గావించి పంపె
నీశ్వరానుగ్రహము గల్గ నేమిఁగొఱు? ౧౫౩

ఆకసమునందుఁ దిరుగుచున్నట్టిచంద్రు
నఖిలజనులుఁ గళంకియుం జాడుచుంద్రు
శంకరు సమాశ్రయించినచంద్రమసుని
కాకళంకశంకము లేని దయ్యెఁగాదె. ౧౫౪

ఆకులోత్తుంగుఁ డవల శివైక్యమంద
ఆత్మజుఁ డనంతగుణుఁడు రాజయ్యె నంత
మంత్రివర్యులు నిఖిలసామంతనృపులు
తనకుఁ జేదోడుగా నెల్లధరణి నేలె. ౧౫౫

## చతుర్థరంగము

### విప్రాధముని విమలీకరించుట.

ఉండె నవంతీపురి ను
ద్దండుం డొక బ్రాహ్మణుండు తనజనకుని దా
మెండుగ నిందించుచును బ్ర
చండక్రోధమునఁ బాపచండాలుఁ డనన్. ౧౫౬

సవతితల్లిని వఱఁగి యాయవగుణుండు
మించి యామెతో సతము భోగించుచుండె
నాపని సహింప నోపనియబ్బ నేని
చంపి కులటాజననితోడ సాఁగె నెటకో ? ౧౫౭

అబ్బసొమ్మును రూపసి యైనతల్లిఁ
గొనుచు నాబాపఁ డడవిదారిని చనంగఁ
దస్కరులు పసిపట్టి సుందరిని ధనముఁ
బుణికి మోఁదిరి బ్రాహ్మణబ్రువుని వారు. ౧౫౮

దిక్కుమాలినజీవితం బుక్కడంప
నాతఁడు కదన్నభిక్షల నంది తినుచు
భయదరోగగ్రస్తుఁడై కృశీభావ మంది
భాగ్యవశత వాఁడును గదంబవని చేరె. ౧౫౯

మధుర చేరుటతో మధుమధురముగను
అన్నవస్త్రము లందె; నావ్యాధి విడిచె
ఈక్షణముదాఁక మీనాక్షియీక్షణమున
నిచట క్షుధితుఁడు దుఃఖితుఁడేని గలఁడె ? ౧౬౦

అతఁ డొకరేయి మధురలో నాడనాడ
తిరుగుచు విలాసభాసురదీప్తముఖుల
రసికుల జగద్విలక్షణాలక్షితులను
గిరిచరసతీపతులను వీక్షించి మ్రొక్కి. ౧౬౧

వారిచనవు సంపాదించి పారుఁ డపుడు
తనయకార్యకరణముల దాఁచఁబోక
పలుకరించి పశ్చాత్తాపపడినయంత
వారు దయఁ జూచి నిష్కృతి పలికి రపుడు. ౧౬౨

ఎట్టూ ? యియ్యది కర్మయోగములఁ గానీ వేల్ తపశ్శక్తుల
ట్టిట్టై మేళ్ళావనీ మహేమయినఁ గానీ తీఱ దోయయ్యా యీ
ఘట్టంబంమున సుందరేశ్వరుఁడు దక్కం దీనికూ పార్వతీఁ
దట్టే తత్పరిచర్యలం జలుపుమయ్యా ధన్యతాసిద్ధికై. ౧౬౩

అనుచుఁ దిరోహితు లగుడున్
విని బాపం డామహేశు వేడుకతోఁ బ్రా
ర్థనపూజనజపనతులన్
వినుతింపంగనికరించె నిటలాక్షుండున్. ౧౬౪

ప్రమథగణంబులలోపల
ప్రమదంబున శివునికరుణ వడసియు బాపం
డమలినుఁడై చిరకాలం
బమరెను శివలోకమున మహానందమునన్. ౧౬౫

అంకశిష్యుని జయించుట.

అయ్యనంతగుణుం డాయనంత నేల
అంకుఁ డనునస్త్రగురుఁడు నిరంకుశుండు
రణభటాళికి నస్త్రశస్త్రములు నేర్పి
కాంచె నాతఁడు మిగుల జగత్ప్రసిద్ధి. ౧౬౬

ఛాత్రు లందఱిలోనఁ బ్రశస్తి వడసి
గురువునకుఁ బ్రీతిపాత్రుఁ డొక్కరుఁడు గలఁడు
సిద్ధుఁ డాతఁడు సుతనిర్విశేషముగ గ
ణించి పారంగతు నొనర్చె నంచి గురుఁడు. ౧౬౭

గురుదయ గురుదయ పరమే
శ్వరుదయయే దాని పరమసత్య మెఱుంగన్
గురునకు వశమే ? యయ్యది
తిరపడు చట్టునకు నొక్క తీఱమి గలదే ? ౧౬౮

ఆతఁడు బుద్ధిమాలి గురునంతటివాఁడు గురుప్రతిష్ఠలన్
భూతలమందుఁ జాటక కుబుద్ధిని తానె గురుండ నంచు నా
చేతనె శిష్యకోటియు విశిష్టత గాంచె నటంచునుం గురు
ఖ్యాతికి మచ్చఁ గూర్చు నహంయువుగాఁ జరియించుచున్నెడన్.

తదను శివాలయమ్మున సదాశివసేవ లొనర్ప నంకుఁడున్
సదనము వీడి పోవునదనన్ దగఁ జేరి తదీయపత్నిసిన్
మదమునఁ గూడ నెంచుఁడు, నుమాపతినిన్ శరణంచు వేఁడె నా
సుదతియు; భర్తృరూపమున సుందరనాథుఁడు తోఁచె లిప్తలో.

శివలీలార్ణవము

గురుధిక్కారము చేయు చాతఁడు మహాక్రూరాసి చేఁబూని ము
ష్కరుఁడై యాగురుశీర్ష మేయుటయు నాశ్చర్యంబుగా దాఁటి యే
డ్తెఱ నాతండును సంప్లుతోత్ప్లవితములన్ డీకొంచుఁ జిత్రంబుగా
మెఱసెన్ దద్రణరంగమందు సమరస్మేరాభిరామాకృతిన్. ౧౨౧

స్థాణువుంబోలె నతఁడు యుద్ధంబులోన
తత్ప్రహారాల కిటు నటు దప్పుకొనుచు
నాయుధమ్మును దిగఁబెట్టి యవనిపైని
మిక్కిలి యవజ్ఞ చూపించె నుక్కుమీఱి. ౧౨౨

అరిబలమ్ము తృణీకృత మైనయట్లు
నవ్వుచున్ దృష్టిఁ బఱపె నంధకరిపుండు
ఒక్క హుంకారటంకార ముఱిమినంత
భగ్న మయ్యె నాసిద్ధుకృపాణముష్టి. ౧౨౩

కత్తి పై కెత్త దించినకరణిఁ దోఁచు
దించినట్లుగఁ దోఁచి భేదించు శిరము
ఇచటఁ గానంగఁబడి తోఁచు నచట నిచట
అరికి నవకాశమే యీనియట్లు పెనఁగు. ౧౨౪

అంకునిసరూపతను గూడినట్టి శివుఁడు
కత్తిపదనున దేహము గాయపడక
సిద్ధునుదరము చీలిచి శిరము ద్రుంచి
అంకుజయముగ చాటించి యచటు వాసె. ౧౨౫

శివునిసన్నిధిలో నివసించుచున్న
యంకుఁ డదివిని యంకజయు మ్మదేమి?
అనుకొను చనాస్థతో వినివినక యుండె
నాతఁడు శివస్వరూపుఁడే యనిరి జనులు. ౧౭౬

ఇది యేమని శివు నడుగఁడు
కదన మ్మొచ్చుట జయంబు గాంచుట యొపరం
చెదఁ దలఁపం డైనను నా
పద కడ్డుంబడె శివుం డపారదయుండై. ౧౭౭

క్షుద్రఫలదులు సురలు కోకొల్ల లున్న
నయ్యచింత్యప్రభావు దయార్ద్రహృదయు
శివునిసాటి కా రని చలచిత్తులును వి
చిత్రముగ మాఱి నిశ్చలచిత్తు లైరి. ౧౭౮

బౌద్ధులు పంపిన మాయాసర్పగోష్ఠ హననము.

నాఁటినుండియుఁ బ్రజలలో నాఁటుకొనియె
గాఢతర మైనశివభక్తిగౌరవంబు
దాని నోర్వక బౌద్ధు లుద్దామగతిని
ఈశునిపై నాభిచారికక్రియ నెఱపిరి. ౧౭౯

ఆమున లేచి సర్ప మొకఁ డా క్రియనుండి జనించి మించి యు
ద్దామవిషాగ్నిభీషణకదర్థత మీఁదికి వచ్చుచుండ నా
భూమిపుఁ డార్తిఁ గుంది పురమున్ వడి వీడి పురారి నెన్నుచున్
గోమున దారుణాస్త్రముఁ దగుల్కొలిపెన్ దనవింట నుగ్రుఁడై.

ఆమహేశ్వరుభూషణ మైనదీని
ననుచు నెట్లని- మాయామయమ్ము గాన
శంక లేదని మనసు నిశ్చల మొనర్చి
అశుగముచేతఁ గొట్ట విషాగ్నిఁ జిమ్మె. ౧౮౧

ఆవిషాగ్ని జ్వలించుచు నఖిలజనుల
హాలహల మట్లు మాడ్చివేయంగ వారు
రాజుతోపాటు లోకశరణ్యుఁ డంచు
శరణు వేఁడిరి శంకరస్వామి నపుడు. ౧౮౨

అంతట కదంబవనవాసి యైనశివుఁడు
విగ్రహమునుండి ససిగ నావిర్భవించి
ఒక్కయట్టహాసమున మహోన్నతోర
గమును గిఱిఁ జేసి యార్తులకష్ట మణఁచె. ౧౮౩

పా మటులు చెల్లినంతనె
పామరులు తథాగతులును బగఁబట్టి మహా
హోమ మొనర్చుచు మరలం
దామసగోవును సృజించి తగిలించుటయున్. ౧౮౪

వ. అంత నావృషధ్వజుండు తనవాహన మైనవృషభమును నామా
యాగవిని జయింప నియోగించుటయు; ౧౮౫

చతుర్థతరంగము

పటుఖురోద్ధతధూళిపటలిఁ బైకెగఁజిమ్మి
గగనవీథుల నెల్లఁ గప్పికొనుచు
ఘనఘనాఘనము శృంగములతోఁ బడఁ గ్రుమ్మి
యాసారవృష్టుల నలమికొనుచు
పుష్కరావర్తకంబుల గర్జలను మించు
నంభారవంబుల నార్చికొనుచు
ధ్యానతపోయజ్ఞదానప్రభేదపా
దముల హైమతలమ్ము తన్నికొనుచు
రిపుల నూఁదివేసెద నన్నరీతి దోఁప
ముకుపుటమ్ముల నిశ్వాసములు విడుచుచు
గంగడోల్ కటిమూఁపు గ్రక్కదలుచుండ
కయ్యమునకు కాల్ద్రవ్వె శంకరునివృషము. ౧౮౬

ఒడ్డగిలంగ స్కంధతల మోరగఁ గొమ్ములు వంచి బుస్సటం
చడ్డము తిర్గి మూఁపు కదలాడఁగ మాయపుగోవుడొక్కలో
దొడ్డగఁ గ్రుమ్మి కూల్చి పరితుష్టిని జెంది గుహాల్ ఘణిల్లనన్
సొడ్డుగ భీకరారవమునుం బసవం డొనరించె వేడుకన్. ౧౮౭

ఏవిషాణమధ్యస్థమై యెసఁగుతలము
*అద్భుతగవాక్షమార్గమై యూజరద్గ
వులయెడంద దర్శింపఁగా వలనుపడునో
యట్టికొమ్ముల నాగవి మట్టు వెట్టె. ౧౮౮

---

*జరద్గవులు = ముసలిగోవులు-వేదములు, వేదముల హృదయము దేవుఁడే. నందికొమ్ములనడుమనుండి శంకరునిదర్శించుట సూచితము.

పాప మది కూలి పర్వత
రూపంబు ధరించె శంకరునివృషభముఁ దా
నేపున వృషగిరి యగుచున్
ఈపురి రాజిల్లుచుండె నీనాఁటికినిన్. ౧౮౯

అవ్వల ననంతగుణుఁడు శివైక్య మంద
కొడుకు కులభూషణుఁడు పాలకుఁడుగ నయ్యె,
తనకులోచితవిక్రమంబును నిలుపుచు
నమలచంద్రశేఖరభక్తుఁ డగుచు మిగిలె. ౧౯౦

*గాంభీర్యమందు శంకరునితూణీర మై
యీకులభూషణుం డెపుమిగిలె.
శత్రునిగ్రహమందు శర్వబాణం బయి
యీకులభూషణుం డెపుమిగిలె
ఔన్నత్యమునఁ బ్రమథాధిపుధను వయి
యీకులభూషణుం డెపుమిగిలె
వాగ్విభూతిని బశుపతికంకణం బయి
యీకులభూషణుం డెపుమిగిలె

సాటి లేనివిశ్వానురంజనమునందు
శంకరోత్తంస మగుశరచ్చంద్రుఁ డయ్యె
నిటులు సర్వాత్మతను బరమేశు నమ్మి
భువిని పాలించుచుండె నాపుడమిఱేఁడు ౧౯౧

*సముద్రము - విష్ణువు - మేరువు - శేషుఁడు - అగుచు అని నాల్గుపాదములకు సమన్వయము.

### శివుఁడు పాండ్యసేనాని ననుగ్రహించుట.

కులభూషణుఁ డామీఁదట
కులదైవత మైనశివు నకుంఠితభక్తిన్
గొలుచుచుఁ జతుస్సరిత్పరి
వలయితభూభాగ మెల్లఁ బరిపాలించెన్. ౧౯-౨

పరమభక్తుఁడు సుందరేశ్వరునిచరణ
కమలమధుపము సేనాని కలఁ డతనికి
ప్రాణమానధనాదు లాపరమశివుని
కర్పణము సేయు సుందరుఁ డనెడివాఁడు. ౧౯-౩

భూనుతుఁడై వెలుఁగు కులభూషణుఁ డన్నను సుందరాఖ్యసే
నానియుఁ బ్రాణ మిచ్చుచును నమ్మినబంటుగ సంచరింప న
న్యూనబలుండు చేదివిభుఁ డోపక తన్మధురాధిరాజ్యమున్
బూనిక నాక్రమింపఁ దలపోసెను సిద్ధ మొనర్చి సైన్యమున్. ౧౯-౪

అది గ్రహియించి ఱేఁడు చతురంగబలంబును వృద్ధిచేయఁగాఁ
ముదలయొసంగి విత్త మతిపూర్ణముగా దళవాయి కిచ్చి యీ
రణమునన్ జయమ్ము కలుగం బొనరింపు మటన్న సుందరుం
డది శిరసావహించి ప్రమథాధిపు వేఁడె జయార్థబుద్ధితో. ౧౯-౫

శివతరా! శబరేశు నిర్జితు నొనర్పఁ
బ్రభువునకు నీవె పూటకాపవుగదయ్య
మే మొకనిమిత్తమాత్ర కామే మహాత్మ!
నిన్నునమ్మినవారి కున్నె దోసంగు? ౧౯-౬

# శివలీలార్ణవము

అనుచు సైన్యాభివృద్ధి కయ్యధిపుఁ డిడిన
ద్రవ్యము సమస్తమున్ శివార్పణ మొనర్చి
శిల్పులను నిల్పి యాపరశివుని నెలవు
దివ్యమందిరమట్లు దిద్దించివైచె. ౧౯౭

గిరిశుఁడు శయనింప నిరవైనపవడంపుఁ
గోళ్లతల్పము సమకూర్చె నతఁడు
మణిగణస్థగితవిమానమ్ము సమకూర్చి
దేవదేవునకు నందించె నతఁడు
ఈశ్వరేశ్వరుఁడు నూరేఁగఁ గుచ్చులతోడి
బంగరుపల్లకిఁ బట్టె నతఁడు
నగరవాహ్యాళి యానగధరుం డొనరింప
బంగారుబసవనిఁ బట్టె నతఁడు
క్రమతర మైనరజతాశ్వగజవితతిని
హంసతూలికామృదులశయ్యాసనములు
మధురమూర్తికి ఛత్రచామరము లొసఁగె
సుందరేశ్వరుఁడై భక్తి కందళింప. ౧౯౮

క్షితిరథునకు క్షితిపతి యిడె
నతిసుందర మైనరథము నశ్వచయంబుల్
శితికంఠుండు శివేతర
మతులను సరిదిద్ది మోక్షమార్గము నూపన్. ౧౯౯

రాజు చతురంగబలము కూర్పంగ నిడిన
సర్వధనమును సుందరేశ్వరుని కట్టు
లంగరంగభోగములకు నై వ్యయించి
భక్తి మీఱంగ వినియోగపఱిచె నతఁడు. ౨౦౦

మంత్రులను ఱేఁడు సైన్యంపుమాట నడుగ
సర్వసన్నద్ధ మయ్యె నన్ జూడ నుడువు
ఎచట సేనలు ? కన్పింపుమీ యటన్న
నెల్లి దర్శింతు నని వచియించు నతఁడు. ౨౦౧

ఇది పని గా దని వారలు
మది సందియ మంది యొక్కమాఱుగ నతనిన్
గుదిగొని యడుగఁగ నాతఁడు
పదఁ డటు సైన్యములఁ గానఁబఱిచెద ననియెన్. ౨౦౨

సుందరుఁ డంత పాహి యనుచున్ బరమేశ్వరు సుందరేశు నా
నందమయుం దలంపఁగ ననంతముగా నట సేన దోఁచె నం
దందున ధూళి రేఁగుచు దిగంతము లంటె మహాబ్ధిఘోష నా
నందడి మించె నద్భుతము సాయుధమై తదనీక మొప్పఁగన్. ౨౦౩

పరిఘనలికత్రిశూలికాపట్టిసములఁ
బూని ప్రమథగణంబును బోలి సేన,
ప్రలయఃసమయవాతోద్ధూతపర్వతములఁ
బోలుగజబృందములును నబ్బురము గొలిపె. ౨౦౪

గార్దభమ్ము లొంటెలు బలీవర్దములును
గజములు వహింప వివిధోపకరణములను
బహువిధధ్వజయుతరథపటలి మించ
నామహాసైన్యమును గాంచె నధిపుఁ డపుడు. ౨౦౫

పద్మరాగకజ్జలకుసుంభకురువింద
వర్ణములు గల్గి వానవు లేగ్పడఁగ బలిసి
పవనవాకృతులను మసృణములు నైన
తురగబలములు కదలెఁ దేఁ డరయుచుండ ౨౦౬

విశదగంగానదీపరివీతమాళి
ఖడ్గఖేటకధరుఁడు ముఖ్యరుఁడు శివుఁడు,
కదనుద్రొక్కించి గుఱ్ఱము నదిమికొనుచు
నతఁ డనాది యయ్యును సాది యాచుఁ గదలె. ౨౦౭

చతురాననాస్యమందురఁ
గుతుకమ్మున వేగఁ జేరుకొననేమొ వియ
ద్గతి గలవేదతురంగము
నతఁ డదలిచి మెడను దట్టి యూఁపుచు నుండెన్. ౨౦౮

బాణముంబోలెఁ దూలి యుప్పరము నంటు
నశ్వమును గళ్లె మూని సవ్యాపసవ్య
గతుల నడిపించు నతఁడు తద్గర్వ మెల్లఁ
దివిరి చులుకనగా నిరోధించుచుండె. ౨౦౯

అతఁ డెదు రగుతేనికి నాకృతిని వ
హించువీరరసంబట్టు లెదుర నిలిచి
ఖడ్గముష్టిగఁ దా నమస్కార మిచ్చి
యేమిముద లన్నరీవితో నెసక మెసఁగ. ౨౧౦

ఇతఁ డవితర్క్యవైభవుఁ డదృష్టచరుం డని భూపుఁ డాతనిన్
గుతుకమిూఱఁ గాంచుచు ననూన మనంతబలమ్ముఁ జూచుచున్
అతనియుదగ్రమూర్తి తనస్వాంతము భావమునున్ హరింప న
ద్భుతపడి నిల్చెఁ బల్కుటకుఁ దోఁపక నిశ్చలవృత్తి నయ్యెడన్.

కొంతవడికిఁ దేఱికొని యామహామహుఁ
గాంచి ప్రీతిపూర్వకముగఁ బలికి
కనకవస్త్రమణులు కానుక లర్పించి
కౌఁగిలించి మ్రొక్కి కడఁకఁ బలికె. ౨౧౨

నేను 'దోఁమను గెలువ యత్నించుచుండ
మదగజంబె లభించె నీమాడ్కి నాకు ;
చాలు' ననుచుండ నొకగూఢచారి వచ్చి
చేదివిభుఁ డీల్గె వేఁటలో సింహహతిని. ౨౧౩

వ. అని వచింప నిదియుఁ బరమేశ్వరానుగ్రహంబ యని ప్రముదితుండై
యాయాశ్వికునికి సెల వొసంగి పంప నంత నాతఁ డామహాసైన్య
ముతోఁ దక్షిణంబ యుంతర్హితుం డయ్యె. ౨౧౪

తుది కిడంతయు లీలాకుతూహలి యగు
మధురనాథునిమహిమగా మది గ్రహించి
పూర్వసేనాధిపతికి మెప్పులు ఘటించి
కొండెగాండ్ర శిక్షింప వాఁ డొనను లేఁడు. ౨౧౫

నాఁడు నాసర్వధనము సేనాని యెటులు
పరమశివుసేవ దీర్ప నర్పణ మొనర్చె
నటులె నాదుసర్వస్వ మాయభవునకు స
మర్పణ మొనర్తుఁగా కని యాత్మఁ దలఁచె. ౨౧౬

అపుడు సర్వస్వదక్షిణ మైనక్రతువు
శివునిగూరిచి తా నొనర్చెను విభుండు
ఈశ్వరార్పణముగ సర్వ మిచ్చి యతఁడు
కంకు లెడలిననివ్వరికంబ మయ్యె. ౨౧౭

పరమకరుణాకరుండు శంకరుఁడు లేని
కోశగృహములు వెలితి గైకొనుట చూచి
వ్యయము కారానియంత యక్షయధనంబు
చేర్పఁ దనగుడి మణిగణచిత్ర మయ్యె. ౨౧౮

వైశ్యాంగనలకు వలయదానము.

దారువనాంతరంబున యథాయథలై పరమానురాగవి
స్తారలు నై శివున్ వలచి తత్పరతం జరియించు కాంతలన్
వారిపతుల్ శపింపఁగ నవారితకోపమునం దదంగనల్
తీరుగ వైశ్యవంశసుదతీమణు లై మధురం జనింపఁగన్, ౨౧౯

కాలము గతింప నా వైశ్యకామినులకు
యౌవనంబులు పొడసూపునంత, నెదల
స్మరుఁడు స్మరహరుఁడును నొక్కసారిగానె
చేరి మిత్రులవలెఁ బ్రవేశించి రపుడు. ౨౨౦

నున్ననికావిబట్టలను నూతనరత్నవిభూషణంబులన్
గ్రొన్ననలన్ ధరించి యొకకోమలరూపవణిక్కుమారుఁడై
క్రన్నన వైశ్యవీథిఁ బడి గాజులసెట్టిగ వచ్చి శంకరుం
డన్నవలాలదృష్టి పడునట్టులు సంచరణం బొనర్చెఁగన్. ౨౨౧

పడఁతి ! యనంగుఁ డిప్డు సుమబాణము లాశివునందు రిత్తలై
చెడుటను గాజు లన్మిషముచే శరముల్ గొని సంచరింప ని
య్యెడ కరుదెంచె సత్య మని యెన్నుచు నవ్వులఁ బల్కరింపుచున్
బడఁతులు గాంచి రాతని నభంగవిలాససువిభ్రమంబులన్. ౨౨౨

వ. పిదప నాగాజులసెట్టికిని వైశ్యయువతులకును బరస్పరాశయస్ఫో
రకచమత్కారమేదురసరసవచనరచనానైపుణ్యమున నుక్తిప్రత్యుక్తు
లీక్రిందివిధంబున నుల్లసిల్లె. ౨౨౩

"పరిణతం బైన దాడిమీఫలము లేక
పసిఁడిగజనిమ్మపండ్లో నా కొసఁగి మీరు
గాజుల ధరింపవలెఁ గాని కాంతలార !
ధన మదేలను గొండపై మనెడినాకు ? ౨౨౪

నాకు మీ కాంచిదేశమేగాక శరణు
లేనలే దని నిన్న పల్కితిగదయ్య
ఇపుడు కొండపై వాసమం చేల యనెదు
పలుకుదబ్బరలేల రూపజితమదన ! ౧౧౫

ఇప్పు డతనుజ్వరము చేత నేఁ దపింతు
బింబఫలములతోడ వైద్యంబు వలయు
తరుణి యెవ్వతెయేఁ జికిత్సను బొనర్ప
పాంథుఁ డగు నాకు శరణ మాపడఁతిగాదె. ౧౧౬

పూని యుచితోపయోగము లేని దాట
నిష్ఫలము దొండపండీయ నేమి యయ్యొ ?
దీన మదనాశ్రయుఁడ వయి తిరుగునీకు
విజ్వరత గల్గునే యెంత వెఱ్ఱివయ్య ? ౧౧౭

కాచవలయము లియ్యవి గట్టి వనుచు
గుత్తముగ నిన్న తొడిగితి కోరె నీవె
నీవు వెడలినయంత నన్నియును జాఱె
నెటులు నీమాట నమ్ముదు నేను చెప్పుమ ? ౧౧౮

శ్రమగజదంతమయములు గాజు లొసఁగి
*కాంచికార్థము నొక్కఁడేగాని నేను
కోరలేదు రత్నములు బంగారములను
అది ప్రతిశ్రుతమయ్యు ఈవైతి వకట ! ౧౧౯

---

* కాంచికార్థము = కటిసీటికొఱకు; నీనితంబముకొఱకు.

విద్రుమమయుంపువలయముల్ వేడ్క నిమ్ము
నాకు విద్రుమమణి నొసంగవె లతాంగి!
దంతపుంగాజులందు మోదంబు నాకు
తరుణి! నీదంతపదము నే నెఱుఁగనైతి. ౨౩౦

అని వారికరగ్రహణము
లొనరించుచు వైశ్యవీథు లోలిఁ దిరుగుచున్
త్రిణయనుఁ డాతరుణుల స
జ్జనుల సఫలపఱిచె సరససల్లాపములన్. ౨౩౧

అలరి తన్మనిధర్మపత్నులరహించి
శాపకలుషముక్తలుగఁ దా నసి యొనర్చి
ఉభయజన్మములందుఁ ద న్నొందియున్న
తరుణులను జేర్చె కైలాసగిరికి శివుఁడు. ౨౩౨

కులభూషణధరణీపతి
మొలమిన్ మీనాక్షిసుందరేశ్వరులకృపా
ఫలముగ రాజేంద్రాఖ్యున్
*గలితనయున్ రాజసింహుఁ గాంచెను సుతులన్. ౨౩౩

దుర్విషయలోలుఁ డౌచు దుందుడుకుమీఱ
ననుజుఁ డటు పెడదార్ల త్రొక్కినను గాని
తండ్రితరువాతఁ దండ్రి యన్ ధర్మ మెఱిఁగి
చేరఁదీసి జ్యేష్ఠుఁడు రాజసింహుఁ బెంచె. ౨౩౪

---

*ఒప్పుచున్న నీతికలవాఁడు రాజేంద్రుఁడు; కలియుగనీతులకు లోఁబడినవాఁడు రాజసింహుఁడు.

## చోళరాజు ననుగ్రహించుట.

పాండ్యునికి శత్రువని మహాప్రతిభ గన్న
చోళనాథుఁడు సుందరేశుని భజింప
మధుర కేతేరఁ దలఁచి నెమ్మనమునందు
సంతతధ్యాన మొకపుడు చలుపుచుండె ౧౩౫

ఎన్నటికినేని మధుర కే నేఁగువాఁడ
నే? మదంబిక మీనాక్షి నింగనెదనె?
సుందరేశ్వరుఁ గనులారఁ జూతునే య
టంచుఁ బాండ్యుఁడు నిద్రింప నపరనిశను. ౧౩౬

శంకరుఁడు నిద్రలోన సాక్షాత్కరించి
కోరి గూఢముగా మేలుకొలిపి యతని
తనగుడికిఁ దెచ్చి యనురక్తి యినుమడింప
గోపురకవాటములఁ జిటుక్కనను దెఱచె. ౧౩౭

జలక మాడెను హేమపుష్కరిణియందు
తాల్చె నెమ్మెన నూత్నవస్త్రముల నతఁడు
సుందరేశ్వరు మీనాక్షిఁ జూచి మ్రొక్కి
షోడశోపచారముల మెచ్చుగ నొనర్చె. ౧౩౮

మంత్రపుష్పనీరాజనమండితముగ
నాజగత్పితరులకు సాష్టాంగ మెఱఁగి
వచ్చెఁ దదనుగ్రహమున నివ్వాలకు తేఁడు
గోపురద్వారములు మూసికొనె తమంత. ౧౩౯

తా నుషఃకాలమందె సుందరునిగుడిని
దరిసి పాండ్యుఁడు రాజముద్రలకుఁ దొలఁగి
వృషభముద్రాంకితమ్ములై బిగిసియున్న
గోపురకవాటములు దృష్టి గోచరించె. ౨౮౦

సంశయగ్రస్త మయ్యె భూజానిమనసు
తెలియ నడిగె నమాత్యవృద్ధులను దాని
నెవ్వ రే మనఁగలరు? స్వామీ యిదేమి?
చంద్రశేఖర! యనుచు నాస్వామి వేఁడె. ౨౮౧

పరశివుఁడు గగనవాణిన్
జరిగినకథ దెలుప సంతసము పొందుచు నా
ధరణిపతి పాండ్యుఁ డవ్వల
నరితో మైత్రిని ఘటించి యలరె శివేచ్ఛన్. ౨౮౨

పాండ్యసేన ననుగ్రహించుట

చెడుగు రాజానుజుఁడు రాజసింహుఁ డంత
అన్నరాజేంద్రుతో గలహమ్మొనర్చి
చోళపతి కల్లువాఁ డగుచున్ గుబుద్ధి
మధురను జయింప మామతోఁ గదలఁదలఁచె. ౨౮౩

అంతట వారు సైన్యసముద్రగులు పాండ్యజిగీషతోడ నా
వంతయుఁ జింత లేక మధురాభిముఖంబుగ దండులెత్త సా
మంతముతో జల మ్మనెడిమాటను నేనియు నింకఁజేయుచున్
రంతులు ద్రొక్కి గ్రీష్మము ధరన్ బొగిలించుచు వచ్చె నుద్ధతిన్.

౨౮౪

జీవనదులలోని జీవనభారము
సైత మెండి సకలసైన్యములకు
ప్రాణగొడ్డ మయ్యె భాస్కరుగమనము ౨౩౯
మందగించె దైర్ఘ్య మొందె పపలు.

తపనుఁడు నిర్దయుం డగుచు ధారుణినెల్లఁ దపింపఁజేయు, నా
యపయశ నూనిదాఘమున కయ్యెను, మంత్రి దురాత్ముఁడై మహా
కృపణత లోకులం గమిచి క్రిందును మీఁదును గాన కుండి తా
నృపతిని ముంచి ముప్పుల వినిందితుఁ జేయుట తథ్యమే గదా ?

శత్రుమిత్రతటస్థవిచార ముడిగి
దుష్టుఁడు నిదాఘుఁ డీజగత్తును దహింప
మారుఁడును దచ్ఛరావిద్ధమానవులును
శర ణనిరి వనితాకుచగిరుల నప్పుడు. ౨౪౦

మదనుఁ డొకవంక పురిగొల్పి యదుముచుండ
నుక్కపోతల గ్రీష్మ ముఱ్ఱాఁతలూపఁ
గామినీదృగంచలము లక్కజము గదురఁ
గాముకులమీఁది కేగతాగత మొనర్చె ౨౪౧

రవిని గనక పద్మిని శిశిరమ్మునందు
బ్రతికియుంట లోకులకు సుస్పష్టమె కద
నేఁడు సూర్యుఁడు వైభవనిరతి వెలుఁగ
జీవనవిధాన మెట్లు నశించె నకట ! ౨౪౨

## చతుర్థతరంగము

భ్రమరము తప్తపద్మమకరందము నాని వికాస మందుప
ద్మమున దివాకరోగ్రకరతాపభయమ్మున; మొగ్గలో సమీ
రము చొరరాని నక్కినియు, రక్తి తొలంగి శయింపదయ్యె నా
కమలసుకుట్మలమ్ములఁ బ్రగాఢపుఘర్మము పిచ్ఛలింపఁగన్. ౨౫౦

వెల్లు తప్తము లైనకొబ్బెరలసీళ్లఁ
దమిని ద్రాక్షేక్షురసములఁ ద్రావి త్రావి
దప్పి తొలఁగని ప్రియులు మోదమున ప్రియల
ప్రేమశీతలాధరము గ్రోలిరి తపించి. ౨౫౧

పడమటివడగాలులచే
వడి నెగసెడిధూళి నీరువట్టున నాభూ
పడఁతి మరీచికలకుఁ బ
ర్విడునో దిగంతముల కన్నవిధముగఁ దోఁచెన్. ౨౫౨

అలసరస్సులు పల్వలమ్ములుగ మాఱెఁ
బల్వలములెల్లఁ బచ్చికపట్టు లయ్యె
శాద్వలములెల్ల జాంగలస్థలము లయ్యెఁ
బుడమియు శ్మశానముగ బొగుల్ బొగులు మనియె.

అగ్నికిం గాలి తోడనునపయశమ్ము
వాపుకొననేమొ వాతసంపర్క మెడలి
యే దవాగ్నులు రేఁగి దహించుచుండె
వృక్షగుల్మలతాయుతవిపినములను. ౨౫౪

చల్లఁబాటువేళఁ బెల్లగింపఁగఁబడి
చంద్రఘృణులచేత స్నపిత మగుచు
ప్రియులు తా ముషస్సమయముల నందించు
బిసము కోకవితతి మెసవుచుండె. ౨౫౫

ఈపాటినీటిలోపల
నీప్రళయము గనుపఁగలుగమే యని చేఁపల్
ప్రాపింప నొక్క మడువును
దాపాహతమహిషవితతి దానిఁ గలంచెన్. ౨౫౬

మిహిరుఁ డుదయించుమున్నె తుమ్మెదలు గదలి
పద్మమకరందఝురులలోపల మునింగి
*రక్తిమదనాపమృత్యుహారకము మంత్ర
రాజము జపించుచున్నట్లు లోజ మెఱసె. ౨౫౭

*కటకమును జండభానుఁ డక్కటికఁ జేరఁ
జోళపతికటకము వ్యర్థం జొక్కె నపుడు
రవిప్రకాశంబువలె పాండ్యరాజు దైన
దివ్యతీవ్రప్రతాపము తేజరిల్లె. ౨౫౮

అంత నాపాండ్యభూవిభుఁ డమలభక్తి
సుందరేశ్వరుచరణారవిందములకు
మ్రొక్కి నీయనుగ్రహబలమున్ గ్రహించి
ప్రాప్తబలముతో శత్రుపైఁ బడియె నంత. ౨౫౯

*మదనునికి అపమృత్యుపరిహారార్థము. కటకము=కర్కటకరాశి.

అసికుంతశూలాదు లగునాయుధమ్ముల
పరశుపట్టిసమహాపరిఘతతుల
యాఘాతముల రక్త మంతంతఁ బ్రవహింప
నగణితస్వపరసైన్యమ్ము నగుచు
సకలదేవతల కాశ్చర్యావహం బౌచు
నారదానందసంధాన మగుచు
నొకట భుజాభుజి యొకటఁ గచాకచి
యొకట ముష్టీముష్టిచకిత మగుచు
రూఢదృఢమత్సరులును బ్రరూఢబలులు
నైనయాశూరసేనల కంత కంత
జరిగె యామత్రయము మహాసంగరంబు
అస్థిరజయాపజయ మయి యబ్బురముగ. ౨౬౦

తూలఁ బుష్పించుమోదుగుతోఁటపగిది
తురగఖురధూళిధూసరాధూమ్ర మగుచు
నుభయసైన్యముల్ దప్పి గొంతులు దహింప
యుద్ధమును మాని తహతహ నొందె నపుడు. ౨౬౧

శిశిరకుంభసహస్రవాసితను బ్రపను
బాండ్యసేనకు శివుఁడు కల్పన మొనర్చి
తనశిరోగంగతో నింపి దప్పి తీర్చి
విభుని దనకరుణామృతవృష్టిఁ దనిపె. ౨౬౨

సింహనాదము లొప్ప నాసేన తిరిగి
యమితబల మంది యుద్ధరంగమున కుఱికి
రాజసింహుని నాచోళరాజు బలిమిఁ
బట్టి బంధించి జయముఁ జేపట్టె నంత. ౨౬౩

అరివిజయ మంది పాండ్యుఁడు
మఱలుచుఁ దత్త్వపను గనక మధురేశ్వరున
త్కరుణాకల్పిత మని యెద
గురుతరకౌతుకపరీతకోమలుఁ డయ్యెన్. ౨౬౪

అతఁడు మధురేశ్వరునిభక్తుఁ డనుచుఁ గనిక
రించి చోళవిభున్ సత్కరించి పంపె
పృథులగర్వాతిరేకదుర్మదుని దమ్ము
రాజసింహుని మన్నించి రక్షవెట్టె. ౨౬౫

మధురలోనిషుధార్తుల వెదకి వెదకి
మీనలోచన భుక్తి నెమ్మిని నొసంగు
సుందరేశుఁడు నీరిచ్చి చూచి కాచె
ననుచు జనులెల్లవా రప్పు డాడుకొనిరి. ౨౬౬

రాజేంద్రునికి రాజరాజనుతుం డైన
రాజేశపాండ్యపుత్త్రికుఁడు గలిగె
ఆరాజచంద్రుని కమలగుణుం డగు
రాజగంభీరు డక్కరాజు వొడమె

అతని కనంతపుణ్యాలవాలుం డగు
పురుహూతజిత్తనుపుత్త్రుఁ డొదవె
అతనికి పాండ్యవంశారామచందనం
బన కులధ్వజుఁ డనుతనయుఁ డొప్పె

ఆతనికి సుందరేశసేవాత్తబుద్ధి
సుందరేశాంఘ్రిశేఖరసుతుఁడు పుట్టెఁ
దారకాచంద్రనిర్మలోదాత్తయశము
నాతఁడు వెలార్చె సకలదిగంతములకు. ౧౬౭

ఇది:- శ్రీమదాత్రేయసగోత్ర, దువ్వూర్యుపనామకపవిత్ర,
పెదశేషయార్య శేషమాంబా ద్వితీయపుత్త్ర, మహా
గాయత్రీశరణ్య, గురువేంకటరమణకారుణ్య
సూర్యనారాయణశాస్త్రి ప్రణీతం బైన
ఆంధ్రశివలీలార్ణవ
మహాకావ్యంబున
చతుర్థతరంగము
సమాప్తము.



# శివతత్త్వార్ణవము

## పంచమ తరంగము



పరమశివపాదశేఖరపాండ్యరాజు
స్వీయవంశానుగతశివప్రీతి విడక
యాసముద్రక్షితీశుఁ డై యఖిలజనులఁ
జల్లఁగా నేలుచున్ రాజచంద్రుఁ డయ్యె. ౧

గుఱ్ఱములు వేయి నూ ఱేనుఁగులును బదియు
యరదములుఁ బదివేలసైన్యమును గలిగి
యాయమును మించువ్యయము చేయకయె యతఁడు
భవునిసేవార్థ మధికసంపదల నొసఁగె. ౨

వేశ్యకు స్వర్ణదానము

పుష్పవన మనుపేర నపూర్వ మైన
యొకశివక్షేత్ర మచ్చట నొప్పుచుండు
నది కదంబకాననమున కనతిదూర;
మందు జనియించె రుద్రకన్యక యొకర్తు. ౩

పేరునకు హేమనాయిక
యారమణియు మైనమున నుమాశివరూపుఁ
దీరిచి నిరతముఁ బూజల
హారతులన్ వ్రతములను దదర్చలు దీర్చెన్. ౪

దివ్యమగుభక్తి నామహాదేవుప్రతిమ
స్వర్ణమయ మొనర్పఁగ మానసమునఁ దలఁచి
తగినసాధన మామె పొందంగలేక
కోర్కె దృఢముగ, నామె మ్రొక్కులకు మెచ్చి. ౫

శంకరుఁడు సిద్ధరూపశి
వంకరుఁ డై యామెపుణ్యవశత నతిథియై
పొంకముగ హేమనాయిక
వంకకు రా నామె పరమభక్తి భజించెన్. ౬

భక్తిభావవినమ్రమై పడఁతి యంత
బహువిధసపర్యలను దృప్తిపఱుప నతని;
హరుఁడు రససిద్ధిదర్శనపరత నొక్క
బసుమ మొసఁగి తన్మహిమము పలికి చనియె. ౭

భస్మసంపర్కకలనఁ దద్భవనమందుఁ
గలయయోమయమెల్ల బంగార మగుడు
శివునిప్రతిమ సువర్ణముం జేసి యామె
నమితభక్తిని దాని ముద్దాడుకొనియె. ౮

చెక్కిలిని నొక్కి మోము కుంచించి ముద్దు
పెట్టియు నఖక్షతమ్ము కావించుకతన
హరునిచెక్కిట నీనాఁటి కమరి యుండె
నానహాల్ చంద్రఖండిక యంటినటులు. ౯

క్రతువుల వేదాధ్యయన
వ్రతనియతుల దానధర్మపరత నలభ్య
స్థితి గలతనసాయుజ్యము
శితికంఠుం డామె కొసంగెఁ జింతామణియై. ౧౦

శివుఁడు పాండ్యసాదియై చోళుని జయించుట

అంత నొకనాఁడు చోళభూకాంతుఁ డెదిరి
పూర్వవైరము దీర్ప నపూర్వరీతి
పాండ్యవిభునిపై దండెత్తి పడఁగ నతఁడు
శివునిపద మంటి తన్ను రక్షింప వేఁడె. ౧౧

"ఎదురు మీసేన యెంత వీఁ డెంత నీకు
నీ వొకనిమిత్తమాత్ర మేనే జయింతు
భయము లే" దనునశరీరవాణి వెడల
నదిని జలనిధివోలెఁ గ్రన్నన నెదిర్చె. ౧౨

కసితో వారలఖడ్గదేవతలు సంగ్రామోగ్రరంగస్థలిన్
హాసనంబట్లు తళత్తళల్ మెఱయ నాట్యం బాడుచుండ దంతిసం
విసరంబున్ గసికోఁత వెట్టఁగను బర్వెన్ నెత్తుటేరుల్ వడిన్
ముసరెన్ దుట్టలు గట్టుచున్ భటశవమ్ముల్ గుట్టపుం దేహముల్.

తతనిశితబాణవర్ష మంతటను గుఱియ
మృతులఁ గొవనున్నయసుభటవితతు లచట
మంచిమాటల వారిఁ బిల్పించికొంచు
దవ్వుదవ్వుల నిలిచె నుత్తలము గొనుచు. ౧౪

## పంచమతరంగము

అనిలశరీరముల్ దినుటకై కొఱగానివి, పార్థివంబులన్
గొనఁగను బాణవర్షమునకుం దెగిపోవు నటంచు భూతముల్
తనివిగ మాంసకీకసములం దిన నట్టిటు పర్వు లెత్తుచున్
రణరణకంబు లాఁచు రణరంగము చేరవు, వీడి పోవవున్. ౧౫

అనిఁ దెగి నాకలోకమునకై పయనించెడివారి, దాఁరియం
దున మరలం బరాస్త్రము లెదుర్పడి చంపఁగ నూర్ధ్వలోకమున్
గొనుటకు నిప్పు డర్హు లయి కొల్లలుగాఁ జనుయుద్ధవీరులన్
గొనగొని వారి కిబ్బడిగఁ గూర్చిరి స్వస్థిని నాకదేవతల్. ౧౬

వీరస్వర్గ మలంకరించుభటు లువ్విళ్లూరి రంభోర్వశీ
వారంబుం గవియన్; దదీయసరసప్రాగల్భ్యవాగ్రీతు లా
తీరుల్ తాము గ్రహింపలేక మది నెంతే సిగ్గుచేఁ జేష్ట లా
ధారంబై పశువృత్తి సౌఖ్యముల నందం జూతు రన్వారిగన్. ౧౭

అట రణస్థలిఁ బడినశ్వేతాతపత్ర
ములును గజదంతములును; దిక్కులను నింపఁ
బోవుకీర్త్యంకురము లనఁ బొదలుచుండెఁ
జేరి చూచువారలకుఁ గ న్చెదరిపోవ. ౧౮

సాదులు సహాశ్వముగఁ జచ్చి స్వర్గమొంద
నెవరిహయముల వారెక్కి యేఁగుదు రట
సాహసార్జితస్వర్గసంచారదశను
వాహ్యవాహకస్మృతి వారి వదలదయ్యె. ౧౯

అగణితఘోనభోంతరము లప్పుడు గప్పినయాంపరాశిచే
స్థగితము లౌట ఘోరరణధామము గ్రుంగెను జిమ్మచీకటిన్
మొగి నపు డాజయాంకరము మోదముతో నభిసారికాగతిన్
బగటుగ సంచరించుచును భంగుర యయ్యె వరింప నొక్కనిన్.

ఉభయసైన్యములందు మదోద్భటు లగు
భటులు పలువురు గ్రుంగ దివంబు నిండె
దేవపత్నులు గృహములు దివ్యభూష
ణాంబరవిమానములను వా రాక్రమింప. ౨౧

అంత హతశిష్టసైన్యము నరసి పాండ్యుఁ
డచటు వాయంగఁ దలఁప నల్లంతలోనె
సాదిరూపాన నాపురశాసనుండు
తులకరించుచుఁ దాను ముందునకు సాఁగె. ౨౨

అంత సరోషభీషణమహోర్భటితోడఁ బురారి శూలమున్
సంతసగాఁగఁ ద్రిప్పుచును జ్వాలలు గ్రక్కఁగఁజేసి యారణా
భ్యంతరమందు నడ్డిడ ననంతభయంబునఁ జావుపర్వులన్
వింతగ నీఁగలట్లు పరపీరులు తాఁటిరి కాందిశీకులై. ౨౩

కొంద రాత్మీయు లన్ గొనక పర్విడువారి
    విమతు లన్ భ్రాంతితో వేఁడ శరణు
తరులతలకు జుట్లు తగులుకొం టెఱుఁగక
    యరులె పట్టి రటంచు నడలుకొనఁగ

నెత్తు రోడఁగఁ బర్వులెత్తువారిని గాంచి
తమ నెత్తు రని స్పృహ దప్పి పడఁగ
అమ్మ! బాబూ! కుమారా! చచ్చితి మటంచుఁ
బలవరించుచు డప్పిపట్టి కూల

జీర్ణ శిలపైని జలధార చిందినట్లు
లల్ల సుడిగాలి డుల్లుకారాకు లట్లు
చెదరి రాయుగ్రదేవునిచిత్రరూప
మరసి, యది యంతలో మాయమయ్యె నపుడు. ౨౪

భండనమునందు నాశివపాదశేఖ
రార్యసైనికుల్ తమతమప్రాణములను
దృణములుగఁ జేసి యుండుట నేమొ విమతు
లచటితృణముల నమలుట యభ్యసింత్రు. ౨౫

చోళుఁడు ముక్తకేశుఁ డగుచున్ బెడదారిని బట్టె నశ్వమున్
దోలుచు వంశగౌరవ మధోగతిపాలొనరించి పర్వుచున్
జాలినసైనికాళి తనచాయను రా నొకకొండకాల్వలోఁ
గూలి మునింగె నుగ్రునియకుంఠిత తేజమునన్ దివాంధమై. ౨౬

చోళభూపాలశిబిరముల్ జొచ్చి పాండ్య
బలములు సువర్ణరత్నసంభరితములగు
బహువిధవిభూషలను జలపట్టి తివిచి
ఱేనికి నొసంగ శివుని కర్పించె నతఁడు. ౨౭

భక్తసౌమ్యుని కథ

కలఁడట భక్తసౌమ్యుఁ డనఁగా నొకబాపఁడు శైవుఁ; డాతఁడుర్
కలధన మన్నదానమునకై సతతమ్ము వ్యయించి తద్వ్రతా
కలన మహేశుపూజల నకల్మషరీతిని దీర్చుచున్ ఋణం
బులకు ఋణంబుసేసి వ్రతమున్ నడపెన్ బరమార్థచింతలన్. ౨౮

అప్పులవా రాతనిఁ గడుఁ
దిప్పలు వెట్టఁగ వ్రతంబు తీర్పఁగలేమిన్
దప్పక నాయసువులను శి
వప్పకు నప్పన మొసంగువాఁ డటంచున్. ౨౯

చేరి వ్రతభంగదుఃఖాతిజీర్ణుఁ డగుచు
నామహేశ్వరుపాదము లంటి యెఱఁగ
నెమ్మి నక్షయతండులనిధి యొసంగి
యతని రక్షించె శివుఁడు దయాళు వగుచు. 30

వైశ్యవటువు ననుగ్రహించుట

ఆరాజధానియందు న
పారమహావిభవుఁ డర్థపతి యనుపేరన్
దీరుగ వసించు వంశాం
కూరరహితుఁ డగుచు వైశ్యకులభూషణుఁడై. 3౧

ఆతఁడు వృద్ధుఁడౌచును సమార్జితవిత్తము మేనయల్లునిన్
బ్రీతిగఁ జేరఁదీసి యిడి పిల్లగు మోహపుబంధ మూడ్చి యా
భూతపతిం దలంచి తపమున్ బొనరింప వనప్రవృత్తి శీ
తాతపముల్ సహించుచు నహర్నిశమున్ మునివృత్తి నుండఁగన్.

నేరిచినట్టిజ్ఞాతులతని ధనముం జెఱపన్ గుమారకున్
జేరియు రాజకీయ మగు చిక్కులు కల్పనచేసి బాధలం
గూరిచి పెక్కు బాములఁ దగుల్కొనఁజేయ వణికొన్నతుండు జో
హారొనరించి యావఁధురయఁదలిసుందరునిం దలంచుచున్. ౩౩

జ్ఞాతిబాధలు పడలేను స్వామి! యోమ
యస్కరా! శరణంచు సాష్టాంగపడఁగ
శివుఁడతని మేనమామగ నవతరించి
సకలబాధలు దీర్చి రక్షణమొసంగె. ౩౪

వరగుణుని పాతకము తొలఁగుట

తనశివారాధనైకసత్వంబుకలనఁ
బుట్టె శివపాదశేఖరభూపునకును
వరగుణుండు శివభక్తితత్పరుఁడు సుతుఁడు
తండ్రి దివమును సుతుఁడు భూతలముఁ గొనిరి. ౩౫

వరగుణుఁడొక్కనాఁడు తనవారువ మెక్కియు వేఁటలాడుసం
బరమునఁ గాననమ్మున కపారజవమ్మునఁ బోవ దారిలోఁ
దరుతలశాయి బ్రాహ్మణుఁడదాటుగ గ్రమ్మ తురంగఘట్టనన్
తిరుగుముఖాన దాని గుఱితించుచు జేఁడమితార్తిఁగుందుచున్.

అక్కటా! బ్రహ్మహత్యామహౌఘ మిపుడు
దాపురం బయ్యె నాకేదిదారి యనుచు
వివిధజపదానహోమాదివిధుల సుంద
రేశ్వరు భజించియున్ శాంతిహీనుఁడయ్యె. ౩౬

హరిణాంకధరుఁడు పశుపతి
కరుణామయుఁ డౌట నతనిఁ గరుణింపఁగ నీ
శ్వరుఁ డిట్లు పలికె వత్సా!
గుణియించితి నీదుభక్తి కుందకు మదిలో. ౩౮

అమరుఁ గావేరితటమున నర్జునాఖ్య
వృక్ష, మానీడలోన మధ్యములలింగ
ముండు దాని సేవించితివో సమస్త
దుష్కృతమ్ములు తుప్పనఁ దూలిపోవు. ౩౯

త్ర్యంబకేశ్వరుతత్త్వబోధమ్ము వినియు
వరగుణుఁడు చోళుని జయింప నరుగుమిషను
అర్జునేశ్వరు సేవించి యాక్షణంబ
బ్రహ్మహత్యామహాపాపభార ముడిగె. ౪౦

పాము కుబుసంబు నూడ్చినభంగి ఱేఁడు
పాపకూర్పాస మూడ్చి నిష్పాపుఁ డగుట
రాహువదనవిముక్తచంద్రమసువలెనె
మహిని జిర మేలుకొనె దీప్తిమంతుఁ డగుచు. ౪౧

గాయకభద్రుని రక్షణము

కలఁ డారాజున కిష్టుఁడున్ మిగులఁ బ్రఖ్యాతుండు వీణావిద్యల, భద్రుం డనువాఁడు, శంకరసపర్యాత్తప్రభావుండు నిచ్చలు సద్భక్తిఁ గదంబకాననమహేశానున్ మహాగానసంకలనావాదనఁ దన్పు కాసుకృతి మెక్కంబోవఁ దేప్రొద్దున్. ౪౨

ఆమహాగాయకుండు రాజాశ్రయమునఁ
జిరము వసియింప, వాని నిర్జింపఁ దలఁచి
ఠీవిఁ దనకీర్తి దెసలఁ జాటించి కొనుచు
వచ్చె నొకగాణ తేనిదివాణమునకు. ౮౩

భక్తురక్షింపఁదలఁచి యాపరమశివుఁడు
అలశశాంకమండిత శిరస్థలమునందుఁ
గట్టెమోఁ పెత్తి యొకబీదకరణి వీథి
నేలలను బాడుచును విక్రయించుచుండె. ౮౪

మధురవీథుల మధురాతిమధురముగను
నిలిచి పాడుచు నమ్మ; నౌదలఁ గలట్టె
యేటఁ గట్టెలు తడియుటయే తడవుగ
మ్రోడులు చిగిర్చె నవ్వి యమ్ముడగు జెటులొ? ౮౫

ఆతఁడు కట్టె లమ్మ నడయాడుడుఁ దత్పదధూళి దేవతా
వ్రాతము మౌనిసంఘము శిరంబులఁ దాల్పఁగ గానమాధురీ
రీతులు పల్కులుం గులుకరింపఁగఁ గోకిలలున్ గతాగతిన్
జేతము లుల్లసిల్ల నతిచిత్రముగా గుమిగూడి రెల్లరున్. ౮౬

అంత నాతఁడు నూత్న గాయకునివసతి
కెదురుగా మోఁపు దించి కన్నెత్తి చూచి
బడలికలు వాసి సుమధురఫణితి దోఁప
వేడ్కతోఁ బాడె శిలలు ద్రవించి పోవ. ౮౭

షాడబాడబభేదవిస్తరత మెరయ
శాకలీకైకలినిషాదకలన మొప్ప
రాగసాంకర్య మొందక రక్తి మీఱి
తాన మేపార మధురగీతాలు పాడె. ౪౮

కట్టె లమ్ము వానిగానమాధురిఁ జొక్కి
క్రొత్త గాయకుండు కొసరి యతని
"ఏది సంప్రదాయ మెవఁడు నీ గురుఁ డన"
భద్రుగీతిరీతిఁ బట్టి తనెను. ౪౯

కట్టెలమోఁపు లమ్ముకొను గాయకశిష్యుఁడె యిట్టు లైన ని
ప్పట్టున గానవిద్య నలభద్రు జయించుట వట్టిదంచుఁ దా
గుట్టుగఁ జెప్పకుండ నెటకో చనె భీతిని నవ్యగాయకుం
డిట్టిజయమ్ము ఱేఁడు వినియెన్ దనభద్రుని సత్కరించెనున్. ౫౦

అవనిపతి యిడ్డమణిభూషణాదు లెల్లఁ
దనకు శివకృపచే లభించె నని యతఁడు
వానితో పాటు తనముపార్జితమ్ము
పుణ్యశివయోగులకు దారవోసె నపుడు. ౫౧

కవుల గాయకులకుఁ గల్పకమ్మువంటి
చేరపతి సత్కృతిం బొందఁజేయఁ దలఁచి
తనదునాస్థానగాయకోత్తముని భద్రుఁ
జంద్రశేఖరుఁ డంపెఁ దత్సన్నిధికిని. ౫౨

పంచమతరంగము

తొలినాటిరేయి కలలో
నలికాక్షుఁడు భద్రుకు విషయ మంతయుఁ దెలుపన్
బలువిధముల నాతనిబూ
జల సేవలఁ జేరవిభుఁడు సత్కృతి చేసెన్. ॥3

సుందరేశ్వరుదయ భద్రునందు సతత
మెట్లు వృద్ధి గాఁజొచ్చెనో యట్ల యతని
కీడుతో పాటు భక్తియు వృద్ధి నందె
సేవ్యసేవకభావవైచిత్రి యదియె. ॥4

నియతిమై షట్కాలనిత్య పూజ లొనర్చి
వీణియ మీటి సేవించు నభవు
నందికి ముందు ననాచ్ఛాదితమునందు
ధ్యానమగ్నతఁ గొనియాడు నభవు
ఆనందబాష్పమ్ము లవని జాఱఁగ భక్తి
భావసంపన్నుఁడై పాడు నభవు
సోఽహ, మస్మి, బ్రహ్మ యనుభావనమునఁ జి
న్మూర్తిని భావించి మ్రొక్కు నభవు

కలితభక్తిని బట్టఁబగ్గములు లేక
భద్రుఁ డీరీతి సలుప శాంభవసపర్య
లతని తనలోనఁ జేర్చుకో నవసర మని
కర్కశపరీక్ష కపుడు శంకరుఁడు పూనె. ॥5

శివలీలార్ణవము

ఘనఘనాఘనమహాగర్జారవంబుల
బాధిర్య మబ్బె దిగ్భామినులకు
దివ్యతేజస్సముద్దీప్తవిద్యుత్కాంతిఁ
బ్రాణికోటికిని దృగ్బంధ మలమె
హాలాహలోద్గారితాశనిపాతాల
భూకాంతగర్భము పొగిలి పగిలె
భూనభోంతరసముత్పూర్ణాంధకారాన
నఖిలసృష్టియును రూపఱి యడంగె
ప్రలయఝంఝాప్రభంజన పటలి వీఁచె
పూర్ణదిగ్బంధ మొదవెపో భువనములకుఁ
గాని భద్రుఁడు హేమపుష్కరిణి మునిఁగి
శివునిసన్నిధి గానము చేయ విడఁడు. ౫౬

అతఁడు ప్రభాతసమయ మైనంత మేఘ
రంజి మహిరంజి రాగముల్ రక్తి నాల
పించి ప్రకృతినిఁ గూడ ద్రవింపఁజేసె
ననఁగ వడగండ్లవాన మేఘాళి కురిసె. ౫౭

వీణ వడగండ్లతాఁకున విఘటితమ్మె
కొంకరలువోయెఁ జేతియంగుళులు చలికిఁ
గంప మందె సర్వాంగము గాని యతఁడు
విడఁడు నిష్కంపవృత్తితో మృడుని సేవ. ౫౮

అతఁడు ఘనపంకమగ్నము లగు పదములఁ
గదుపలేనిదుస్థితిచేఁ బొకాలుచుండ
నవ్యమణిమయవిపులాసన మ్మొకండు
ఎదుట సాక్షాత్కరించె సర్వేశుకృపను. ౫౯

అందుఁ గూర్చుండి శివసక్తమైనదృష్టిఁ
ద్వరమె కానక నిత్యకృత్యమును దీర్చ
సతనియమవిచలితస్థితి కాత్మ నలరి
ప్రకృతిని యథాస్థితికిఁ దెచ్చెఁ బరమశివుఁడు. ౬౦

వ. చంద్రశేఖరపాండ్యుఁ డాభద్రునిస్థితి వినుటకతనఁ దదాసనము వీక్షించుటకతన శివునియందుకంటె శివయోగులయం దమిదభక్తిం బ్రవర్తిల్లుచు మలయధ్వజవంశమహానిధి యగుశంకరుని ప్రసన్నుం జేసికొని బహుశ్రుతుఁ డగు రాజరాజను పుత్రుని బడసి రాజ్యభార మాతనిపై మోపి తాను భూభారవాహకంబు లగుపన్నగముల ధరించె, నాపై రాజరాజు. ౬౧

హరసఖుఁ డనుసద్భావము
నిరతము తనపేరుచేతనే చాటుచు శం
కరునే తల్లిగఁ దండ్రిగ
గురువుగ ప్రభువుగఁ దలంచికొని ధరనేలున్. ౬౨

అభవుభక్తుఁడు భద్రగాయకుఁడు గూడఁ
గాలము గతింప శివునిలోకంబు సేర
నతని మించినతత్పత్ని యభవునకును
గానవిద్యలఁ జేయు పట్టాలపూజ. ౬౩

ఆనారీమణి రాణివాసమున కాహ్వానింపఁగాఁ బోయి త
ద్గానానూనవిచిత్రశక్తి నటనాదబ్రహ్మముం జూప న
ద్దానిన్ మెచ్చక రాణి యంత కలహోద్రగాత్రయై యుండె నా
భూనాథుండును భార్యయన్నటులు తప్పాల్ పట్టె వక్రాత్మతన్.

భద్రుసత్పత్ని నవమానపఱుపఁదలఁచి
సింహలమునుండి యారాజశేఖరుండు
గానకోవిదు రా లోకమానవతిని
బ్రీతితోఁ దుతఁ దాఁ బిలిపించె నటకు. ౬౫

ఒకరిని మించి యొక్కరు మహోజ్జ్వలగానము తేనిముందుఁ బ్రాం
దికగను గాంతలిర్వురు సుదీర్ఘముగాఁ బచరింపఁ బ్రొత్తయా
మెకు జయ మంచు తేఁడు మెఱమెచ్చులుపల్కెను, భద్రుభార్య యా
తికమకమాటలన్ విని మదిన్ మధురేశ్వరునిం దలంచుచున్. ౬౬

మహిపతు లకారణంబ సామర్షులగుచుఁ
జదురు లాడినయంత నష్టమ్ము లేదు
సుందరేశ్వరుసాన్నిధ్యమందె తిరిగి
తారతమ్యపరీక్ష సిద్ధమ్ము మాకు. ౬౬

అని పలుక రాజు విధిలేక యట్లొనర్చెఁ
గింకరులె యోడువారు జయాంకులకును
అనెడిపందెము సఱచి యాయమ్మలపుడు
పరశివునిముందు సభ చేసి పాడి రంత. ౬౭

మురళి విడిచి పరివాదిని
పరివాదిని వీడి వీణపట్టియు వారల్
స్ఫురితవము ఘాలుక గంపిత
వరగమకము లురల గానఘణుతులు నెఱపన్. ౧౯

భక్తపక్షపాతి పరసుందరేశ్వరు
మాయ గప్పి సభ్యమండలికిని
భద్రుభార్యగాన ఫణితియే నచ్చెను
జేడు గూడఁ బలుకరించె నటులె. ౨౦

సింహలద్వీపకాంత దాసిగ వసింప
భద్రుపత్ని రాజ్ఞీరవపాత్ర మయ్యె
అవల సుగుణుఁ డన్ బుత్రుఁ డా నంది రాజు
యౌవరాజ్యపదంబునం దతని నిలిపె.  ౨౧

కోలకిశోరములకు సన్యదానము

నతమతియై కుమారసుగుణుండు సమస్తమహీంభరమ్ము న
ద్భుతముగఁ దా వహింప నలఫున్ సొలపుం జవికేని లేక త
త్పిత యగురాజరాజును మదిన్ మృగయారతితో వనేచర
ప్రతతిని గూడి కాననములన్ దిరుగాడె సధిజ్యధన్వుఁడై. ౨౨

అటుత గొలుసులు గలగల లాడుచుండ
వేఁటకుక్క లార్భటి మీఱ వెడలు నపుడు
మేలుకొని తరక్షువులు సమీపకుంజ
పుంజముల వీడెఁ దెఱనూళ్ల మోము లొప్ప. ౨౩

చుట్టుముట్టి మొఱఁగుచుం దమ్మెదుర్కొను
వేఁటకుక్కగమిని వాట మైన
వాఁడిగోళ్లఁ జీల్పఁ జూడ సివంగుల
బాణహతిని ఱేఁడు భంగపఱిచె. ౬౪

ఒకకడ నేణి పాల్ గుడుచుచున్న శిశుద్వయముం ద్యజించి యే
లిక గుఱి చూచి యేసినబలిష్ఠశరంబునఁ ద్రుంగనున్నదు
ప్పికి వడి నడ్డమై నిలిచి ప్రేముడి దానికి రక్షవెట్టి యం
బకహతిఁ దాను గూలెఁ బతిభక్తి మృగాళికిఁ గూడఁ జాటుచున్.

శబరభటు లార్చుచును సటాచ్ఛటలు వట్టఁ
గదలమెదల లేకున్న సింగమ్ముకూడ
భ్రూకుటివిటంకభయదవిస్ఫురితదృష్టి
మించి హరినాళిపైకి సారించుచుండె. ౭౬

అధిపుఁ జేసినవన్యమృగాళినెల్ల
వ్యర్థముగఁ గొనిపోవునాయమునిచింత
వన్యమహిషముల వధించి వాహనములు
గానొసంగుచు రాజు చక్కఁగఁ దొలంచె. ౭౭

చమరవరాహఖడ్గవృకజాలము రాజిటు వేఁటలాడుచున్
దమకము దీఱ శ్వాపదంబులనెల్లఁ జరించుచుండ దీ
మమున వరాహ మొక్కఁ డతిమన్యుసముజ్జ్వలమూర్తియై వధో
ద్యమమున ఱేనివైపున కదాటుగ దాఁకెను ఘుర్ఘురించుచున్. ౭౮

కులిశనిశాతధార గలకోరలతో శబరప్రవీరులన్
నలిగులిగా నొనర్చుచుఁ గనారిలు తేఁచుల ముష్టిత్రోపులన్
గలఁగుఁడువెట్టుచున్ మదమునం దమకించుచు జేనియశ్వమున్
బలిమిని గోరలం జమరివైచెను గాళులు విర్గి కూలఁగన్. ౭౯

దానివడి గని విభుఁడు రథంబు నెక్కి
యంబుదము జలధారల నద్రిని వలె
జ్వలితముఖములు గలబాణజాలములను
దాడిత మొనర్ప నదియు నుత్తలముఁగొనుచు. ౮౦

వ. అవ్వరాహంబు రథమును రథసారథినిం దదశ్వములను నుగ్గునూ
చంబు గావించి విజృంభించినంత నామహారాజు— ౮౧

జంగమమహాగిరీంద్రము
భంగి సపక్షకముగ నభంగురవృత్తిన్
బొంగి పడెడిదేకలమున్
జంగున ఖడ్గాభిహతిని జంపె నలంతన్. ౮౨

తెగుచుఁ బడినదానిదేహము కృతకాద్రి
తుల్యమగుచు నెచట దొరలినదియొ
యచట నున్నగిరియు నానాఁటినుండి వ
రాహశైల మనుచుఁ బ్రథితి గాంచె. ౮౩

కోలఁకులఁ దల్లిని న్నమకికొంచు క్షుధార్తము లౌచుఁ బందిపి
ల్లలు పదిరెండు వెంబడి కలంతను నచ్చటు సేరి తల్లినిం
బొలిసినదానిఁ గాంచి పలుపోకల గుర్గురులాడి చుట్టుచున్
బలిసినయాఁకటం ధరణిపై వడిఁ గూలెను నీరసంబులై. ౮౪

మునుల భక్తులఁ గాపాడ మున్నె యోగి
కింద్రతటమున నున్నభూతేశుఁ డపుడు
పందిపిల్లలతల్లిరూ పొంది వచ్చి
చేఁపి స్తన్యామృతమునఁ బోషించె వాని. ౧౫

పోరిని బురాజనిక్ వృషలపుత్రులునై మునిశాపదగ్ధులై
ధరణి వరాహదేహు లయి తప్పక పుట్టుచు బాములందుచున్
బరశివసుస్తన్యామృతముఁ బాన మొనర్చుటఁ దక్షిణంబె, యు
ద్ధరణము నందికోలముఖతన్ నరరూపము లంది పుట్టుచున్. ౧౬

ఆపండ్రెండుగు రఖిలక
ళాపరులై రాజ్యతంత్రలక్షణ విదులై
రూపొందిరి; శంకరునిన్
రాపాడినవారు సూకరము లగు టరుదే? ౧౭

వరవరాహత్వధారణవాసనావ
శముననో యన వార లీశ్వరునిచరణ
యుగము వెదుకంగ సీజని నెగడినారు
కొండగుహ లిండ్లుగాఁ గూర్చుకొన్నవారు. ౧౮

శంకరుననుజ్ఞ వారి నిశ్శంకముగనె
మంత్రుల నొనర్చె తేఁడు సామమునఁ దెచ్చి
అండదండలుగాఁ జిర ముండి వారు
పరశివునియందు నైక్యభావంబుఁ గనిరి. ౧౯

అవల నారాజరాజు శివైక్య మందఁ
బాలన మొనర్చెఁ గొడుకు భూపాలుఁ డగుచు
శంకరునియందు స్థిరతరసక్తి గలిగి
పాండ్యవంశాబ్ధిచంద్రుఁ డన్ ప్రతిభ మిగిలి. ౬౦

ఖంజరీటానుగ్రహము

ఒకఖంజరీట మాఁకలిఁ
దికమకగొని బట్టబయటఁ దిరుగుచు నుండన్
శుకవులు కాకులు తన్నుచు
వికలపఱుప భీతి శరణు వేఁడెఁ బరేశున్. ౬౧

కాకభయమున మిగులఁ జీకాకుపడిన
కవియు నాశివాలయవిటంకమున దూరి
యణఁగి హేమపుష్కరిణిని మునక లిడుచు
నిత్రుపాసాల దినములు నెట్టుచుండె. ౬౨

దిక్కుమాలినయాపక్షి దేహమెల్ల
మలినమే గద; యది జన్మముల నొనర్చె
నా? మహాదానధర్మమంత్రములఁ దీర్చె
నా? మహాదేవు శరణనె నంతె కాదె. ౬౩

దానిప్రవృత్తియుఁ జేష్టల
నూనతపస్సుగఁ దలంచియో పరశివుఁడ
ద్దానికి నాత్మబలం బిడెఁ
దా నయి; శివశరణుకన్నఁ దపములు గలవే? ౬౪

మృత్యుభీశమనమ్ము సర్వేశుకృపయె
దాని బలవద్విహంగముగా నొనర్చె
నతిబలిష్ఠులల్లో బలం బనఁగఁ బరమ
శంకరదయార్ద్రపరమాణుసారమె కద. ౯౫

శివునను గ్రహమ్ముచేత నావిహగము
సకలపక్షికులప్రశస్తి నొందె
దానివంశమందుఁ దసరినవిహగముల్
నేఁటి కెన్నటికి బలిష్ఠములగు. ౯౬

భక్తబకమును బ్రోచుట.

సరసులయందుఁ గల్గుజలజంతువులెల్లఁ బరస్పరక్షుధా
పరతను నొందునొంటి మెసవం గడుపాతకమంచు నెంచి కొ
క్కెర యొకఁ డట్టిచెయ్వులు ముగించి కదంబవనీస్థహేమపు
ష్కరిణిసి దాన మాడి బిసఖండము లాని శివున్ భజింపుచున్.

మానిమాంసాశనమ్ము నిర్మమతమీఱ
సలిపె నాహారనియమనచారుచర్య
దృఢతరమ్ముగ శివుని సంధించి మదిని
హరునికైంకర్య మొనరించెఁ జిరతరమ్ము. ౯౭

దానిఁ బరీక్షింపంగాఁ
బూని మహాదేవుఁ డంతఁ బుష్కరశూన్యం
బౌనటు సరోవరంబుం
దానై కావించె బకము తాపము నందన్. ౯౮

నకనకలాడి యాబకము నాఁటికి నాఁటికిఁ జిల్లుటాఁకలిన్
వికలమనస్కమౌచు దరినే తిరుగాడెడి చేఁపపిల్లలన్
జకితముగాఁ గనుంగొనుచు జంచువు చాచుచు మాను చెట్టకే
లకుఁ బిశితాశనమ్మునకు లాలసవృత్తి నుపక్రమింపఁగన్. ౧౦౦

కడగి నవనీతకోమలాంగమ్ము గలుగు
చేఁపపిల్లను ముక్కునఁ జేర్చి పట్టి
యంతలో వ్రతభంగ మౌటాత్మఁ దెలిసె
మోహ మచిరద్యుతి వివేకమూర్తులందు. ౧౦౧

వెంటనే చేఁపపిల్లను వీడి కొంగ
యెంతకుపథమ్ము పట్టితి నే నటంచు
ప్రాణములు వీడఁగాఁ జలపట్టె నహహా!
సాజమె యపత్రపిష్ణుత సజ్జనులకు. ౧౦౨

భక్తబకముఁ గావఁ బరమశివుం డంత
నల్లసితమృణాలపల్లవముగ
స్వర్ణపుష్కరిణిని జక్కఁగ నొనరించె
భక్తపాలకుండు భవుఁడు కాఁడె? ౧౦౩

మహాప్రలయాగమనము

స్వర్గముం జేర సుగుణ భూపతియుఁ బిదప
నతిరథమహారథులు భూపు లవతరించి
రాకులంబు నిరాకులం బౌచు భువిని
సాగె నా ప్రళయము మహాసాగర మటు. ౧౦౪

వ. పిదప సమస్త జగత్తునకు బ్రలయోపద్రవంబు రా, ౧౦౫

నానావిధభయంకరానూనధూమకే
తువులు దిక్కులయందుఁ దోఁచె మింట
ప్రాతరారంభవేళల భీకరధ్వాంత
*మరుణుఁ గప్పెను గబంధాకృతిగను
అవనితలాన సహస్రవార్షిక మౌచు
నుగ్ర మయ్యెను మహావగ్రహంబు
తఱిదప్పుచుఁ జతుర్విధప్రాణికోటులు
నశియించె వంశహీనత వహించి

జలతుహినవర్షణమ్ము మిక్కిలి యొనర్చ
తపనుసప్తరశ్ములును సంతప్తము లయి
పోలికలు చెడ్డయీరేడుభువనములను
వేఱు వేఱుగ ఱేఁగి దహింపఁ జేసె. ౧౦౬

కరఁగి నీరై యెండి కరడుగట్టి శిలావ
శిష్ట మయ్యె హిమాద్రి చిత్రముగను
బడబాగ్ని మఱఁగి నీరెడలి యాదోరాశి
చితుక నబ్ధులుఁ గషాయితము లయ్యె
జలశూన్యచంద్రమండలపత్రదవిరశ్మి
జాల మేఁచెను తేల జగమునెల్ల
శేషపూత్కారవర్షితమహావిషభీష
ణము లౌచు సప్తవాతములు వీఁచె

---

* కబంధాకృతి = రాహువురూపము

పాదపతృణాదిచేత నిష్పచ్చరమయి
పొగిలి బీటలువాఱిన భూమియందు
ఆచమింపఁగఁ జాలునీ రైన లేక
గగనకుసుమమె యయ్యె మేఘములమాట. ౧౦౭

శోషించి లోనీరు చూర్ణములై కుల
గిరులు వాతోద్ధూతకేళిఁ దేలె
అణఁగుచుఁ బొడముచు నాదిత్యమండలం
బులు స్ఖలద్గతుల దివ్వెలను బోలె
బలిసద్మమంటుదుర్భరసూర్యతాపాన
సమసిపోయెను నాగజాతియెల్ల
అమితవాతత నజీర్ణము పట్టి భువిని స
ర్పములెల్ల లుబ్బలుబ్బలుగఁ జచ్చె
సుధయును ద్రవ మాట శోషింపఁగా సుధాం
ధసు లైరి వడి గతాంధసులు గాఁగ

ఆదికూర్మవరాహశేషాహివరుల
యడుగునవసించుమునికోటి యబ్బురపడి
యాననం బెత్తి 'యిది యేమి' యనుచుఁ బైకిఁ
గనె నవజ్ఞతో మూఁడవకన్ను దెఱచి. ౧౦౮

పిదప బ్రహ్మాండభాండనివిష్టవిలయ
ధూర్జటినిటాలనేత్రాగ్నిధూతములయి
చటచటార్భటితోఁ బ్రేల జగములెల్ల
భూర్భువస్సువరో మంచు బుగ్గిఁ గలిసె. ౧౦౯

ఉదధిగర్భస్థలవణాబ్ధు లుదరి యుప్పి
డగ్నిసంపర్కమునఁ బెఠల్లనుచుఁ బగిలి
అలశతఘ్నీవినిస్సృతశిలలవలెనె ౧౧౦
తూలి పరమేష్ఠికొలువున నేలఁ బడియె.

ప్రలయరుద్రుని విషమనేత్రజమహాగ్ని
సూర్యులను వాతములఁ గూడఁ జుట్టి కాల్చె
నెంతబలవంతుఁ డైనఁగానీ జగానఁ ౧౧౧
దన్ను మించుబలిష్ఠుచేఁ దప్ప కణఁగు.

గిరిశిఖరవిస్ఫులింగవికీర్యమాణ
మగుమహాప్రలయాగ్నిజిహ్వలఁ దపించి
యలచిరంజీవు లగుసనకాదులెల్ల
వేఁకిఁ బడి పర్వి రాబ్రహ్మలోకమునకు. ౧౧౨

పరమశివుసుప్రసాదసంపదలఁ బొదలి
మనెడిమధురాకదంబకాననమునందు
స్వర్ణపుష్కరిణీపరిసరములందు
ప్రమథులు యథేచ్ఛముగ విహారములు గొనిరి. ౧౧౩

జగములఁ జల్లార్ప నెగడి కపర్దిక
పర్దమందుండి నభంబు నిండ
ఘనఘనాఘనము లొక్కట రేఁగి వర్షించెఁ
జినుకు లేనుఁగుగున్నలను హసింప

విలయాగ్ని యాజలబిందుల దిగమ్రింగెఁ
జెలఁగి జ్వాలాభీలజిహ్వ లార్చి
జలకణప్రశమితప్రలయాగ్నిధూమాతి
సాంద్రమ్ములై మేఘసంఘములును
మిగులవర్షింపఁ గోపాన మితులుమీఱి
గాఢవిలయాగ్నికీల లాకాశ మంటి
యభ్రముల మ్రింగఁబోయెనో యన్నరీతి
గనులు మిఱుమిట్లుగొనఁ దటిద్గణము లొప్పె. ౧౧౪

అయుతయుగయోజనోన్నతి నందుకొనియు
సలిలపాతకుంఠితములై చక్కఁబడిన
ధూమమహాప్రలయాగ్నిజిహ్వాలను, బ్రియక
వనమునందలి ప్రమథు లేర్పడఁగఁ గనిరి. ౧౧౫

ప్రలయకాలమహాగ్నికిఁ బ్రలయమేఘ
తతులకుఁ బరస్పరమ్ము యుద్ధమ్ము నడువ
అభ్రముల కివి జ్ఞాతులై యగుట నేమొ
పిడుగు లగ్నితోఁ గూడి బిట్టడలఁ బడియె. ౧౧౬

ప్రలయకాలనిరంకుశుల్ ప్రలయరుద్ర
దేహసంభవు లిరువురు దీప్తదేహు
లైనను జయించె నగ్నిఁ దా నంబుదమ్ము
భువనసంతాపులకు జయంబు లెటు గల్గు? ౧౧౭

శివలీలార్ణవము

వారిదభయానకాశనిపాతనిస్వ
నముల గుండెలు చెదరిననలువ కచట
నిదురపట్టక తనదీర్ఘనిశలఁ గూడ
జాగరావస్థఁ బగళ్ళులై జరుగుచుండె. ౧౧౮

తారకాసూర్యచంద్రవిహీనమగుచును
బవళులు రేలు నిప్పచ్చ యయ్యె
పావకమారుతప్రతిభలెల్ల నశించి
లోకప్రవృత్తి చీకాకు వడియె
కాలదిగ్భువనప్రకారతల్ రూపఱి
గగ్గులకాఁడయ్యెఁ గర్మసరణి
తతశుభాశుభవర్జితముఁ దమోమయమునై
యొకదీర్ఘతామసి యొప్పి నిలిచె

అలయజాండము వెలుపలి దైనజలము
లోపలిజలమ్ముఁ గలిసి కల్లోలితముగ
ధ్రువము మొదలారసాతల మవఘళించి
ప్రబలి ముంచెత్తె నాజలప్రళయ మపుడు. ౧౧౯

భూతలరసాతలాకాశముల వసించు
మర్త్యసర్పసురాదులు మణఁగినారు
కాని తజ్జలాస్తరణఁ జక్కఁగఁ బరుండె
కలితవటపత్రశాయి జగన్నియంత. ౧౨౦

# పంచమ తరంగము

భవ్యకరపద్మమునఁ బదపద్మమూని
మించుముఖపద్మమునఁ జొప్పించికొనుచు
నిఖిలలోకైక రక్షణోన్నిద్రమతిని
బాలకుం డౌచుఁ గ్రీడించు లీల శౌరి. ౧౨౧

ముజ్జగంబులు మున్నీట మునిఁగియున్న
మునుఁగదు శివాజ్ఞఁ గాదంబవన మొకండె
అందు బుద్బుదోదరమందునట్లు గిరిశుఁ
డంబతోఁ బ్రమథులతోడ హాయి నుండె. ౧౨౨

ముకుళించె నలచతుర్ముఖుమోముఁదమ్ములు
సాగదయ్యెను జరాచరసిసృక్షు
కాలకల్పనము దిక్కా-మొగంబులుపట్టెఁ
దొలినుడుల్ బుద్బుదంబులటు దేలె
సితచంద్రచంద్రికచే లోన, వెలుపలఁ
బ్రలయజలంబుచేఁ బట్టరాక
మధురేశ్వరాలయమందిర మ్మొకవ్యోమ
యానమై కలకలలాడె జడత.

ప్రమథులు హాసించు చాడుచుఁ బాడుచుండ
నయ్యనుశ్రవములచే మహర్షివరులు
భూతలేశ్వరు సకలభూభువనహర్త
హరుని నుతియించి రాదిశంకరుని బరుని. ౧౨౩

## పునస్సృష్టి

ఆతఱిఁ జిరతరముగ నా
రాతిరి ప్రళయాంతకాలరాత్రి తొలంగన్
ధాత యథాపూర్వముగా
నాతత మగుసృష్టి విష్ణునాజ్ఞ నొనర్చెన్. ౧౨౪

జగము లలమినతమమును జక్కొ నర్పఁ
దొలుత పరమేష్ఠి సూర్యచంద్రుల సృజించి
భాస్కరకరాళి జల మింకఁ బాఱఁ జేసి
పిదప నిర్మించె నాతఁడు త్రిదివపదము. ౧౨౫

ప్రళయమునను నష్టపడక భూతలమందు
నిలిచి యున్న శివుని నెలవు తెలిసి
యదియె గుర్తుగా ననంతభూతలనదీ
సింధుపర్వతాదిసృష్టి చేసె. ౧౨౬

దేవతల నరుల నాగుల
నావల సృష్టించి వారి కగులోకంబుల్
భావించి యెవనిపని వా
ర్గావింపఁగ నిలిపె నిద్ర గని లేచినటుల్. ౧౨౭

పిదప జిరముగ నాకాశ్యపిని జనించె
ద్రమిడకులమున నొక్కయుత్తముఁడు ఱేఁడు
వంశశేఖరనాముఁ డప్పరమశివుని
భక్తుఁ డాపాండ్యమండలపతియు నయ్యె. ౧౨౮

వ. ఆభూపతి సుందరేశ్వరాలయైకశేషిణియై మధుర అనివిఖ్యాతంబై యున్నపురమును జేరి యొక్కెడ గొందఱుప్రజల నునిచి తాను నొక్కతావున నిలయము నేర్పఱిచికొని వసించుచు, ౧౨౯

అతఁడు నిత్య మొనర్చుశివార్చనమున
సర్వసంపత్సమృద్ధిభాజనత గనుచు
మధురఁ దొల్లిటిరీతి నిర్మాణపఱుప
గురుతు లెఱిఁగింపు మనుచు శంకరుని వేఁడె. ౧౩౦

మధురానగర సీమాప్రదర్శనము

అలికాక్షుం డది విని తన
తలఁ గలసర్పమ్ము నొక్కదాని విడుచుచున్
స్థలపరిమాణము దెసలుం
దెలుపఁగ శాసించె దేవదేవుఁడు కరుణన్. ౧౩౧

పృథ్వి. కదంబవనభూమిపైఁ గలితపుచ్ఛము న్నిలుపుచున్
ప్రదక్షిణ మొనర్చి యాపాము చుట్టి చక్రాకృతిన్
గదించి తలఁ దోఁకతోఁ గనఁగఁజూపెఁ దద్భాగమున్
ముదంబుఁ గనె ఱేఁడు; నాభుజగరాజు తా రెన్ వడిన్. ౧౩౨

పుష్పవనము గుహాచలభుజగగిరులు
అలవృషాచలేంద్రమును హద్దులుగఁ జూపి
యోజనద్వయమితముగ నున్నపురికిఁ
గట్టఁగాఁ జేసె రాజు ప్రాకారరేఖ ౧౩౩

సువిశాల విపణివీథుల
భవనంబుల రాజసభల( బలుశాలల నిం
పవునట్టిశిరోగృహముల
దవు( డామధురపురి స్వర్గధామ మొనర్చెన్. ౧౩౪

అదియు హాలాస్యపరివేష్టనాప్తసీమ
మగుట హాలాస్య మనుపేర నమరి యుండె
నభవుభోగాభివేష్టిత మగుటకతన
నెగడె భూలోకభోగభూమిగను నేడు. ౧౩౫

విక్రమచోళసైన్యము నోడించుట

వంశశేఖరు( డిటులు సర్వంకషముగ
మధుర నేల విక్రమచోలమహిపు( డొకపు
డశ్వపతిసాయ మంది జయార్థి యగుచు
పాండ్యరాజ్యాక్రమణ మొనర్పంగ వచ్చె. ౧౩౬

వంశస్థ. అతర్కితాపన్న మరాతిసైన్యమున్
క్షితీశు(డుం గాంచియు నిర్భయంబుగన్
నతుల్ నుతుల్ గ్రన్నన( జేసి శంకరున్
హతార్తి నేగెన్ హరియింప( జోళునిన్. ౧౩౭

భక్తపాలనతీవ్రవతత్పరత గల్గు
హరు(డు ధానుష్కు(డుగ మాఱి యాక్షణంబ
యెఱు(గకుండ స్వనామచిహ్నితము లైన
యసమశరముల శత్రుసైన్యమును గొట్టె. ౧౩౮

## పంచమతరంగము

పరమశివునకు వంశశేఖరునియందుఁ
గలదయాదృష్టిఁ జోళభూకాంతుఁ డరసి
పత్తితురగగజాదిసంపత్తి విడిచి
రణవిముఖుఁ డౌచుఁ దొలఁగె మారముగ నపుడు. ౧౩౯

హరుఁ డపుఁ డవ్యాజం బగు
కరుణ నెఱపి తన్నుఁ గావఁగా శేఖరుఁడా
గురు తెఱఁగి తనసమస్తముఁ
బరశివునకు దారవోసి పరిపాలించెన్. ౧౪౦

ఈశ్వరుని భక్తిచే విమ
లేశ్వరులఁ బ్రతాపవృత్తి నితవరులను గో
టీశ్వరతన్, పండితసుక
వీశ్వరులను వాక్సుధన్ జయించుచు నేలెన్. ౧౪౧

### కవిసంఘమునకు ఫలకదానము

తామ్రపర్ణీనదీపుణ్యతటమునందుఁ
గపిలకీరప్రభృతిమహాకవులు గలరు
బ్రహ్మదేవునిశాపసంపర్కకలన
వాణియే తత్కవీంద్రరూపములఁ బుట్టె. ౧౪౨

ద్రమిడసూత్ర రహస్యవేత్త లగువారు
బుద్ధిని బృహస్పతిని మించిపోవఁగలరు
వారునలువది యెనమండ్రపారభక్తి
నరుగుదెంచిరి మధురశంకరుని గొలువ. ౧౪౩

కవులసత్కరింపఁ గవిరూపధరుఁ డయి
శివుఁడు స్వాగతంబు సెప్ప; వారు
మునిఁగి స్వర్ణపుష్కరిణియందు, వాఙ్సుమ
మాలికలను గొల్చి రోలి భవుని. ౧౪౪

అకవులు విబుధాధములును
గుకవులు నగుకొంద ఱచటఁ గోలాహలపూ
ర్వకముగ నావిద్వత్కవి
నికరమును బరాభవింప నెగడిరి కడఁకన్. ౧౪౫

వ. ఆవైతండికు లౌకనాఁ డొకసమావేశంబు నెఱపి యందుఁ గపిలకీ
రాదిపండితకవుల నెదిరించుచు "ఓయీ దోషనిర్ముక్తంబులును
సాలంకారంబులును గుణోత్తరమ్ములు నైనశబ్దార్థములు కావ్య
మను మహాత్ములకు మానమస్కారములు.

శబ్దదోషములలో మొదటిది "అసాధుత్వ" మని మీమతము
గదా! అన్నిటికిని ప్రధానభూత మైనస్వరమునందు శ్రద్ధాభక్తులు
లేనివారికి శబ్దస్వరూపమందు సాధుత్వ మెటులు పొసంగు?

మఱియుఁ గాముకులదుశ్చరిత్రయే ప్రధానముగాఁ గలకావ్యా
ర్థముకంటె వేఱొకమహాదోష మేమి గలదు? కావుననే "కావ్యా
లాపాంశ్చ వర్జయేత్" అను శాసన మేర్పడెం గదా! కాఁగా
శబ్దార్థములు రెండును దుష్టములే.

ఇంక మిగిలినగుణదోషములు కవులచేఁ దమయిచ్ఛ ననుస
రించి కల్పింపఁబడినవే. ఇదంతయుఁ గాకదంతపరీక్షయు గ్రామ్యో
క్తిపరిగ్రహణమునుగాక మఱేమి?

అక్కడక్కడ పురాణములందును దంత్రగ్రంథములందును. గావ్యాలాపానువాదము స్ఫుటముగా నున్నచో నింక మా కీజిగీష యేల ? వాక్కులెల్ల నేదో యొకయర్థమును దెలుపుననుకారణంబున యజ్ఞములందు గ్రామ్యోక్తుల నుపయోగింతురా ? అవి క్రతువుల కంగములుగా నేల చెప్పంబడలేదు ? 'అగ్నినా సించతి' మొదలగు యోగ్యత లేనివాక్యములవలె నొప్పుకావ్యము లెట్టి యర్థమును బోధింపఁజాలవుగదా ! అట్టి కావ్యములందు జనుల కీవ్యామోహ మేల ?

పెక్కుతికమకలు పడి కథంచిత్తుగా నట్టికావ్యములకు సార్థక్యంబును సమర్థింతురేని, అదిమాత్రము దూషణము కాదా! కాఁగాఁ గావ్యరచనారూప మగుక్లేశము సఫల మయ్యె ననుకొనుటయు సంప్రదాయాగత మైనభ్రమయే.

అక్లేశముగా ఫలము లభ్య మగుచుండ క్లేశపద్ధతి సమర్థనీయము కాదుగదా ! మీ రేఫల మపేక్షించి గౌణవృత్తి నాశ్రయింతురో యాఫలమునే స్ఫుటముగా వాచ్యముగాఁ జెప్పరాదా? యీడొంక తిరుగుడులక్షణావృత్తి యేల ?

ఎట్టినియంత్రణమును లేకయే యర్థములయందు వ్యాపించు వ్యంజనావృత్తియే శబ్దవృత్తి యయ్యెనేని తత్తుల్యలక్షణములు గలవేశ్యమాత్రము సత్పత్ని యేలకారాదు ?

అర్థమే యర్థమును ధ్వనింపఁజేసెనేని ధూమముచే నగ్నియు చక్షురింద్రియముచే ఘటాదులును ధ్వనింపఁజేయంబడుఁగాక. ఇఁకఁ బ్రత్యక్షానుమానాదిప్రమాణవ్యవస్థగూడ నేలఁ జెప్పవలయు ?

దుఃఖప్రద మగువిషయము గూడఁ గావ్యార్పిత మైనపుడు సుఖప్రద మగుచుఁ గరుణాదులు గూడ రసస్థితిలో నానందహేతువు లగు నందురేని మిమ్ముల నొకకవి ఛందోబద్ధముగాఁ జమత్కారముగాఁ జెడఁదిట్టును. దానిని మీరు సుఖముగ విందురా?

ఓహోహో! యేమి భావవ్యక్తిపరిణతి? ఈకావ్యమం దెంత నిగూఢరస మున్నదని యలీకముగా మూసినకనులనుండి బాష్పబిందువులు రాల్చుచు నామరోగవికారులవలె రోమాంఛితగాత్రులై, జ్ఞానశూన్యులైనకవిగర్దభములతో నీభూమి నిండుకొన్నది. అని వారు చెప్పినదే చెప్పుచు నెదుటివారిసద్ధేతువులను బెడచెవినిం బెట్టుచుఁ దప్పుడుమార్గములు ద్రొక్కుచు వారివితండవాదముల వెలిపుచ్చిరి. ఆనిస్సారవాదవిధానముల విని వారి నెదిరింపలేక శివభక్తు లగుకపిలకీరాదు లాసుందరేశ్వరుని శరణువేఁడుచు,

అభవ! యీమూర్ఖుల నంధు లం చందుమే
వాసిఁ గాంతురు చేరదేసికనుల
పరులమాటలకు క్షేపములు పల్కకతాన
బధిరు లంటకు వీలుపడదు మాకు
ఉత్తమసైద్ధాంతికోక్తులాడినమాత్ర
పండితు లనుటకుఁ బాలుపడదు
వ్యర్థమ్ముగాఁ దెగవాఁగు చుండుటఁ జేసి
మూఁగవా రనుటయు మోస మగును?
శాస్త్రకోటీరసిద్ధాంతచయము లంటి
తత్త్వ మెఱుఁగనికొన్నిపెత్తనపుమాట
లాడెదరు పోహళించి శుకాదు లట్టు
లిట్టిమొఱకుల సృష్టించితేల సామి? ౧౪౭

అల్ల కావ్యాంగమజ్ఞు లిట్లాడిరేని
బాధకలుగదు నీదయవలన మాకు
శునకములు నేడమూంకులుగను వసించు
వీరిబాధలు మాకుఁ గల్పించి తేల? ౧౪౮

ప్రియునిదంతక్షతాదిచేఁ బీడ వడియు
నువిద తెలవాఱి యానంద మొందు భువిని
పిల్లిగాని యెల్కయుగాని పీఁకెనేని
వైద్యుకడ కేఁగదే మృత్యుభయము గదిరి? ౧౪౯

పరితాపార్తి పరీక్షను
పురహర! చాలించి మమ్ముఁ బ్రోవఁగ లేవే?
మొఱకులతో మే మిక్కడ
తిరుగఁగలేమయ్య దీనిఁ దీర్పఁగ రావే? ౧౫౦

అని కవులు విన్నవించిన
విని మందస్మిత మొనర్చి వృషభధ్వజుఁడున్
గని వినని యొక్క ఫలకం
బును వారల కొసఁగి యనె నపూర్వప్రేమన్. ౧౫౧

ఈఫలకమందుఁ గవులె యథేచ్ఛముగను
గూరుచుండఁగ నర్హులు; కుకవు లిందుఁ
గాలు మోపఁగ లేరు దగ్గఱను లేరు
శీఘ్రముగ మీర లిందు వసింపు డింక. ౧౫౨

వ. అనిన నా రట్లొనర్చి నిర్భీకులై సుందరనాథునియం దిత్తోధికతర భక్తి నెఱపుచుఁ గుకవిభీతిం దొలంగి యుండి రంత. ౧౫౩

వంశశేఖరపాండ్యునివలనఁ బిదప
వంశచూడామణి జనించి వసుధ నేలె
నెంచి శివుఁ జంపకములఁ బూజించుకతన
నతఁడు చంపకపాండ్యవిఖ్యాతి నందె. ౧౫౪

అమలకామినీరత్నసహస్రభోగ
భాగ్యభవ్యుఁడు చంపకపాండ్యవిభుఁడు
భోగియే గాక సత్కవిపుంగవుఁడు గఁ
గవులఁ బోషించి గౌరవకలన నెఱపె. ౧౫౫

వ. ఆమహాప్రభు వొక్కవసంతంబున నొక్కనవోఢ యగురాణితో నర్మపరుండై వివిధకేళీవిలాసంబుల మునింగి తేలుచుండ,

సిగ్గున జాఱునీవిని ససిస్ ముడివెట్టదు పేశసేయదుర్
దగ్గును గాఁగిలింపను ముదంబున ముద్దులుగ్రుమ్మరింపనున్
మొగ్గదు తాఁకనున్ సరసముల్ పచరింపను, గేలుఁదమ్మిచే
నిగ్గగుమోవి మూయును గణింపదు తేనిప్రియానులాపముల్.

బద్ధముగ్ధాంజలులు సమర్పణము చేతఁ
దమిని మందాక్షమందారములతోడ
తేని మా మా యటంచు వారింప నేమొ
మగువ యధరము మధురాతిమధుర మయ్యె. ౧౫౭

బిట్టధరమ్ము నొక్క పరిపీడన మందినయాననోధనున్
గట్టుగఁ దేర్చి, యింకఁ గొనఁగోరను, నాకొనగోర మర్మముల్
ముట్టుచు ముట్ట నొట్టుసుమి ముద్దియ యంచును నెన్ని చెప్పినన్
వట్టి దటంచు నమ్మ దది పాయిగొనున్ బెదరుం బునారతిన్.

బుజములం దెమ్మి దమ్ములపోదులు గట్టి
తమిని రెండుమూఁ డంగుళిత్రములు జుట్టి
యొండు రెండుశరాసముల్ మెండుకొలిపి
మదనుఁ డొనరించె నద్భుతకదన మపుడు. ౧౬౦

రమణి మదనుని బాణవర్షమ్మునుండి
ధవుని దేహముఁ గాపాడఁ దలఁచి యేమొ
మోము మోమున, భుజముల భుజములను ను
రమ్ము నురమునఁ గదియించి నెమ్మిఁ జూపె. ౧౬౧

చెదరఁ గొనగోళ్లతో సరిచేయఁబడిన
కురులు సడలిననీవి, చొక్కు గొనుకనులు
సురతమృదితాంగకముల నత్తరుణిఁ గన్న
మునులు నేనియు మోహాబ్ధి మునిఁగిపోరె! ౧౬౨

మొదటిరతియందె మివుల మోమోట వెట్టి
దాఁటిపోయితి నన్ను నొంటరి నొనర్చి
పోమ్ము లజ్జాసఖీ! యనునట్లు తరుణి
సరసత వహించె నాపుననస్సంగమమున. ౧౬౩

వేఁకువవేళ శయ్య నరవిందనిభానన వీడఁ జూడఁగా
నే కర మంటి నిల్పి శయనింపఁగఁ గోరెను ఱేఁడు, పయ్యెదన్
మేకొనఁజేసె నత్తరుణి, నెమ్మదిగాఁ దొలఁగించె రాజు, తాఁ
బోకముడిన్ బిగింపఁ బలుపోకల విప్పెను భూపు డుద్ధతిన్. ౧౯౪

సృష్టికర్త వేదాక్షరజీర్ణకోశ
సారు, డెఱుఁగునె శృంగారసారగరిమ ?
రాత్రులందె యనంతవిలాససృష్టి
చేసి దానిఁ బ్రియామగాఁ జేసె నకట. ౧౯౫

రతిసర్వస్వసుధాధరంబుఁ దమిఁ గ్రోలన్ మానుచో, వట్టిసం
గతి యాఁ, గ్రోలఁగఁ బూనుకొన్న నిఁక దక్కంబోదు సల్లాపసం
గతి యంచుం బెనుచిక్కులోఁ బడుచుఁ జక్కం బట్టఁగా మానఁగా
మతిలే కారసికుండు నెమ్మదిఁగ గొమ్మం జొక్కి చొక్కించెడిన్.

వ. ఇట్టు లాయువకులకు నిశాదియే సురతాదగను నిశాంతమే సురతాంతముగను బరిణమించె. ౧౯౭

వంశ చూడుఁడు సమస్యనొసఁగుట

ఒకనాఁ డతండు సౌధోపరితలమున
హంసతూలికపాన్పు నందు నుండ
నిరుపమానము పుష్పనికరదుర్లభ మైన
వాసనావాసితవాయు వొలసె.

అది పద్మినీజాతి యగురాజ్ఞి కేశపా
శసముద్భవం బౌటఁ జక్క నెఱిఁగి
దాని నాఘ్రాణించి తనివి తీఱక తాను
గవియాటఁ దలఁచె నీకరణి మదిని
యెవ్వఁ డీనామనోభావ మెఱిఁగి కవన
మల్లునో యీబహూకృతి నందువాఁ డ
టంచు మూఁటను గట్టి వ్రేలాడ వైచె
వేయి బంగరునాణెముల్ విశ్రుతముగ. ౧౬౮

కైత లల్లిరిగాని యక్కజపుఁగవులు
ఱేనిహృదయము కనిపట్టలేకపోయి
రంత నొక శైవవటువు సభాంతరమున
మొనసి గొంతెత్తి యొకపద్యమును బఠించె. ౧౬౯

అతఁ డకించనుఁ డయ్యుఁ బెండ్లాడఁ దలఁచి
భవుని మెప్పించి తనకు సంపదల నడుగ
నఖిలజనహృదంతర్యామి యైనశివుఁడు
వలయుధన మిచ్చె ననుచు నాపద్య మొసఁగె. ౧౭౦

"కుసుమవాసనలెల్లను గొల్లగొనిన
బంభరమ! సత్యము వచింపవమ్మ మాకు;
దేవికబరీకలాపజదివ్యగంధ
సదృశపరిమల మెందేని యొదవు నొక్క" ౧౭౧

ఇందుధరునిముఖకమలము
నం దందముగా జనించి యద్భుత మగుత
చ్ఛందోమయాతిమధుని
ష్యందము విని తేఁటు తృప్తి నందుచుఁ బలికెన్. ౧౭౨

వ. ఓకవివర్యా! నాహృదయమందలిభావము సరిదాఁకినది సంతుష్టుం
డనైతి నని ౧౭౩

కీరకవిని జయించి యనుగ్రహించుట

ముదలవెట్టెను బంగారముం గొనంగ
బ్రహ్మచారియుఁ దానిఁ జేపట్టఁ బోయెఁ
గలకలము పుట్టె సభఁ గీరకవివతంసుఁ
డోర్వఁజాలక పలికె నొడ్డోలగమున. ౧౭౪

అలశిరోరుహములు రక్తమలము లగును
బుష్పములచే నలంకృతమ్ము లవి గాక
పరిమళించునె? తేనియాభావ మేమి?
నీవు కనుగొన్న దేమి? కానికను గొనెదె? ౧౭౫

మేరుమందరముల మించెడిపాపసం
చయ మదెల్లఁ గేశజాల మంటి
విడుపకుండు ననెడి వేదోక్తి వినమోటుఁ
కల్మషులకుఁ బద్మగంధ మెటులు? ౧౭౬

అనునట్టిమురాక్షేపము
పనివడి విని వటుఁడు స్తబ్ధభావుం డగుచుఁ
గనలుచుఁ గవిరూపముతోఁ
ద్రిణయనుఁ డావిర్భవించెఁ దీరుపు వలుకన్. ౧౭౭

ఓరి జల్పాక! మూర్ఖ! నీవో మదీయ
శిష్యు నెదిరించు చేదో ప్రశ్నించితంట;
పద్మినికి దేహమందునఁ బద్మగంధ
ముండు టది సహజమ్ముకాదో వచింపు? ౧౭౮

పార్థివద్రుమపుష్పసంపర్క మెడలు
ఆశచీకేశములఁ దావి యలముకొనదె?
వెడగ! తదుపాధి శంకింపఁబడిన, నద్ది
గారిధమ్మిల్లపరిమలాక్రాంతి కగునె? ౧౭౯

కార్మణములస్వరూపసంక్రాంతి నొప్పు
పార్థివము లగువివిధపుష్పములయందు
పరిమళం బుపపన్న మై వఱలుచుండ
పద్మినీకేశము లొనర్చుపాప మేమి? ౧౮౦

ఉద్ధతసంభాషణముల
నుద్ధతుఁ డగునతఁడు కీరు నూటాడింపన్
సద్ధేతు వనుచు ఱేఁడు ల
సద్ధేమ మొసంగి వటుని సాగఁగఁ బంచెన్. ౧౮౧

కవిసంఘంబున నొక్కఁడై యభవుఁ డక్కాలంబునందుండి దు
ష్కవిమార్గంబుల నెట్టుచున్ మధుర, సత్కావ్యప్రసంగంబులన్
గవియై తత్ఫలకమ్ము నెక్కి కవిలోకగ్రామణీత్వంబుఁ దా
నవలంబింపఁగఁ గీరుఁ డోర్వక వివాదాయత్తచిత్తుం డగున్.

కోపాటోపము మీఱఁ గీరకవి మంకుంబట్టుతో నేవో యా
క్షేపాభాసములన్ వెలార్చుచును నాశ్రీకంఠు నిందింపఁ ద
త్తాపం బార్పఁగ సుందరేశ్వరుఁడు ప్రత్యక్షంబు ముక్కంటియై
యేపుం జూపెడిపంచవక్త్రములతో నేర్పాటుగాఁ దోఁచినన్.

కలితశాంకరభక్తాగ్రగణ్యుఁ డయ్యు
నరయుచుండియు నాపరమాద్భుతమును
మొఱుగ మానఁడు కీరుఁడు; మొఱకువారి
కణఁగునే జన్మసిద్ధమౌర్ఖ్యమ్ము జగతి? ౧౮౪

వ. పామరులజనిసిద్ధమూర్ఖత్వంబుకన్న జ్ఞానాభాసజాతం బైనమూఢ
త్వము మఱింత పెద్దగదా, పదరి యాతఁడు. ౧౮౫

మ్రొక్కిన నీక మ్రొక్కవలె మోముల నన్నిటఁ జూతు వీవు న
ల్దిక్కు లదేమిపాపమొ బళే! తిలకింపవు నేను జూపితిం
బెక్కులు కావ్యదోషములు నేరను గారణ మేమొ? నీకు నీ
మ్రుక్కడిబుద్ధి యబ్బురముపో తలపోసిన నాదిశంకరా! ౧౮౬

శ్రోతులెల్లన్ భవదీయసత్కృతులుగా శోభిల్లెఁ దద్భావసం
గతి మా బోట్లు విపర్యయప్రకరణోత్కర్షానుషంగాదిగా
నతుకుల్ వెట్టుచుఁ దోఁపఁ జేసిరిగదా యాలోపముల్ గాంచియున్
మతిమంతుం డనె తప్పు లెన్నెదవు? మామా కైతలఁ శంకరా!

విధ్యుక్తమార్గ మెల్లను
నధ్యాహారాదులన్ సమర్థించుటచే
సాధ్యం బగు రెఱిఁగియు నీ
మిథ్యావాదంబు లాడ మేలే గిరిశా! ౧౮౮

ఈశానుండవు సర్వవిద్యలకుఁ గాని మ్మోమహాకీరు వా
గీశత్వంబున కడ్డు లేదు నసిగా; ఈనాదురాక్షేప మా
వేశం బందక కీరభాషితముగా వెన్నాడి మున్నాడవే
యీశా! దోషము లేమెఱుంగు దని నీ విట్లాడె దశ్లీలముల్.

వ. అని నోటికి వచ్చిన ట్లాడుచుండ. ౧౮౦

కనలి యహంభావకలితుఁడై పలికెడి
కీరునివాక్యముల్ గేటుపుచ్చి
నసిగ జ్ఞానాజ్ఞానసమ్మిశ్రణమ్మునఁ
దనరె నీపరిణామ మని యెఱింగి
భక్తునియజ్ఞానపాటవం బణఁపక
పోవుట తనదె తప్పుగ గణించి
క్రమముగఁ దద్బుద్ధికాలుష్యమును ద్రుంచి
యుద్ధరింపంగఁ దా నూహ సలిపి

భక్తునపరాధమును దాను భరించి
ఆగ్రహింపక యతని ననుగ్రహించి
భక్తవత్సలుఁ డను పేరు పాయకుండ
నభవుఁ డెఱిగి తిరోహితుం డయ్యె నపుడు. ౧౮౧

౧౯౨

వ. అంతఁ గొంతకాలమునకు,

తొనకక తా నొనర్చు శివదూషణచే నగుకిల్బిషంబునన్
మనసు తపింప దేహ మతిమాత్రము గ్రుంగఁ జికిత్స కేని లొం
గనిపరితాపవేదన చికాకొనరింపఁగఁ దన్నివారణం
బునకయి హేమపుష్కరిణి మున్గెను గీరకవీంద్రుఁ డయ్యెడన్. ౧౯౩

వ. పిదప సుందరేశకృపాకటాక్షవీక్షణంబునఁ బశ్చాత్తప్తుఁడై యా
పరమశివుం జేరి సాష్టాంగపడి, ౧౯౪

చేసితి శివాపరాధము
చేసితి శివనింద నన్ను జెందెను బాపం
బాసాస నిన్ను వేఁడెద
నోస్వామీ ! సుందరేశ ! యోముము కరుణన్. ౧౯౫

ఆద్యకవి యగునా ప్రమథాధిపుండు
తాను నిగమాగమప్రణేతగఁ దనరియు
వానినుతులందు గుణలేశభావ మరసి
మురిసి తుష్టుఁడై కీరు సముద్ధరించె. ౧౯౬

ఆదికవి కీరకవికి సంప్రాప్తమైన
యజ్ఞతం దీర్పఁ గుంభజు నపుడు పనిచి
ద్రమిడసూత్రరహస్యసారమును గఱపి
యవనిపై వాని కున్నతయశము నిలిపె. ౧౯౭

ద్రావిడవృత్తుల పరీక్ష

మిగిలినవారు కీరకపిమిత్రునితో ద్రమిడాగమాళి నే
ర్పుగఁ బఠియించి దానికి నపూర్వపువృత్తులు సంఘటింపఁగాఁ
బగ లెగసె న్మదీయకృతి భవ్య మటంచును వారిలోన, నా
తగవును దీర్ప శంకరుపదంబులు పట్టిరి, యాతఁ డిట్లనెన్. ౧౯౮

కలఁడు రుద్రుఁ డన్ వైశ్యుఁ డొక్కరుఁడు మధుర
నతఁడు స్కందాంశసంభవుఁ డై మదీయ
శాపవశమున మూఁగయై సంచరించు
వాఁడు మీసందియములఁ దీర్పంగ వలఁతి. ౧౯౯

వినుచుఁ డతనికి; ఏవృత్తి విన్నయప్పు
డతఁడు పులకించి యానంద మతిశయిల్ల
జారుచునో బాష్పకణము లాసరసకృతియె
యుత్తమ మటంచుఁ దలఁచుఁడు చిత్తములను. ౨౦౦

వ. శివశాసనంబున వారంద ఱట్లొనర్చినంత. ౨౦౧

కీరుఁడు కపిలుఁడు భరణుఁడు
కూరిచినకృతుల్ పరీక్షకు నిలఁబడఁగాఁ
గోరి గ్రహించిరి వానిని
వేరికి నై మిగిలె నితరవృత్తులు ధరపై. ౨౦౨

నాకము నలంకరింపఁ బాండ్యప్రభుండు
చాల కాలాన కతనివంశంబునందు
అఖిలకవిరాజులకును రాజౌకులేశుఁ
డనడిజేఁ డుదయించి రాజ్యము వహించె. ౨౦౩

ఆతఁ డొకనాఁడు కవిసంఘమందుఁ గలుగు
నొక్క శివకవివాక్కును ధిక్కరింప
భక్తవశ్యుఁడు సుందరేశ్వరుఁడు లోన ౧౦౪
నుడికి తద్రాజధానిని విడువఁ గడఁగి.

వ. అయ్యాదిశంకరుండు కదంబకాననంబు విడనాడి తనకవిసంఘం
బుతో వేగవతీతటమందలి యుత్తరహాలాస్యస్థానంబున వేంచేసి ౧౦౫
యుండె నయ్యవసరంబున,

పుడమిపతి సుందరేశ్వరుపోక లెఱిఁగి
ప్రతిపదసుధారసస్యందిభాషితముల
శంకరు జగచ్ఛివంకరు సంస్తుతించి
శివుని, కవులను మధురకుఁ జేర్చె తిరిగి. ౧౦౬

దాశకులావతీర్ణ యగునంబను వివాహమాడుట

కడచె నొకకొంతకాల మాఁకరణి; శివుఁడు
దాశకులమునఁ గారణాంతరమువలన
నవతరించినదేవిఁ బెండ్లాడఁ దలఁచి
చేరికొనె దక్షిణోదధితీరభూమి. ౧౦౭

కొమరితకై వరున్ వెదకికొంచుఁ జరించెడిజాలరిన్ విచి
త్రము లగుమాటలన్ దరిసి ధన్యుఁడ వీవు భవత్సుతన్ గళ
త్రముగను నా కొసంగు మని తత్పరతం బలుకంగ, ధీవరుం
డమితముదంబు నంది యిటు లాడెను జిన్నపరీక్ష పెట్టుచున్.

అదిగో ఆజలనిధిలో
మెదలుచుఁ జరియించు నొక్క మీనము, దానిన్
బదిలముగఁ బట్టి తెమ్మన
నది నాశాపంబుపొందినది నందిగదా! ౨౦౯

వ. అని తనలోఁ దా ననుకొని యీపని యెంతపాటి యని సానందం
బుగ దానిఁ గాంచి, ౨౧౦

ఆదిన్ మత్స్యదసేవల న్నెఱపి మాయావాగురం దాఁటి, యా
మీఁదన్ శప్తత నబ్ధి మీన మగుచున్ మేకొన్న సద్భక్తు శై
లాదిన్ దాను సముద్ధరింపఁగ మహోర్వ్యాం బౌదయాజాలమున్
సేదల్ దీఱ శివుండు తజ్జలధి వేసెన్ దీసె నమ్మీనమున్. ౨౧౧

మీననేత్రమీఁది మెచ్చుచే మీనసం
గ్రహణమునకుఁ గూడఁ గట్టువడిన
యభవుఁ గాంచి మదనుఁ డదిమొదల్ మీనము
నలవరించెఁ దనజయధ్వజమున. ౨౧౨

అల్లనదృష్టపూర్వ మగునద్భుతరూపముఁ దత్ప్రభావమున్
దెల్లముగా గ్రహించి వినుతించుచుఁ గన్నె నొసంగె ధీవరుం
డల్లన స్వస్వరూపధరుఁడై పద మంటఁగ నందికేశ్వరుం
డుల్లము పల్లవింప సరసోక్తులతోఁ బురి చేరె రండఱున్. ౨౧౩

వాతపురీశు ననుగ్రహించుట

తనకు లేసు మహేశు యథావిధిన్ స
భక్తిఁ గొలుచుకు లేశభూపతికిఁ బిడప;
అరివిమర్దనుఁ డను సుతుఁ డవతరించి
యవని పాలించె సార్థకాహ్వయుఁ డగుచును. ౨౧౪

అతనికిఁ గలఁడయ్యె దివ
స్పతికి బృహస్పతివిధాన సచివుఁడు బాపం
డతులితమతి వాతపురీ
పతి యనువాఁ డఖిలకార్యభారోద్వహుఁడై. ౨౧౫

ఆశ్వికబలమ్మున్ సమకూర్పనై క్షితీశుఁ
డమితధనమును మంత్రిసత్తమున కొసఁగి
చోళదేశప్రశస్తాశ్వపాళిఁ గొనఁగఁ
బనిచె దక్షిణోదధితీరభాగమునకు. ౨౧౬

చోళదేశ వర్ణనము

వరకవు లొనర్చుపరదేశవర్ణనములఁ
దొలుత నుపమానకోటియందున వసించు
చోళదేశము నెదను మెచ్చుచును జేరి
పర్యటించెను మంత్రి తత్పరత మిగుల. ౨౧౭

తగిలి నదీసతుల్ తమకుఁదా మయి వేలకొలంది గూడఁగాఁ
బ్రగతిని వర్షకాలమున భాసిలుసాగరుఁ గూడఁబోక వే
సఁగులను నిస్సపత్నముగ సాగరుఁగూడుఁ గవేరకన్య య
త్యగణితవృత్తి నియ్యెడ ననంతవిలాససువిభ్రమంబులన్. ౨౧౮

ఇతరఋతువుల జల మన్న నేవగింపు
అమరు, గ్రీష్మవసంతమ్ములందు సక్తి
అచటఁ దత్కాలమందె యత్యాతతముగ
నదులు ప్రవహించు జనుల కానంద మెసఁగ. ౨౧౯

ఆడఁ గ్రొన్నీటివనరులతోడఁ గూడి
తోరపుటనంటితోఁటలతోడ నొప్పి
తీరు లొలికెడి కావేరితీరవనుల
వేసఁగులయందె మదనుఁ డావిర్భవించు. ౨౨౦

హవ్యము లంద నాయవనికి దిగివచ్చు
దైవతవరులసందడులు మెండు
స్వర్గమోక్షములఁ గైవస మొనర్చినయట్టి
ద్రమిడపండితులసందడులు మెండు
అధ్యయనాధ్యాపనాసక్తవైదిక
తతులచేఁ గల్గుసందడులు మెండు
అధ్యాత్మవిద్యారహస్యప్రచారణ
తాత్త్వికవరులసందడులు మెండు

అచటి కావేరియే స్వాదు వంతకంటె
వరము స్వాదీయ మగును గొబ్బెరలనీరు
పూజ్యకవిపుంగవులవాగ్విభూతియెల్ల
వానికన్న స్వాదిష్ఠ మాస్థానమందు. ౨౨౧

అరఁటిమామిడిపనసకొబ్బెరల వరుల
నిక్షుభేదములను జూడ నెంచువార
లచట విశ్రాంతు లందుచు నందు నందుఁ
దిరిగి ప్రాణము విసువ వత్సరము పట్టు. ౨౨౨

ఇక్కడిపిల్లకాలువ లహీననదుల్ పరదేశమందుఁ దా
మిక్కడియల్పవేత్తలె యహీనబుధుల్ పరదేశమందుఁ దా
మిక్కడినిర్ధనుల్ ధనికులే పరదేశములందుఁ జూడ నీ
చక్కని క్షుద్రగేహములె సౌధములౌఁ బరదేశమందునన్. ౨౨౩

అట్లు భూలోకనందన మైనచోళ
దేశమం దెల్లతావులుఁ దిరిగి మంత్రి
యుదధిపశ్చిమతీరాన యోజనమున
నున్నమాహేశ్వరస్థాన మొక్కటి గాంచె. ౨౨౪

పరమగురుఁ డయి యటఁ బాశుపతుల మునుల
దివ్యబోధామృతాబ్ధిఁ దేల్చుచున్న
చంద్రచూడుని గాంచినక్షణమునందె
యతని నాధ్యాత్మికవిశుద్ధి యాక్రమించె. ౨౨౫

వ. అంత నా వాతపురీశ్వరుం డా పరమేశ్వరునకు సాష్టాంగపడి బాష్పతరంగితాక్షుండు కాఁగా నాతని దయాశీతలదృష్టిం దరిఁజేర్చుకొని యా పరమగురుండు నైష్ఠికదీక్ష నొసఁగి యాతని ననుగ్రహించె.

పరమమాహేశ్వరాశ్రమపదము గొనుట
నతఁడు సంఛిన్నపాశుఁడై యాక్షణంబ
యశ్వములఁ గొనఁ దెచ్చినయంతధనము
శివసపర్యల కపుడు వెచ్చించివైచె. ౨౨౬

అపుడు కర్ణేజపులపలుకు లవధరించి
పాండ్యుఁ డాసచివుని బిలువంగఁ బనుప
భవునియానతి నతఁడు సాశ్వముగ వత్తు
ననుచు తేనికి సందేశ మంపుకొనియె. ౨౨౮

పదివేలతురంగములను
బడపడి తెచ్చెదను నీవు పద మని శివుఁడున్
ముదల యిడ మంత్రి ముందుగఁ
గదలి మధుర చేరి రాజుఁ గని యిట్లనియెన్. ౨౨౯

వ. భూపా! మనయశ్వతల్లజంబులు పదివేలును నగరసమీపంబునకు తేపకడ రాఁగల వని పచించి సుందరేశ్వరాలయంబున కేఁగి స్వామీ! నీదే భార మని యుండె. ౨౩౦

సాగెను రెండుమూఁడుదివసంబులు రామిని సైంధవంబులున్
రేఁగెను గోపతాపములు తేనికిఁ దోడనె మంత్రిఁ బట్టి యా
యాగడమెల్లఁ దీర్పఁ డని యానలు పెట్టెను రాజభృత్యులా
త్యాగిని జుట్టుముట్టి బహుధా యమబాధలు పెట్టి రుద్ధతిన్.

వ. అంత నామహాభాగుండు శివుని ప్రార్థించుచు, ౨౩౨

పరమేశ! గోవిందపరమేష్ఠిగోష్ఠుల
మరగుచు నామాట మఱచినావా?
ప్రాలేయగిరిసుతాభావవిలాసముల్
మరగుచు నామాట మఱచినావా?

నావంటియార్తుల నేవంక నేఁ గావఁ
దిరుగుచు నామాట మఱచినావో ?
పరిహరింపఁగరాని బంధుకార్య మొనర్పఁ
దిరుగుచు నామాట మఱచినావో ?

పాపకర్మమాయాత్రయబంధకలన
విసివి వేసారునను విడిపింతు వనుచు
భక్తి సేవింప నాల్గవబంధ మిపుడు
తెచ్చిపెట్టితివా మహాదేవ ! నాకు ? ౧౩౩

కర్మ మని కాల మనుచు వంకలను బెట్టు
వారితో నాకుఁ బని లేదు వామదేవ !
సర్వముఁ దృణీకరించి నీచాటు పట్టు
నార్తు వీడుట నీ కపకీర్తి కాదె ? ౧౩౪

రాజదండనకై భీతి రాదు నాకుఁ
జంపుటను నుంచి వా రేమి జరుపఁగలరో ?
అంతకుని చేత నున్న నాయందు నీయు
పేక్ష యా యని మది దురపిల్లువాఁడ. ౧౩౫

ఒకఁడె యాలంబనం బనుసూక్తి వీడి
భక్తి నీ రెండుపదములఁ బట్టియుంటి
ననభారము నొండొంటియందు వైచి
కొనుచు నవి యీయుపేక్షకై కొనినవేమొ ? ౧౩౬

కర్మ మవిలంఘ్య మై యుండఁగా గిరీశ
భక్తి రక్షించునా యనుపలుకు ములికి,
మూర్ఖవిశ్చయ మద్ది, శంభూ ! త్వదీయ
దూషణమ్ముగ నది నన్ను దుఃఖపెట్టు. ౨౩౭

పరమేశ ! నన్ను గాపాడఁగాఁ దలఁతేని
యవతార మెత్తి తారాడవలెనె ?
యవతరింపఁగఁ దప్పదమ్యె నే నదియును
దెలియనివిద్యయే దేవ ! నీకు ?
సాఁకంగ నన్ను భుజాభుజియుద్ధాన
నరిఁ దెగటార్చు తెం పమరవలెనె ?
పాశుపతాద్యస్త్రపటిమ గావలయునే
యోమదే నీదునిట్టూర్పొకండె ?

దృఢతర మైనభక్తి నాదే యటన్న
భక్తరక్షణ ! నీపాలఁ బడకయున్న
విసివి యాపని నీవు గావింపవేని
గెలుపు నాదురితములదే గిరీశ ! నిజము. ౨౩౮

ఈశ్వరా ! భక్తవత్సల ! యాపదములు
రూఢముల ? యౌగికమ్ములా ? రూఢమూల !
వానిఁ బోకార్చువో స్థిరపఱచుకొనెదో ?
సమయ మిది నీకుఁ దగిలె నిశ్చయము నేఁడు. ౨౩౯

తన్ను బాధించువాని సాధారణముగ
నెవఁడు బాధింపకుండు స్వామీ! మహేశ!
దండహస్తుని గోవైనఁ దఱిమి పొడుచు
భక్తపాలన నీపాలఁ బడ దదేల ? ౨౮౦

ఇందునిబద్ధకిరీటుల్
సుందరులౌ మీర లిర్వురున్ ముక్కంటుల్
బంద ముడిపి నను జల్లఁగఁ
గందు రటం చుంటి నిట్టికందువ లున్నే ? ౨౮౧

పంచముఖుఁ డీవు సాయుధపంక్తిభుజప
రీత నీకాంత యీవిపరీత మేమొ ?
పలుకు బంగారమే నీకు, భక్తుఁ గావఁ
జేయి కదల దామె కి దేమిచిత్రమయ్య ? ౨౮౨

అలకొప్పులోని వెన్నెలతేఁడు దీపించి
క్రొంగ్రొత్త చలువలు గ్రుమ్మరింప
మంచుకరళ్ల నుబ్బించి క్రొమ్ముడిలోని
మినువాక చలువలు చినుకుచుండ
పలుకఁబోయుదమఁ బాటపాటని తెలినవ్వు
తులకించి చలువలఁ జిలుకరింప
కరపద్మానననేత్రకమలాకరంబునఁ
జెలిమీఱు చలువల నోలుకఁబోయ

అంబికాశీతలకటాక్ష మావహిల్లి
నెటి దయామృతవర్షి ధునీమెఱంద
యిన్ని చలువలు కలదివై యున్నఁగాని
యిప్పుడు నను జల్లఁగాఁ గాంచ దేమి సామి ? ౨౮౩

నొసలిమూఁడవకన్ను దెసమొల నీవికా
రాకారరేఖల నాడుచుండ
పచ్చియేనికతోలుఁ బాపసొమ్ములు నిన్ను
నేబరాసి వటంచు నెంచి పలుక
బూదిబస్సన్నవై చేఁదుమేఁపరి వౌట
నీయకించనత వర్ణించి తెలుప
గట్టుపట్టులుఁ గాటికాఁపురమ్ములు నీదు
నెడ్డితనమెల్ల నెఱుకపఱుప

వసతి తిండి రూపవైఖరి వృత్తి నీ
వేషభాషలెల్ల వికటము లగు
వికటరూపమందు వెలయునే గుణములు ?
గుణివె మైన నన్నుఁ గూర్మిఁ గనవె ? ౨౮౩

ముగ్ధశశాంకమౌళి ! యతిమూఘుఁడనై యెద సంచలింప సం
దిగ్ధప్రలాపముల్ పలికితిన్ క్షమియింపుము, మాటలాడ నీ
ముగ్ధుని కెట్టియర్హతలు పో తలపోయఁగ శర్వ ! నీవు నై
దగ్గిసి జూపి కాచినను దప్పిన సర్వము నీదె కాదొకో ? ౨౮౪

శివలీలార్ణవము

నిధనపతీ ! నతి నిధనపతాంతకా !
ఊర్ధ్వా ! నమస్కృతు లూర్ధ్వలింగ !
ఓహిరణ్యా ! మ్రొక్కు లోహిరణ్మయలింగ !
స్వర్ణా ! మెఱుంగుదుల్ స్వర్ణలింగ !
దివ్యా ! జోహారులు దివ్యలింగా ! జోత
భవ ! భవలింగ ! మావందనములు
శర్వ ! చేమోడ్పులు శర్వలింగా ! నతుల్
శివ ! శివలింగ ! మాచిన్నిపూలు
జ్వాలరూప ! గాడీలు జ్వాలలింగ ! దండము
లాత్మ ! చేవిప్పు లోయాత్మలింగ !
పరమ ! వెన్నెలలయ్య పరమలింగా ! మ్రొక్కు
విభు ! టెంకణాలు గొబ్బిళ్లు దేవ !

కలవికరణ ! సద్యోజాత ! బలవికరణ !
బల ! బలప్రమథన ! భవోద్భవ ! నమోస్తు
జ్యేష్ఠ ! రుద్ర ! మనోన్మన ! శ్రేష్ఠ ! కాల !
సర్వభూతదమన ! నమస్కృతము లివియె. ౨౮౫

ఆదయనీయసంస్తుతుల సాంబుఁడు వించును దక్షిణంబ తా
సాదిగ, నంబ యశ్వము లసంఖ్యము గాఁ బెనుధూళి రేఁపుచున్
భీదము లైనహేషల గుభీలు గుభీలున దూఁకుచున్ భయా
పాదిగ వచ్చి నిండెఁ గకుభంబులు పిక్కటిలన్ రయార్భటిన్.

వాయువునే జయింపఁగలవారికి చిత్తజయంబునుం దృణ
ప్రాయము, చిత్తముం గెలుచువారలు లోకములెల్ల గెల్తు రీ
న్యాయముఁబట్టి వాయువును స్వాంతము గెల్చినయశ్వరాజముల్
హాయిగ గెల్వవే జగము లన్నిటిని్ ద్రుటిలో రయోద్ధతిన్. ౨౮౮

ఆసముత్తుంగతురగరింఖాసహస్ర
హతపరాగంబుచేఁ జులుకితము లైన
జలధు లేడు స్థలీకృతమ్ములుగ నగుడు
భావిజయము రాజునకుఁ దోఁపంగఁజేసె. ౨౮౯

వ. అంతలో మెఱపు మెఱసినవిధానఁ గనులు మిఱుమిట్లు గొన,

అత్యుదాత్తస్థాన మారోహణించుచు
ననుదాత్తతలులయం దవతరిలుచుఁ
బూని యేకశ్రుతి యైనను స్వరితమా
ర్గమునందె నెమ్మదిగా నడచుచు
నుభయమీమాంసల న్నరుఖలీనములచేఁ
బదిలమ్ముగాఁ గట్టఁబడిన దగుచు
నతిచిత్రతేజస్కుఁడై ప్రపన్నప్రసా
దియు నైనయొక్కఁసాదిని వహించి
యబ్బురమ్ముగ నరిమర్దనాధిపతియు
విస్మయస్మేరముఖుఁ డయి వీక్ష. సేయ
జలదరింపఁగఁ జూచువారలయొడళ్ళు
విశ్వమయువేదతురగ మావిర్భవించె. ౨౯౦

సిగ్గును బశ్చాత్తాపం
బగ్గల మై తేఁడు సచివు నారసికొని, నా
యెగ్గన్నక మన్నింపుము ౨౫౧
నెగ్గను నీమాట నాదె నేరం బనియెన్.

భూపుఁడటు పల్క నతనిఁ గవుంగిలించి
యద్ది నీపొరపాటు కా దనుచుఁ బలికి
ప్రభువుతోఁ గూడుకొని సాదివర్యునకును
స్వాగతమ్ము వచింపఁగా సాగి రటకు. ౨౫౨

వ. పరస్పరనమస్కారానంతరమునం దా సాది రాజా! యీ నీమంత్రి
యశ్వములం గొనఁ దెచ్చినవిత్తం బేను గ్రహించి యీశివాశ్వ
ములం దీసికొనివచ్చితిం బరిశీలింపుము. ౨౫౩

గిరులఁ దరుల గుల్మముల లంఘించు నివ్వి
వనుల నదుల నల్లంఘించివైవఁగలవు
అశ్వ మన రేఫు లేనిదే యౌను రాజ!
గుఱుతుగఁ బరీక్ష సలిపి చేకొనుము వీని. ౨౫౪

కాంచి, యామాట కంగీకరించి తేఁడు
వరసువర్ణసుభూషణాంబరము లొసఁగి
సాదిని సగౌరవంబుగ సాగనంపి
మురిసిపోయెను లోలోనఁ గొఱంత దీఱి. ౨౫౫

తోలితమయశ్వసంఘములతోడన మందురలందు వీనినిం
గలిపిరి రాజునాజ్ఞ, మఱునాఁడు నవాశ్వములెల్ల నక్కలై
పెలుచన ప్రాఁతగుఱ్ఱములఁ బీఁకుచుఁ గూయుచు నల్వలంకులన్
బోలయుట రాజు గాంచి బలుమోసముగాఁదలపోసి మంత్రినిన్.

పట్టి బాధింపఁ దన యమభటులపగిదిఁ
జుట్టి సేవకుల్ బాములు వెట్టుచుండ
నాతఁ డాత్మానుసంధాన మలవరించి
క్లేశమును లేశమైన లెక్కింప కుండె. ౨౫౭

విశ్వాత్మకతావివరణము

వ. అంత వేగవతీనదివైపు దృష్టిప్రసారం బొనర్చి. ౨౫౮

భక్తరక్షణ కోరి యాపరమశివుఁడు
నింగిఁ బరవళ్ళ ద్రొక్కు నుప్పొంగి మధుర
ముంచు మన వేగవతియు గొబ్బునను ముంచె
భటులు పర్వులఁ బూతలు పట్టి రడలి. ౨౫౯

భవకారుణ్యరసాబ్ధిపూర మని సంభావింప నా తన్నదీ
భవపూరంబున మోచితుం డగుచు నాభక్తుండు హాలాస్యనా
థువరాగారము సేరెఁ; బాండ్యుఁడును ముగ్ధుం డౌచుఁ బౌరాళిచే
నవబంధంబులు తత్ప్రవాహములఁ గ్రన్నం గట్టఁగా బూన్చుడున్.

ఇండ్లవంతున నొకఁ డొక్కఁ డేఁగుదెంచి
సాయపడవలె నను రాజశాసనంబు
వినుచు 'అపూపిక' యొకర్తు వృద్ధ యాటఁ
దనపని యొనర్పఁ బనివానిఁ దడవుచుండె. ౨౬౧

అనునిత్య మామె యట్టులు
పుణుఁకు లపూపికలు వండి భూతేశునకున్
మనసార నివేదించుచుఁ
గొనిపోవుం బిదప నమ్ముకొనుటకు వాఁకిన్. ౨౬౨

తాను బరమేశుదయ కట్లు పాత్ర మగుట
నిఖిలనిగమాళిచేత నన్వేష్యుఁ డైన
తరుణుఁ డొక్కఁడు గునపముం దట్ట పట్టి
తిరుగుచుం గూలికై దాని దటిసె నపుడు. ౨౬౩

వ. సమీపించి యాతం డవ్వా! పని నెద్దానినైనం జెప్పెదవే? ఆపూపిక వైననీకడ ధనముం గోరకయె సాయపడెద, నట్టాఁకటం బడితి మంచిభక్ష్యంబు లమ్ముకొని పచ్చివి మాడినవి ద్రబ్బెడలు నాకుఁ గూలిగ నిమ్ము, చాలు నన నామెయుఁ దన యక్కఱ వానికిం దెలియఁబలుక; ౨౬౪

ఈనదీపూరబంధన మెంతపాటి ?
కొంచెపాటిదె భటుల మెప్పించు టనిన
అవ్వ ! నను నమ్మి బరువు నాయందుఁ బెట్టి
పిండివంటల వండు నిర్భీక వగుచు. ౨౬౫

తల్లీ యని యవ్వా యని
మెల్లఁగ నాయమను దేర్చి మేల్ భక్ష్యములన్
జల్లఁగ వండించుచుఁ దిని
యుల్లము పల్లవిత మగుఁడు నోహో యనుచున్. ౨౬౬

ఆడుచు నవ్వుచుఁ జక్కఁగఁ
బాడుచు గునపమ్ముఁ దట్టపాఱలు గొనుచున్
జూడుఁడు త్రవ్వెదఁ గప్పెదఁ
బోడిమిగా ననుచు భటులముందు నటించెన్. ౨౬౭

వ. దినదినం బిట్లుగా నాతనిపనిలోపంబుం దిలకించి రాజభటులు కోపించి యాతని దండింపం బోవ, ౨౬౮

ఎదుట వినయోక్తు లాడును
బెదరఁడు గణకుల్ దొలంగ వికవిక నగుచున్
జదికిలఁబడు, నీభుక్తికి
నిది చాలదొ ముసలిదాని కే మని గొణఁగున్. ౨౬౯

కన్నపెంచినవార లెక్కడను లేరు
మనఁగ నొకతావు లేదు నిర్ధనుఁడ నేను
ఱేఁడె కడుబీదవారిఁ గారించుచుండ
నూరు మునుఁగదె యంచు నేవో గొణంగు. ౨౭౦

వీనిపని వీనిమాటలు
వీనివిషయమెల్ల రాజువీనులఁ బడఁగాఁ
దానై కని కుపితుండై
వానిం బెనుబెత్తమునఁ జివాలున నడఁచెన్. ౨౭౧

హరునివఱతను వప్పు డాహతము గాఁగ
నాతఁడు త్రిలోకములుఁ దాట నసటిభటుల
తా మహీజాని కచ్చోటి యందఱకును
జగములకుఁ గూడ నా దెబ్బ తగులుకొనియె. ౨౭౨

వ. రాజును దత్ప్రహారమ్మునకు సొమ్మసిల్లి కొంతవడికి. ౨౭౩

"తెలివిని బొంది తాను గురుతించినయంతనె కూలివాఁడు లేఁ
డలజడి లేదు, వెల్లువ తనంతనె చల్లెను జూడఁ జూడఁగాఁ
గలయు నిజంబ యంచుఁ దలఁకంగను జేఁ దలసుందరేశుచ
ర్యలుఁగను దోఁప వారు స్తుతులన్ గొనియాడిరి వేవిధంబులన్.

పౌరకృత హరస్తుతి

శితిగళ ! నీదుమూర్ధమున శేషుఁడు లేఁడె ? సహస్రశీర్షుఁడై
యతఁడు క్షితిన్వహింపఁడొకో? యాక్షితిరేణువులొందు రెండెయా
గతిని దొలంచుచున్ నదికిఁ గట్టులు కట్టఁగ లేవె ? దీనికై
సతమత మై యపూపికలసైతము మెక్కెదె కూలివాఁడవై. ౨౭౪

పదములు భక్తలోకపరిపాలనభారము మోయుఁ, గుక్షియున్
ముదమున సర్వలోకభరమున్ భరియించును, నీదుశీర్షమున్
బరపడి చంద్రు గంగను గపాలికమాలను మోయు, నిప్పు డీ
యదనున మట్టి మోసితి, హరా ! నను మోవఁగ నీకు భారమా ?

బేలలమయ్య యెకరణి బెత్తపుదెబ్బలబాధ నందఁగాఁ
జాలుదుమయ్య ? యిప్పుడు నిజంబును దెల్పక దాఁచిపెట్టుచోఁ
దేలుదుమే ? శిలాహతులఁ దిన్న నితన్నిల ఫల్గున ప్రహా
రాలను బాలువెట్టిన ? హరా ! కరుణింపఁగదే పరేశ్వరా !

నిన్నుం జేరుటకై యుపాయముల నెన్నో బుద్ధిఁ జింతించి నేన్
ఖిన్నుండైతిని ప్రాణముల్ విసిరెనె కానిమ్మా నదీతీరసం
పన్నం బావనమృత్తికం గలియుచో భద్రంబుగా నీశిరం
బెన్నం జేనియు నెక్కుచుండుమనె సామీ? యిట్లు త్రోఁచెం దుదిన్.

మట్టితట్టను నెత్తిఁబెట్టి మోయుకతాన
 బురదతో గంగమ పొలుపు సురిగె
భవ్యకాంతులు మట్టిపాలైనకతమునఁ
 జంద్రరేఖయును ధూసరిత మయ్యె
ప్రిదిలి బీఁటలుగ రాపిడులు బిట్టుగఁ జెంది
 భగ్నమై చెడెను గపాలమాల
పొర లూడి నలఁగి నెత్తురు లోడఁ గ్రక్కుచుఁ
 జిలువభూషలును గ్లోశితము లయ్యెఁ

దనకు మాలినముదుసలిదానిపిండి
వంటకములకుఁ గక్కుర్తి పడితి వేల?
పిలిచి మం దేదో యయ్యపూపికలఁ బెట్టి
నిన్నుఁ దనిపించెనేమొ మన్నింపఁ దన్ను. ౨౭౯

అంతకు నేల తన్నితి వహస్కరు నొక్కచపేటికాహతిన్
దంతము లూడఁగొట్టితి పితామహుపంచమశీర్ష మూడ్చి, తే
మంత పరాధముల్ సలిపి, రాయఘు మిట్టులు కట్టిగుడ్పదే?
యెంతయధీశ్వరుండవయితేని యివే పను లో మహేశ్వరా? ౨౮౦

తొలఁగుఁడు కొంతమేర విబుధుల్ తలఁగుండు మహర్షివర్యులున్
దొలఁగుఁడు మాన మూని ప్రమథుల్ శివుదుర్దశ నంబ కింతలోన్
దెలుపకుఁడయ్య; నందనవనీకుసుమార్చలకేసి కందుచున్
వెలవెలఁబోవుతత్తనువు బెత్తపుదెబ్బల కెంత నొచ్చెనో? ౨౮౧

బడలిక చెందె శంకరుఁడు పట్టెను ముచ్చెమటల్ మొగంబునన్
వడలు తడంబడెన్ వణఁకునన్ నృపపాండ్యుఁడు బెత్త మెత్తి వీ
పడఁచె నటంచుఁ దద్గణము లాడఁగ; దుర్గయు భక్తపాలనన్
బడినపు డిట్టిపాట్లు పరిపాటిగదా యని పూనె మౌనమున్. ౨౫౩

జగదభిరక్షణాధికృతి చక్కఁగఁ బూనినచక్రపాణి యే
తగవరి? హాయిగా భుజగతల్పమునందు సుషుప్తి మున్గె నీ
యగడును జెప్పికో నెవరయా? విన నెవ్వరయా? యనాథతం
బొగిలితి "వెట్టిచాకిరికి" పోయితి దెబ్బలు తింటి శంకరా!

ఎట్టిది శీర్షరాజము మహేశుని దం చదుగన్ విరించితో
నిట్టిది యిట్టి దిట్టి దని యే వచియించి గురుండ నౌదు, నీ
పట్టున నిన్నదీతటినిఁ బట్టినమట్టిని దోమ నౌచు నన్
బుట్టఁగఁ జేయ వేఁడెదను భూతపతీ! తగువాఁడ నైనచో. ౨౫౪

పాండ్యవిభుఁ డిట్లు దండింపఁ బాండ్యతనయ
వయ్యు నీ వూరకుంటి వేమమ్మ జనని?
దెబ్బలకు మట్టిమోత కీదేవుఁ డప్పు
డెడమపెడ నొగ్గ నీముప్పు కడచియుండు. ౨౫౫

శితికంఠ! వేగవతిసై
కతపిటకముఁ దలను బూనఁగా బరువెల్లన్
శ్రుతిశిరసుల యతిమనసుల
నతిమాత్రము సోఁక కుండునా జగదీశా! ౨౫౬

మగతనం బందుమా సగమె యైనకతాన
సామ్రాజ్య మేలెడిశక్తి లేదు
ఆఁడుతనం బన్న నదియు సగం బౌట
గృహయుక్తకృత్యనిర్వహణ లేదు
మధురాధిరాజ్ఞిగా మసలు దీ, విచటనే
బెత్తపుదెబ్బ నీప్రియుఁడు పొందె
నఖిలలోకములకు నన్నంబు నిడు దీవు
బిచ్చ మెత్తుచును నీప్రియుఁడు బ్రదుకు

మున్ను పార్థప్రహారముల్ బొంది తనిన
నాదరింతుము మృగయావినోద మనుచు
లాభమే లేని యీ యపార్థప్రహార
ములను బొందుట యిది యెట్టిమొఱకుఁదనమొ ? ౨౮౫

అవనిపతిదెబ్బలకును విశ్వాత్ముఁ డైతి
మిసిమిముద్దలఁ జేపట్టి మ్రింగునప్పు
డద్వితీయత పూనితి వక్కటకట !
కష్టములు మాకు సుఖము లొక్కనికి నీక ?

నీకుఁ గలిగినబాధ లనేకవిధులఁ
బంచికుడిచెడివా రిట్టిపాట్లు చెంది
యధికభవతాపతాపితు లగుచునుండ
భవదుపేక్షయా లీలయా భవ ! వచింపు. ౨౮౬

తలనుం దేహము వంచి మృత్తికను మూద్దల్ గట్టి బంధక్రియా
కలనన్ వర్తిల గంగ జాతె సహివర్గం బల్లలాడెన్ జనుల్
కలకం జెందుచు దెబ్బలం దినిరి యేలా యొక్క వృద్ధాంగనన్
జెలిమిన్ రక్ష యొనర్చి యిందఱను శిక్షింతే జగన్నాయకా!

నీవు మావల్ల నెన్నియేని గ్రహించి
మాకు సంసారబంధము మాన్పరావు
తెగువతో జేని కిది నివేదింతు మేని
దెబ్బపై దెబ్బ నిన్ను బాధించునేమొ ? ౨౮౮

కొట్టితిc గొట్టితి నంచును
నిట్టులు దురపిల్లనేల యిది మంచికెగా
బిట్టుగ శివుc గొట్టియె నాc
డిట్టే పాశుపత మందcడే పార్థుండున్. ౨౮౯

తిన్నcడు కాలc దన్నె గుఱుతింపక కవ్వడి గాండివంబుచే
మిన్నగ మోcదెc బాండ్యుc డనిమిత్తము బెత్తము నెత్తి కొట్టె నీ
వెన్నును రాలతో నదిమి వ్రేసె నటుం డొకcడవ్వి పూజలై
నిన్నలరింప మాదొసcగునే గణియింతు వదేమి పాపమో ? ౨౯౦

శివముం గోరెద వెల్లజంతువులకున్ జేకూర్తు భక్తాళికిన్
శివమున్ నామముచే శివుండవుగదా చిద్రూప! సర్వాత్మతన్
శివముం గోరెడి జంతు వెన్నటికి నేనిన్ నిన్నుదక్కన్యునిన్
జవికైనం దలపోయునే శివతరా! శంగా! నమోవాకముల్.

ప్రళయోద్భిన్ననటత్త్రితీయనయనప్రాదుర్భవద్భీకర
జ్వలనప్రోత్థకణప్రదగ్ధసకలబ్రహ్మాండహవ్యా! విని
ర్మలశీతాంశుకళాకిరీట! హర! శర్వా! మేరుకోదండమం
డల! బీభత్సుజయైకహేతుశరకాండా! యూనమో వాకముల్.

వ. అని ప్రజలు కొనియాడుచుండ నొకదివ్యవ్యోమయానంబున నద్భు
తాకారంబున నొప్పునయ్యాపూపికను నిలిపి యందఱుం గాంచు
చుండఁ బ్రమథులామెను శివసన్నిధిం జేర్చిరి. ౨-౩

అపుడు చేసినపాశుపతాపచార
మునకు నరిమర్దనుఁడు ఖేదమునఁ దపించి
పాదవందనములఁ బ్రియవచనరచన
ననునయించెను మంత్రివర్యుని గరంబు. ౨-౪

వ. అనంతరము మహేశ్వరునియాకాశవాణి విని పాండ్యరాజు భీతుఁడై
మంత్రిని సగౌరవంబుగ విడుచునంత నాతండును వైరాగ్యమూని
సంసారంబు రోసి చిదంబరక్షేత్రమున కేఁగి శివారాధనతత్పరుం
డయ్యె. ౨-౫

అరిమర్దనువంశమునం
దురుతరకీర్తుల సమున్నతోన్నతుఁ డయ్యెన్
వరకుబ్జపాండ్యుఁ డనుభూ
వరుఁ డుదయించి ధరను బరిపాలించెన్. ౨-౬

పాండ్యవంశజుఁ డయ్యు నపాఠ్ఠిపుండు
జైనబౌద్ధులతోడి సంసర్గవశతఁ
దెలివి దిగనారఁ దన్మతదీక్ష నందె
నాఁడెలలమైత్రి పీరు వాఁ రౌదురెకద. ౨౯౭

వ. ఆమహారాజు పాలించుచుండ మధురానగరంబున, ౨౯౮

జన్మములకు వేదములకు
నెన్నఁగ విచ్ఛేదశంకయే యెఱుఁగనిసం
పన్నశివదాసకులమున
సన్నుతుఁడు కుమారుఁ డొదవె స్కందాంశమునన్. ౨౯౯

అతఁడు తలిచావుబిడ్డఁడై యాఁకటికిని
దాళఁజాలక విలవిలఁ దన్నికొనుచుఁ
గంది గాజువాఱఁగ మహాగౌరి చేరి
స్తన్యమొసఁగుచు నాస్తనంధయుని గాంచె. ౩౦౦

వ. ఆతఁడు పెరిఁగి పెద్దవాఁడై నాఁటిజనులచే సంబంధనాథుఁ డనుపేర
మధురలో నివసించుచుండె. ౩౦౧

కౌమరుసామియంశ మమరినకతమున
గౌరి స్తన్య మొసఁగి కాంచుకతన
బాల్యమందె జ్ఞానపరిపూర్ణుఁ డౌటను
అతని "జ్ఞానపూర్ణుఁ" డనిరి జనులు. ౩౦౨

ఆతఁడు పడకిరీతత్త్వ మరసి యుంట
శివునియుత్కర్షమే సదా చెప్పుచుంట
భస్మరుద్రాక్షమహిమలు పలుకుచుంట
విని తరించిరి మొకకొంద అనవరతము. 303

బౌద్ధులగురుత్వమున రాజవంశమెల్ల
దుర్విపాకతమస్సున దోఁగుచుండ
రాణియును మంత్రివరుఁడుఁ బరాకుఁ గొనక
సుందరేశ్వరునే నమ్మియుందు రెపుడు. 304

పాండ్యునిజ్వరము సంబంధనాథుఁ డుడుపుట.

విమతమతాంధకారపదవింబడి ఱేఁడు కులప్రసిద్ధస
త్క్రమమును వీడె నాతనివిధానము దిద్దఁగ జ్ఞానపూర్ణులై
యమరిసమీాకె చెల్లునుగదా యని మంత్రియు రాణియున్ సమ
స్తము నలజ్ఞానపూర్ణునకుఁ జక్కఁగఁ దెల్పిరి రక్ష కోరుచున్. 305

పాండ్యునికి నొక్కనాఁడు దుర్భరముగాఁగ
సోఁకెఁ దాపజ్వరమ్ము, తత్సుగతులెల్లఁ
దన్నివారణోపాయమ్ము లెన్నొ సలుప
బసుమమున హోమ మట్లు నిష్ఫలము లయ్యె. 306

బౌద్ధులచికిత్సలెల్ల నిష్ఫలమ్ముగ
నాథుఁ బ్రతికింప సంబంధనాథుఁడే యని
పిలిచి రాణియుఁ బతిభిక్ష పెట్టుఁ డనఁగ
నాతఁ డంగీకరించె వైద్యము నొనర్ప. 307

జ్ఞానాపూర్ణుఁడు తత్త్వవేది యగు నా సంబంధుఁడున్ శంకర
ధ్యానంబుం బొనరించి యంతిపురిఁ దానై సొచ్చి యత్యంతస
మ్మానం బొప్ప జ్వరప్రతప్తుఁ డగు నామాభర్త నీక్షించి హ
స్తానం దాఁకి శివప్రసాద మని భస్మం బుంచె ఫాలంబునన్. ౩౦౮

శశ్వచ్ఛివసంస్పర్శము
విశ్వత్రయభేషజము పవిత్రకరము భూ
మీశ్వరుని దాఁకినంతనె
యాశ్వాసము నందె నాతఁ డభవునికరుణన్. ౩౦౯

ఉదరభిదావిధమునఁ ద
న్నదలించెడితాప మడఁగఁగా భూపతియున్
గుదురుపడి జ్ఞానపూర్ణుని
పద మంటెను భక్తిభావపరిపూర్ణుండై. ౩౧౦

అది మొదలు పాండ్యభూపు దేహంబునుండి
తలఁగి తాపజ్వరమ్ము తథాగతుల మ
నంబులం దలముకొని చింతగను మాఱి
మించి ద్విగుణితమై విజృంభించె నంత. ౩౧౧

బౌద్ధులను జయించి యురికంబ మెక్కించుట

తాము కుదుర్పలేని జ్వరతాపము శైవుఁ డితండు దీర్చెనే ?
యేమిది యప్రతిష్ఠ మన మిచ్చినమందులు బూది బ్రుంగెనే
భూమిపుఁ డిట్టిమోహమును బూనెనె? వాదమునం జయించి యీ
పామరు శాంభవుం బరమపాపి నణంపక నిద్రవోదుమే ? ౩౧౨

కర మట వారికిఁ గలిగిన
పరాభవము దలంచి జైనబౌద్ధు లసంఖ్యుల్
పరిభవము సేయ మధురా
పురి సేరిరి జ్ఞానపూర్ణు మొట్టడిగొనుచున్. ౩౧౩

వ. అంత నాబౌద్ధజైనచార్యాళులు సంబంధనాథునితో శాస్త్రీయ చర్చలు పట్టుదలతో సలుప, ౩౧౪

అధ్యాత్మవిద్యయం దనధిగతాత్మమై
బౌద్ధులవాదంబు బడలువడియె
దర్శనంబులయం దదర్శనత్వము పట్టి
బౌద్ధులవాదంబు బడలువడియె
పాతంజలంబునఁ బతదంజలియె యాచు
బౌద్ధులవాదంబు బడలువడియె
న్యాయశాస్త్రమున బాధాంతమై పస చెడి
బౌద్ధులవాదంబు బడలువడియె
యుక్తివాదంబులోన నిర్యుక్తి యగుచు
శక్తివాదంబులోన నశక్త మగుచు
బౌద్ధజైనచార్యాళుల ప్రతిభలెల్లఁ
బరమశాంకరుకడఁ బటాపంచ లయ్యె. ౩౧౫

వ. అంత వారా శాస్త్రచర్చలు రాద్ధాంతములుఁ గట్టిపెట్టి శపథపూర్వకముగ నాతని జయింప సమకట్టి యొకవిధానంబు పన్నిరి.

శివలీలార్ణవము

సకలార్థుల్ దొలఁగింపఁజేయున దహింసాధర్మమే, శూలియున్
సకలంకుం డగుట న్ననర్హుఁ డగుఁ బూజల్ పొంద, భస్మం బశు
ద్ధికిఁ దా నౌట నమంగళప్రదము సందేహంబు లే, దంచు వా
రొకతాటాకునఁ దత్ప్రతిజ్ఞలను శాక్యోక్తిన విలేఖింపఁగన్.

మాన్యవేదాగమములె ప్రమాణము లగు
శంకరుం డొక్కరుండె విశ్వాధికుండు
పూర్ణమోక్షార్థి భస్మమే పూయవలయు
ననుచు జ్ఞానపూర్ణుఁడును దాటాకు వ్రాసె. ౩౧౯

ఇరుపత్రంబుల నగ్నియం దిడఁగ నం దెవ్వారిపత్రంబు రూ
పఱి దగ్ధం బగు, వార లోడినటులయ్యా! యంచు నాజైను లా
తఱిఁ దద్రీతి నొనర్ప వారి దగుపత్రం బప్డె మాఁడెన్, బరే
శ్వరసంబంధునిపత్ర మ్మబ్రముగఁ దేజస్వంత మయ్యెం గడున్.

జీవితాక్షరములతోడఁ జెలఁగ వారి
పత్రలిపులు జైనులు చేపట్టి మరలఁ
బదరి శూలాధిరోహణపణముగాఁగ
వేగవతియందుఁ బత్రముల్ వేసినారు. ౩౨౦

బౌద్ధపత్రము ప్రాగ్దిశ పట్టె యుదధి
నానుకొనియెఁ, బ్రత్యగ్దృష్టి యైనవాని
యాకు ప్రత్యఙ్ముఖముగఁ బ్రయాణ మగుచు
నేఁటికెదురీఁతగాఁ బోయి యేపు నూపె. ౩౨౧

శాంకరసార్వభౌమునివిశంకటవైదుషి యబ్ధి గాఁగ న
భ్రంకషభంగఘోషగ శుభంకరశంకరకింకరార్భటీ
సంకలితాట్టహాసజయజల్పితశబ్దము; శైవజేత లై
మంకు తొలంగి బుద్ధజనమాధ్యమికుల్ తల వంచి రార్తులై. ౩౨౨

అపుడు సంబంధనాథుఁ డత్యాదరమున
శైవధర్మప్రబోధ మచ్చముగఁ దెలుప
వినక వారు శూలారోహవిధికె కడఁగి
రదియె నిష్కృతిగా 'నాథుఁ' డనుమతించె. ౩౨౩

కాంచుచు వారిదుర్దశ నికామముఁ బ్రత్యయదర్శనాదులన్
సంచితపాపహారకము సత్యము పాశుపత మ్మటంచు లో
నెంచుచు జ్ఞానపూర్ణుని మహేశ్వరదీక్ష నొసంగు మంచు యా
చించెను గుబ్జపాండ్యుఁడు విచిత్రముగాఁ బద మంటి మ్రొక్కుచున్.

విమతులదీక్ష లంది యపవిత్రత గాంచినజేని దేహమున్
విమల మొనర్పఁ బూని కరుణించి *షడధ్వవిశుద్ధి సేసియున్
క్రమమునఁ *బంచసత్కళల నాదుల ధావన చేసి యీశ్వరా
గమవిధి శైవదీక్ష నిడి కాయవిశుద్ధి గురుం డొనర్చినన్. ౩౨౪

*షడధ్వములు :— 'షడధ్వాత్మా సదాశివః' పదాధ్వా, భువనాధ్వా, వర్ణాధ్వా,
తత్త్వాధ్వా, కలాధ్వా, మంత్రాధ్వా చేతి. (మంత్రశాస్త్రే)
"అస్మింశ్చక్రే షడధ్వానో వర్తంతే....షడధ్వవిమలం శ్రీచక్రం"- అనగా

తనుధనహృదయములను నా
తని కిడి గురుదక్షిణగ ముదంబున తేఃడున్
త్రిణయనుసేవ లొనర్చుచుఁ
బనుపడియెన్ శైవమార్గపాంథుం డయ్యేన్. 3౭౬

అవనిపతి శైవపదరూఢుఁ డైనకతన
సకలజనులు శివవ్రతాసక్తులైరి, శి
వాగమజ్ఞానసుధ గ్రోలి, యద్వితీయ
భవ్యశివమంత్రసక్తులై పరగినారు. 3౭౭

అధ్యాత్మవిద్యాసదాలంబనంబున
జ్ఞానులు మోక్షాభిమానులైరి
అష్టాంగవిద్యాసమాదరవృత్తిచే
యోగులు భోగసంత్యాగులైరి
అత్యపూర్వవివిధోపాసనాబలముచే
మందబుద్ధులు బుద్ధిమంతులైరి
అలసుందరేశుబాహ్యార్చనావిధులచే
సామాన్యులును భక్తజనము లైరి

---

షట్చక్రశుద్ధి కావించెనని భావము. ఇందు వర్ణపదమంత్రములు మంత్రాధ్వలు. ఇవి శబ్దబ్రహ్మస్వరూపములు. విమర్శాంశలు కలవి. ఇవి శక్తి భాగము. కలాతత్త్వభువనములు తత్త్వాధ్వలు. ప్రకాశాంశలుకలవి. ఇవి శివభాగము. ఈరెండు శాఖలును ఆత్మవలన కలుగును. దానిని శుద్ధియొనర్చి అని భావము.

*పంచకళలు :— నివృత్తి, ప్రతిష్ఠా, విద్యా, శాంతి, శాంత్యతీతాః కలాః.

అర్థబోధలతో వేద మపధరించి
భూతపతి నెంచి మేన విభూతి నలంది
యయుత రుదురాక లూని యప్పరిని జనులు
కుబ్జపాండ్యునియేల్బడిఁ గుదురుకొనిరి. 3౨౮

కూపశమీమహేశ్వరులు సాక్ష్య మిచ్చుట

కడచె నొకకొంత కాల, మక్కడనె వైశ్య
కులమునందు జనించె నొక్కరుఁడు ధనికుఁ
డతఁడు భార్య యున్నను, సుందరాంగి యైన
మేనమామపుత్త్రికను ప్రేమించి తెచ్చె. 3౨౯

ఆతఁడు శైవతీర్థముల నన్నిటిఁ గాంచ ననూఢతో మహా
కౌతుకవృత్తి నేఁగుడు నొకానొకచోటున సర్పదష్టుఁడై
పాతము సెందె, నామెగుద పట్టఁగరానిదురంత వేదనన్
భూతమనస్కయై మగనితోడిదె నాబ్రతు కంచుఁ జింతిలన్. 330

వ. తీర్థయాత్రాపరత నాసమయంబున సంబంధనాథుండును, 33౧

చెంతనె మహేశ్వరాలయసీమయందు
జ్ఞానపూర్ణుఁడు సంబంధనాథుఁ డుండి
తత్త్వము గ్రహించి యాసర్పదష్టు నపుడు
జీవితు నొనర్చెఁ బరశివాశ్రితుఁడు గాన. 33౨

సంజీవితుఁడై తేజః
పుంజమువలె నొప్పుజ్ఞానపూర్ణుని గని తా
నంజలి ఘటించి మిత్త్రిన్
భంజించినతము కిదే విస్రముఁడ ననియెన్. 333

వ. నాయందట్టిభావంబు నీకుం గలదేని, 33౪

ఓవణిగ్వర! నీ వీమహేశు నెదుట
ఆశమీతరుకూపముల్ సాక్షులుగను
దీనిఁ బెండ్లాడు మనుచు విధించి వేద
విధుల నాశుభ మచటఁ గావించె నతఁడు. 33౫

కొసకు నవోఢతో మధురకుం జనుదెంచి వణిగ్వరుండు సం
తసమున సుందరేశ్వరునితాంతసపర్యల భక్తియుక్తుఁడై
మసలఁగఁ దత్కృపాత్తగరిమన్ సుతు లిర్వురు గల్గి రంత నా
నిసుఁగులఁ జూడఁజాలక వినిందితవృత్తి సపత్ని యిట్లనెన్. 33౬

ఓసిదాసి! వేశ్యవో యనఁ జేరి నా
పతిని మఱఁగి సుతులఁ బడసి తీవు
ఇపుడు నీదు పెండ్లి కెవ్వరే సాక్షులు?
నడువు మవల నంగనాఁచికాన. 33౭

వ. అని తమకంబున నిందావాక్యము లాడ, 33౮

విని తన్నిందలు సైఁపఁజాలక సమావిర్భూతభూరివ్యథన్
దన కెవ్వారును దిక్కు లేమి జగదంతర్యామి యాసుందరే
శునిపాదంబులు పట్టి నాకిచట సాక్షుల్ మీరె మీసన్నిధిన్
మనునాకూపశమీతరుల్ కనవె? నమ్మం బల్కుఁడీయమ్మకున్.

ఆపద్బాంధవ ! నా కిటఁ
బ్రాపై సాక్ష్యమ్ము నాసపత్ని కిడనిచో
నీపాదసన్నిధిని ద
త్తాపార్తిని దనువు వీడెదన్ జగదీశా ! ౩౪౦

వ. అని పనవుచు త్రికరణశుద్ధిగాఁ బరమేశ్వరుసన్నిధానంబునం బడి
పొక్కి పొరలి వేదన చెందునంత, ౩౪౧

అవమతి నందకమ్మ మగువా ! తగుసాక్ష్యము లున్న వంచు నీ
సవతిని నాదుసన్నిధికిఁ జయ్యనఁ దె మ్మనుదివ్యవాణి యా
భవునిదెగాఁ దలంచు చది పర్వునఁ బోయి సబాంధవంబుగా
సవతిని దెచ్చి శంకరునిసన్నిధి నిల్పెను జూప సాక్ష్యముల్.

అంద అటఁ జేరులోన శివాలయమునఁ
గుదురులుకొనంగ నీశానకోణమందు
శివశమీకూపములు; మహాచిత్ర మనుచు
వారు కాంచిరి మిగుల సంభ్రాంతు లగుచు. ౩౪౩

సమ్మతి నీశివలింగము
జమ్మియుఁ గూపము వివాహసాక్షులు నుండీ
నమ్మింప వచ్చె నిచటికి
మిమ్మంగజ ననుచుఁ బలికె మిఁగిలినభక్తిన్. ౩౪౪

కాంచి తదద్భుతమ్ములు ప్రగాఢపుభక్తిని వారలెల్లరో
మాంచితగాత్రులై పొగడి రాపరమేశ్వరు; నంగపూజకే
తెంచినదేవతాగణము దివ్యదనంతతదద్భుతంబులన్
మించినభక్తిఁ బాడిరి శమింపఁగఁ దద్భవబంధజాలముల్. ౩౮౫

శంకరస్తుతి

వేదశాస్త్రపురాణముల్ వేవిధముల
వ్యర్థముగ దాఁచిపెట్టె నిన్ వామదేవ;
త్వద్దయాకోశమందిరద్వార మిచటఁ
దెఱచి యుంచితివేగదా దేవదేవ! ౩౮౬

ఈవు పాండ్యప్రియుఁడ వౌట నెద నెఱింగి
యగజ పాండ్యాత్మజాతగ నవతరించె
ఖంజరీటవరాహబకంబు లగుచు
మేము నట జనించిన నెంత మేలు గలుగు? ౩౮౭

మిక్కిలి మెత్తనయ్యవుసుమీ ప్రజపాలిట నీ, వపర్ణయున్
మిక్కిలి నిన్ను మించి కడుమెత్తన, యిద్వురు నిట్టులున్న నే
ఫక్కిని ముందుముందుఁ గడుపంగలవారలో? యేకశేషమై
చిక్కరె? మార్దవంబు బలుచిక్కులు బాధలుఁ దెచ్చిపెట్టదే? ౩౮౮

కాశీపతివై శిష్యుల
కీశా! మోక్షంబు నిచ్చితింతేగా, పాం
డ్యేశుండ వగుచు నోస
ర్వేశా! సర్వులకు మోక్ష మిడి తధికుఁడవై. ౩౮౯

పంచమతరంగము

ఓమని సర్వజనాళికిఁ
గామితము లొసంగుకతనఁగా దేనికా
నామము గలిగెను బ్రణవ
ప్రామాణ్యార్థముగ, భక్తపాపవిభంగా! 3౫౦

అమలభవదీయతత్త్వ మనాహతమున
వెదుకఁదగు నని యాగమవితతి పలికె
మమ్ము చంపిన; దిట పాండ్యమహీపుచేత
యాహతమునందె యాతత్త్వ మరసి యుంట. 3౫౧

సింహావలోకనము

శివ! నీమహాలయసీమ ద్రొక్కి నయంత
వృత్రశత్రునిపాపవితతి తొలఁగె
నీదుపుష్కరిణి మున్గియు నింద్రగజ మిట్టె
మునిశాపపరితాపమునకుఁదొలఁగె
నీదయ నీపవని రాజధానిని
గులశేఖరస్వామి కూర్చుకొనియె
భవదనుజ్ఞను బొంది పార్వతి పాండ్యవం
శమునఁ దటాతకాజని వహించె

అని నిన్నుం గెల్వఁబూనినయామె నెలమి
సరసముగఁ బెండ్లియాడినసజ్జు వీవు
రజతసభలోన నృత్తసంగ్రహము నెఱపి
భర్తృని బతంజలిన్ దృప్తిపఱచి తీవు. 3౫౨

అభవ ! నీశక్తిచే నన్నపూర్ణమయుఁ గుం
డోదరుక్షుధ దీర్ప నోపదయ్యె
వేగవతీమహావిమలాపగయు భవ
ద్దాసుపిపాస పోదట్టదయ్యె
స్నాన మొనర్పఁ గాంచనమాలసన్నిధి
జలనిధు లేడింటి నిలిపి తీవు
మలయధ్వజుని స్వర్గనిలయుని బిల్చి త
త్పత్నికిఁ జూపించి తనిపి తీవు

విమలసుందరపాండ్యరూపము ధరించి
యెలమి మీనాక్షిదేవిభర్తృత వహించి
యుగ్రపాండ్యుని సుతునిగా నొంది దయను
శక్తిదండాయుధముల నొసంగి తీవు. 3౫3

ఉగ్రపాండ్యుఁడు నీమహోగ్రశక్తి వహించి
చెలరేఁగుజలధి శోషింపఁ జేసె
నీ వొసంగినవజ్రమే పూని యారాజు
దేవరాణ్మౌళి భేదించివైచె
శర్వ ! నీ విచ్చినచండాయుధమ్మూని
మేరువుం జఱిపి బంగారు గొనియె
జిజ్ఞాసువులఁ దపస్సిద్ధుల నీబోధ
దివ్యబోధనులుగఁ దీర్చి దిద్దె

ఈ వోసంగురత్నకిరీట మెలమిఁ దాల్చి
పాండ్యబాలకుఁ డభిషేకపాండ్యుఁ డయ్యె
నీశపర్యోద్భవంబులై నీరదములు
జలధిపొంగును జల్లార్పఁ జాలెఁ గాదె. ౩౫౮

పటుమంటపముగ నేర్పఱిచి వారిదముల
　　నతివృష్టిబాధల నణఁచి తీవు
మధురాపురిని సిద్ధమానవాకృతి పూని
　　జనులకు సిద్ధు లొసంగి తీవు
రాతియేనుంగుచే రహి నిక్షుకాండముల్
　　ప్రీతితోడుతఁ దినిపించి తీవు
జైనప్రయుక్తగజంబును నారసిం
　　హాస్త్రంబుచే హతమార్చి తీవు

అత్తగారిదుర్భాషల కడలుగొనిన
యబలఁ గాపాడఁ బ్రత్యక్ష మైనవాఁడ
వతిదయామతిఁ బాండ్యునభ్యర్థనమున
నసిగ వ్యత్యస్తనృత్యము సలిపి తీవు. ౩౫౯

పాంథద్విజునిభార్యఁ బట్టి చంపె నటన్న
　　వ్యాధునియపనిందఁ బాపి తీవు
మాతృజారుఁడుఁ బితృఘాతియౌ బాపని
　　పాపమ్ము తొలఁచి కాపాడి తీవు

అంకునిసత్పత్నిఁ నపహరించినయ(స్త్రి)
శిష్యు నోడించి భంజించి తీవు
మాయాభుజంగమున్ మాడ్చి మాయాగవిఁ
బసవనిచే ఁ ద్రొల్లుపఱిచి తీవు

పాండ్య సేనాధిపతిని గాపాడఁ దలఁచి
విభునికి మహాశ్వసేనఁ జూపించి తీవు
బంగరం బిచ్చి తీవొక్క పాండ్యనకును
నీదులీలలు వర్ణింప నేర మాధవ ! ౩౫౬

వైశ్యాంగనలకుఁ జేవలయమ్ముల నొసంగి
నీదుసాయుజ్య మందిచ్చి కాచి
ఆలయస్థు నొనర్చి చోళుపూజల నంది
పానీయు మిడి పాండ్యసేన మనిచి
సిద్ధరసం బిడి శివధర్మిణిని గాచి
పాండ్యుని కాశ్యేక భావ మంది
అక్షయతండులభిక్ష భక్తుని (బ్రోచి
మామవై వటుని గోమటిని నిలిపి

అర్జునాఖ్యలింగంబునం దధివసించి
వరగుణునిపాపములనెల్ల వరదఁ గలిపి
కట్టెలను మోసి నీభక్తగాయకుని వి
శిష్టుగాఁ జేసి చేరి రక్షించి తీవు. ౩౫౭

భూరివిత్తము చేరభూపుచే నిప్పించి
భద్రగాయకుని గాపాడి తీవు
ఆతఁడు తడిసి ముద్దయ్యు నిక్క గొనియాడ
ఫలక మొండొసఁగి కాపాడి తీవు
ద్వీపాంతరాగతదివ్యగాయనిని ద
త్పత్నిచే నోడించి పంపి తీవు
అలవరాహాకృతి నంది కూనలకెల్ల
స్తన్యామృతంబు నొసంగి తీవు

పందిపిల్లల కటు మానవత్వ మొసఁగి
పాండ్యసాచివ్య మొనరింపఁ బనిచి తీవు
భీతి నిను జేసుకాటుకపిట్ట కెలమి
నమితబల మిచ్చి ప్రోచినయయ్య వీవె. 3౫౮

స్వర్ణపుష్కరిణి మత్స్యముల్ దొలఁగించి
మేటికొంగ ననుగ్రహించి తీవు
మధురాపురంపుసీమావిభాగము దెల్పఁ
గంకణాహిని బంపఁగల్గి తీవు
నీపేరు గలయమ్మ లేపార సారించి
పాండ్యశత్రువులను బఱపి తీవు
కుకవిదురాసదం బకలంకఫలకము
కవిభక్తుల కొసంగఁ గలిగి తీవు

3౫౯

పాండ్యభూజానియెద నున్న భావ మరసి
పద్యము నొసంగి భక్తుఁ గాపాడి తీవు
మేనురం బగువిద్యావివాదమందు
నిన్ను దూషించుకీరు మన్నించి తీవు. ౩౫౯

ద్రామిడసూత్రార్థతత్త్వం బగస్త్యుచేఁ
గీరున కందించి కేరి తీవు
బహుసూత్రవృత్తుల ప్రాశస్త్యమును మూక
ముఖముగఁ జెప్పించి మురిసి తీవు
భక్తావమానంబు పాండ్యుం డొనర్పఁగా
మధురాపురిని వీడి కదలి తీవు
జగదంబ దాశకన్య గ నుద్ధరింపఁగా
నక్కాంతనే పెండ్లియాడి తీవు

శైవదీక్షను పాతభూజాని కిడుచు
నక్కలను గుఱ్ఱములుగఁ బొనర్చి తీవు
వేగవతిని బొంగించి యావిభుని చెఱులు
పాయఁగాఁ జేసి దయను గాపాడి తీవు. ౩౬౦

వేత్రాహతిని బంచిపెట్టి యందఱకు నీ
విశ్వాత్మకత నిరూపించి తీవు
పాండ్యునిజ్వరము సంబంధనాథుని బంచి
చిత్రమ్ముగ శమింపఁ జేసి తీవు

అతనిచే బౌద్ధుల నందఱ నోడించి
యురికంబముల వారి నుంచి తీవు
శివశమీకూపాల నవతరిల్లఁగఁ జేసి
సాక్ష్యముల్ పలికింపఁ జాలి తీవు

సాంబ ముల్లోకములకు నాలంబ మీవ
మొదలె నిర్వ్యాజకారుణ్యమూర్తి వీవ
నీదులీల లనంతమై నెగడుచున్నఁ
దలఁతు మీపాటి కొన్ని లీలలనె నేఁడు. ౩౬౧

హాలాస్యనాథుకృపఁ ద
ల్లీలలు వర్ణించినాఁడ లీలగ జననీ!
హేలగ విని నను దయతోఁ
బాలింపవె మీననేత్ర! పాపలవిత్రా! ౩౬౨

ఆపురారిపాదార్పిత మైనదీన
నవరసములకు స్థాన మున్నదియు లేద?
యనెడిసందేహ మేల యిం దమరెఁ గాదె
జననికారుణ్యనవరసాసారవృష్టి. ౩౬౩

మధురయం దొక్క పెన్నిధి యున్న దని ముందు
వీనులవిందుగా వినఁగవలయు
నిజము తన్నిధి జగన్నిధిగ హేతువులచేఁ
జిత్తాన మననము సేయవలయు

వరదివ్యసుందరేశ్వరమూలలింగము
నెఱనమ్మి యెదను ధ్యానింపవలెను
మీనాక్షిసహచర మైనశాంకరతత్త్వ
మెంచి దర్శించి సుఖించవలెను

సకలజనులబాధలు దీర్పఁ జాలువాఁడు
అంబ మీనాక్షిసాచివ్య మందువాఁడు
అలకదంబకాననస్థవాసి మైనవాఁడు
ఆతఁడు చిరంతనుండు విశ్వాధికుండు. ౩౬౪

"ఓ మితి శివమ్"

ఇది:- శ్రీమదాత్రేయసగోత్ర, దువ్వూర్యుపనామకపవిత్ర,
పెదశేషయార్య శేషమాంబా ద్వితీయపుత్త్ర, మహా
గాయత్రీశరణ్య, గురువేంకటరమణకారుణ్య
సూర్యనారాయణశాస్త్రి ప్రణీతం బైన
ఆంధ్రశివలీలార్ణవ
మహాకావ్యంబున
పంచమతరంగము
సర్వంబును
సమాప్తము.



# దుప్పూరి సూర్యనారాయణశాస్త్రి రచనలు



1. జీమూతవాహనుడు (పద్యము) బి. ఏ. ఇంటరులకు పాఠ్యము. ఆంధ్ర, మదరాసు, ఉత్కల, విశ్వ విద్యాలయములు 1941-46 వెల 1—25
2. జడభరతుడు (పద్యము) బి. ఏ. పాఠ్యము. ఆంధ్ర 1950-55 1—25
3. అహల్య (పద్యము) బి. ఏ. పాఠ్యము. ఆంధ్ర 1957-60 ఉత్కలలో బి. కాం. పాఠ్యము. 1965-68 3—00
4. భక్తశబరి (పద్యము) ఉత్కల. పి. యు. సి. పాఠ్యము 1965-68. 1—60
5. నీలకంఠవిజయము. చంపూప్రబంధము. 3—00
6. ఆంధ్రీకృత శివలీలార్ణవము. 5—00

ప్రతులకు :—

దుప్పూరి సూర్యనారాయణశాస్త్రి,

కాకినాడ-2.